సరస్వతీ గ్రంథమండలి నాటకానుబంధము 8

శ్రీ

# చంద్రగుప్త

# CHANDRAGUPTA

గ్రంథకర్త
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎం. ఏ., బి. యల్.,

ప్రకాశకులు
అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారు
సరస్వతీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము

1929

 [వెల 1—0—0

# ఈ నాటకమందువచ్చు ప్రధాన పాత్రములు

## పురుషులు.

| | | |
|---|---|---|
| సికిందర్ | ... | యవనాధిపతి. |
| సెల్యూకస్ | ... | సికిందరు సేనాధిపతి. |
| ఏంటిగోనస్ | ... | యవనసైన్యాధ్యక్షుఁడు. |
| నందుఁడు | ... | మగధాధీశ్వరుఁడు. |
| చంద్రగుప్త | ... | నందుని సవతిసైదోడు. తదుపరిభారత సామ్రాట్టు. |
| వాచాలుఁడు | ... | నందుని బావమఱఁది. |
| చాణక్యుఁడు | ... | ఒక బ్రాహ్మణుఁడు. తదనంతరము చంద్రగుప్తునిమంత్రి |
| కాత్యాయనుఁడు | | నందునిమంత్రి. |
| చంద్రకేతు | ... | మలయాధిపతి. |

## స్త్రీలు.

| | | |
|---|---|---|
| హెలెన్ | ... | సెల్యూకస్ కూఁతురు. తదుపరిభారత సామ్రాజ్ఞి. |
| ఛాయ | ... | చంద్రకేతు సోదరి. |
| ముర | ... | చంద్రగుప్తుని జనని. |

# చంద్రగుప్త

# CHANDRAGUPTA

## (A Historical Drama)

---

### ప్రథమాంకము

---

#### ప్రథమరంగము

**సింధునదీతటము:—దూరమున గ్రీకునౌకాశ్రేణి కానంబడును.**

సంధ్యాకాలము

నదీతీరస్థశిబిర సమ్ముఖమున సికిందరు సెల్యూకసులస్తాద్రిఁ జేరు విభావసును విలోకించుచు నిలువబడియుందురు. సెల్యూకసుకరముఁ బట్టుకొని హెలెన్ వాని పార్శ్వమున నిలువబడియుండును. సూర్యుని కిరణరశ్మి, ఆ కామిని ప్రఫుల్లవదనముపైఁ బ్రసరించి దానిని విభాసిత మొనరించును.

**సికిందరు**—ఆహా! ఈ విషయమెంత విచిత్రమైనది! దివమునఁ బ్రచండ మార్తాండుఁ డీసీమగాఢ నీలాభ్రమును దగ్ధమొనరింప, విభావరిని శుభ్రశీతాంశువు తన స్నిగ్ధజ్యోత్స్నాంబువుచే నవ్విన్నును స్నాత మొనరించుచుండును! దిగంతములన్నియుఁ దమఃపటలావృతములై యుండు రాత్రులందగణ్య భాస్వరజ్యోతిఃపుంజము నభనారివక్షమునఁ బ్రకాశించుచుఁ గనుల మిఱుమిట్లు గొలుపుచుండ విస్మితాతంకపూర్ణచిత్తుండనై, నేనావింత దృశ్యమును వీక్షించుచుందును—ప్రావృట్కాలమున ఘనకృష్ణ కాదంబినీ పంక్తులు గురుగంభీర గర్జనల సలుపుచు, దశదిశల ముఖరిత మొనరించుచు, బ్రకాండ దైత్యవాహినీ వితానము వడువున వియత్తలము సం

ఖండమం దర్ధభాగము ననన్మద్విజయవాహినీ వీరపదభరకంపితఁ గావించితిని. కాని నేఁ బ్రథమమునఁ బ్రతిఘటింపఁబడినదీ శత ద్రూతీరమందే ! తలంచినంతనే యీవిజయపర్యటనము మిక్కిలి ఆశ్చర్యకరముగఁ దోఁచును.

[చంద్రగుప్తుని బట్టుకొని యేంటిగోనసు ప్రవేశించును]

సికిందరు—సైన్యాధ్యక్షా ! వార్తలేమి ? ఈతఁ డెవ్వరు ?

ఏంటిగో—గూఢచారుఁడు !

సికిందరు—ఏమి ! గూఢచారుఁడా !!

సెల్యూకసు—గూఢచారుఁడా !

ఏంటిగో—[సికిందరు నుద్దేశించి]—స్వామీ ! ఒక నిర్జనప్రదేశమం దీతఁ డొక శిబిరపార్శ్వమున నుపవిష్టుఁడై యొకతాళపత్రముపై నేదియో లిఖించుచుండెను. శంకాసంకలితచిత్తుఁడనై తా నేమి వ్రాయుచుండెనో చూపుమని నే నీతని నడిగితిని. దాని నాతఁడు చూపెఁగాని, నాకది చదువ శక్యముకాలేదు. దానంజేసి యీతని దేవరసమ్ముఖమునకుఁ దోడ్కొని వచ్చితిని.

సికిందరు—యువకుఁడా ! నీ వేమి వ్రాయుచుంటివి ? నిజము చెప్పుము.

చంద్రగుప్త—నిక్కము వక్కాణించ మందురా !—రాజాధిరాజా ! భారతీయుఁ డింకను నసత్యము వచించుట నేర్చియుండలేదు.

సికిందరు—మంచిది ! నీ వేమి వ్రాయుచుంటివో చెప్పుము.

చంద్రగుప్త—నేను సార్వభౌముల వాహినీచాలనము; వ్యూహరచనా ప్రణాళి, సామరికనియమములు మోసము దినములనుండి నేర్చుకొనుచుంటిని.

సికిందరు—[అతఁ డింకను చెప్పఁబోవుచుండ]—ఎవరికడ ?

చంద్రగుప్త—మీ సేనాధిపతికడ.

సికిందరు—సెల్యూకసూ! ఈతనిఘోషలు విశ్వసనీయములేనా ?

సెల్యూకసు—స్వామీ! నిక్కమే !!

సికిందరు—[చంద్రగుప్తు నుద్దేశించి]—తదుపరి ?

చంద్రగుప్త—యవనసైన్య మెల్లి యీప్రదేశము వీడిపోవునని విని, నే నేర్పుకొనిన విషయముల నన్నింటి నీ పత్రముపై లిఖించు చుంటిని.

సికిందరు—ఎందులకు ?

చంద్రగుప్త—సికిందరు షాహాతో సమీక్ష మొనర్చుటకై కాదు.

సికిందరు—ఇంకెందులకు ?

చంద్రగుప్త—అట్లైన వీరవరా! నాయుదంతము నాకించుక వినుఁడు. నేను మగధాధీశ్వరుని పుత్రుఁడనగు చంద్రగుప్తుఁడను. నాజనయిత మహాపద్మనందుఁడునానవతిసైదోడగు నందుని సింహాసనాధికారిగఁ జేసి, నిజసీమనుండి నన్ను వెడలఁగొట్టెను. అందులకుఁ బ్రతీకారము సలుపఁదగు నుపాయము నన్వేషించుచు నేను భ్రమణ మొన రించుచుంటిని.

సికిందరు—తదుపరి ?

చంద్రగుప్త—అట్లు భ్రమణ మొనరించుచు మాసిడన్ భూపతి యద్భుత విజయకథ నాలించితిని. అర్ధయాసియాను నిజపదత లమున దళిత మొనరించి, నదీనదముల, గిరులను నిర్వక్ర పరాక్రమంబున నతిక్రమించి, భారతవర్షమునఁ బ్రవేశించి, యార్యకుల భాస్కరుండగు పురుషోత్తము నామొక్కలీడు పరా జితుఁ గావించెనను యుదంతమును బూర్తిగ నెఱింగి నేను మిగుల నబ్బురపడితిని. ఓసార్వభౌమా! ఎవని భ్రుకుటిని వీక్షించినంతనె యాసియాయంతయు నాతని చరణతలమునఁ బొరలాడెనో, ఆతని పరాక్రమమెట్టిదో విలోకింపవలెనని యుత్తాపున కరుదెంచి,

మీ సేనాపతి కడ శిక్షఁబడయఁ దొడంగితిని. నాయపహృతరాజ్యమును పునరుద్ధార మొనరించుకొనుటే నాయిచ్ఛ!—అంతకంటె వే ఉద్దేశ్యమేమియు లేదు.

[సికిందరు సెల్యూకసుపై దన దృక్కులంబఱపును.]

సెల్యూకసు—ఇంతవఱకు నా కీతని నిజవృత్తాంతముఁ దెలియలేదు. ఈయువకుని వేషభాషలు నాకు ముద మొదవించినవి. దానంజేసి నే నతిసరళభావమున యవనసామరిక ప్రథఁ గూర్చి యీతనితో ముచ్చటించువాఁడను! ఈతఁడు విశ్వాసఘాతకుఁడని నేఁగలనైనఁ దలంపలేదు.

ఏంటిగోనస్—విశ్వాసఘాతకుఁ డెవరు?

సెల్యూకసు—ఈయువకుఁడే!

ఏంటిగోనస్—ఈయువకుఁడా నీవా?

సెల్యూకసు—సైన్యాధ్యక్షా! నావయసును పాటింపకున్నను, నాపదవినైన లెక్కించి ప్రవర్తిల్లుము.

ఏంటిగో—నీపదవిని నే నెఱుంగకపోలేదు. యవనసేనాధిపతి వయ్యు నీవు విశ్వాసఘాతుక కృత్యమాచరించితివి!

సెల్యూ—దుర్మతీ! ఏమి నీ దుష్ప్రలాపము!!

[తరవారి నొరనుండి వెలికిఁదీయును.]

ఏంటిగోన సధికతర వేగమున నిజకృపాణము నాస్ఫాలన మొనరించి సెల్యూకను శీర్షము నరుక నుంకించును. చంద్రగుప్తుఁ డధిక తమ వేగమున తన కత్తిచే నయ్యాఘాతమును నివారణ మొనరించును. సెల్యూకసును వదలి యేంటిగోనసు చంద్రగుప్తుని డీకొనును.

సికిందరు—ఓహో! ఇదేటి కయ్యము!! శాంతింపుఁడు! శాంతింపుఁడు!!

పోరాటమున యేంటిగోనసు కృపాణము చంద్రగుప్తుని ఖడ్గాఘాతముచే నేలఁగూలును.

సికిందరు—[ఏంటిగోనసు నుద్దేశించి]—ఏమి నీదుండగము!

ఏంటిగోనసు—లజ్జచేఁ దలవంచికొనును.

సికిందరు—సైనికుఁడా! ఇట్టి యాధార్థ్యముఁ జూపు మనుజుఁడు నాసామ్రాజ్యమం దుండఁదగఁడు! ఇయ్యవసరమందే నీవు నా రాజ్యమునుండి తొలఁగిపొమ్ము. ఒకసామాన్య సైన్యాధ్యక్షు నకింత పొగరా? నీవిట్టి కట్టిడివని నేఁ గలనైనఁ దలఁచియుండ లేదు. పొమ్ము—యీ ముహూర్తమందే వెడలిపొమ్ము!!

[ఏంటిగోనసు నిష్క్రమించును.]

సికిందర్—సెల్యూకసూ! నీయపరాధమంత యెక్కుడుది కాదు! కాని యవనభూపతి సమ్ముఖమున యవనసేనాపతి కంఠచ్ఛేదము చేయుట తగదని యెఱిఁగి, యిఁక సప్రమత్తుడవై ప్రవర్తిల్లుము!—యువకుఁడా!

చంద్రగుప్త—ఏమి రాజా!

సికిందరు—నిన్నిపుడు కైదీఁ గావించిన నేమి చేయుదువు?

చంద్రగుప్త—ఏమి యపరాధము సలిపితినని నన్నుఁ గైదీని గావింతురు?

సికిందరు—శాత్రవుల గూఢచారుఁడవై నాశిబిరమునఁ బ్రవేశించి నీవపరాధ మొనరించితివి.

చంద్రగుప్త—ఓహోహో! ఏమి యపరాధ మేమి యపరాధము! సికిందరు షాహా యేమో గొప్ప వీరుండని దలంచితిని. అతఁ డతిభీరుండని యిపుడు తెల్లమయ్యెను! ఆశ్రయము లేని హిందూ రాజపుత్రుఁ డొకఁడు విద్యార్థియై తన్నుఁ జేర, నీయవనుఁడు భయకంపితుఁ డగుచున్నాఁడు. సికిందరు భయశీలుఁడనియు,

గాపురుషుఁడనియు నే నెన్నఁడుఁ దలంచి యుండలేదు !

సికిందరు—సెల్యూకసూ ! ఊఁటిక మిట్టిపడు యీాకట్టిడిని బందీ గావింపుము !

చంద్రగుప్త—చక్రవర్తీ ! నన్ను వధింపక గైదీ గావింపఁజాలవు !

[ఒరనుండి కృపాణమును వెలుపలికిఁదీయును.]

సికిందరు—[సోల్లాసమున]—శబాస్ ! శూరా ! నీవీకఁ జనుము ! నిన్ను బంధింపను ! ఇంత దనుక నేఁ బరీక్షమాత్రము సలుపు చుంటిని. నిర్భయుఁడవై నీవిఁక నీరాజ్యమునకు మగుడిపొమ్ము. కాని, యిపుడు నేఁ దెలుపు విషయమును జ్ఞప్తియుంచుకొనుము. యువకుఁడా ! కాలక్రమమున నీవు నీయపహృత రాజ్యము నుద్ధరించుకొనఁజాలుదువు. నీవు దుర్జయ దిగ్విజయుండవగుదువు!—వీరవతంసమా ! పొమ్ము !—నీవు విముక్తుఁడవు !!

ద్వితీయరంగము.

శ్మశానప్రాంతము—ప్రత్యూషకాలము

చాణక్యుఁ డేకాకియై, నిలువఁబడియుండును.

చాణక్య—ఈబద్ధాంబువునుండిధూమకుండలి మిక్కిలిగనుత్పన్నమగుచున్నది! కాక గృధ్ర భైరవ ఝుక్కారసందోహము నంజుడు గుడిచి పాలవైచిన యెముకలు మిగుల గ్రుళ్ళఁ దదస్థిపుంజవినిర్గతదుర్గంధము సమీరుని నిశ్వాసమును రుద్ధమొనరించివైచుచున్నది. ఆ ఘూతకాయములైన జోనంగుల వికారాక్రందన మీా పరిత్యక్తప్రాంతర స్తబ్ధతను భంగమొనరించుచున్నది ! ప్రభాతరమణీయంగ ప్రత్యంగము లన్నియుఁ జాలగాయములతో నిండి అసహ్యాకరమగు చీము నెత్తురు విడచుచున్నవి! హేసుందరభీభత్సరమణీ! నీసౌందర్య మెంతయద్భుతమైనది ! అయ్యాకర్షణముకతననే పల్లె

వీడి ప్రత్యహప్రత్యూషమందీకద్దర్యతయందే ధానమాడ నేఁ బర్వెత్తుకొనివచ్చుచుందును. ప్రేయసీ! చాలశిక్ష గఱపితివి! పృధ్విమొడ నసహ్యము చూపుట, సంసారము సేవగించుట, శక్తినిఁ దుచ్ఛమొనరించుట మొదలగు గుణంబులనన్ని నీవే నాకు నేర్పితివి! సుందరీ! నన్నీజగమునుండి దూరముగ నీశక్తికొలఁది యీడ్చుకొనిపోయుమా. అట్లీవు నన్నుఁ గొంపోవుస్థానము నరకమైననుసరే! పృధ్వినుండిమాత్ర మది దూరముండవలెను!

(ఇరువురువ్యక్తులు ప్రసంగించుచు వచ్చుచుందురు.)

ప్రథమవ్యక్తి—అయితే సెట్టీ! యిపుడు క్రొత్తమంత్రి కాత్యాయనుఁడా?

ద్వితీయవ్యక్తి—కాత్యాయను డేలాఅయినాడు! మంత్రియైనది శాకతాలువుగారు! ఏలాగోలాగ నీచెముడు వదలగొట్టుకొంటేనేగాని యిటువంటి పొరపాట్లు యికముందు యింకా యెక్కువవుతవి!

ప్ర॥ వ్యక్తి—ఆహాహా! ఏం తెలి వేం తెలివి! మంత్రియైనది కాత్యాయనుడైతే, శాకతాలువనుచున్నావా? శాకమంటే కూర, తాలువంటే దవుడ! ఎక్కడైనా 'కూర దవుడగా' రనేమంత్రి వుంటాడా? అయితేకాని సెట్టీ! నాకదే చాలవిచిత్రంగా కనబడుతోంది!

ద్వి॥ వ్యక్తి—ఏది? ఏది? ఏది?

ప్ర॥ వ్యక్తి—ఓ! ఏమికంగారో దొరబ్బాయీ! ఒక్కమాటే అనే శావు పాతికయేదీలు!

ద్వి॥ వ్యక్తి—నీకు చిత్రంగా కనబడుతోన్నది యేది?

ప్ర॥ వ్యక్తి—ఉంచివుంచి చివరకు మహారాజు వానిని కైదులోనుంచి విడిచిపెట్టుట గొప్పచిత్రం! కాని వూరికే విడిచి వూరుకున్నాడా?—విడిచీవిడిచెయ్యడం తడవుగా వాడిని మంత్రిసి చేశాడు!

తరవాతో?.

ద్వి॥ వ్యక్తి—తరువాత యేమి?

ప్ర॥ వ్యక్తి—తరువాత వాడికొడుకులను యేడుగురిని ఆలోకానికి పంపేడు! ఆఖరికి మహారాజుగారి దయ యిల్లా తేలిరిది!

ద్వి॥ వ్యక్తి—అందుకుచేతనే రాజులు తలతిక్కవుమనుష్యు లంటారు పెద్దలు! అల్లా వాళ్ళూరికే చెప్పేరా యేమిటి?

దూరమున చాణక్యుఁడు—"విశ్వాసో నైవకర్తవ్యః స్త్రీషు రాజకులేషుచ"

ప్ర॥ వ్యక్తి—చూడుచూడు! వాఁడెవరు? వాఁడెవరు?

ద్వి॥ వ్యక్తి—చాణ—చాణ—చా-చా-చాణ-క్యుడనే బ్రాహ్మడు.

ప్ర॥ వ్యక్తి—ఓ! అదేమిపేరో సుబ్బిశెట్టీ! నీకు నోరే తిరిగిందికాదు. అయితే వాఁడు మనిషేనా?

ద్వి॥ వ్యక్తి—మనిషనే విన్నాను కాని, నాకు నమ్మకంచాల్లేదు!

ప్ర॥ వ్యక్తి—రా! రా!! ఇంక వెనక్కి మళ్ళుదాముగా! ఒంటిబ్రాహ్మడి శకునం! మనకింకా పెళ్ళాంబిడ్డలు వున్నారు!—వెనక్కిరా!

ద్వి॥ వ్యక్తి—నడునడు! వాడిని చూచేటప్పటికి నాకు దడపుట్టుతోంది!

ప్ర॥ వ్యక్తి—ఓయి 'నూతిలో వురికి!' రా! రా!!

(ఇరువురు వేగముగ నిష్క్రమింతురు.)

చాణక్య—(వారలు చనుచుండ) ఏమీ! నేఁ డీనీచులకావర మింత వఱకు హెచ్చెనా!!—(బ్రాహ్మణునిఁ జూడగనే యొకనమస్కారమైనఁ గావించుటకు వారలకుఁ జేతులు లేవకున్నవి. ఆహా! ఆదినములు గడచిపోయెనుగా!!—మంచిది! నీచులారా!! పొండు! నాఘాతుకుఁడైన చాకలుఁడు—నా నిశ్వాసమందు విషమున్నది! నేను దుర్భిక్షుండను!

(దూరమునుండి కాత్యాయనుఁడు ప్రవేశించును.)

చాణక్య — ఏమీ! నేను నిస్సహాయ దారిద్ర్యపీడితబ్రాహ్మణుండనని తుదకీ నీచకుశాంకురముకూడ తలయెత్తి నిలువంబడినది! ఉండు ముండుమో! నిన్ను, నీతోనున్న కుశగుచ్ఛమును యిప్పుడే నిర్మూలముగావించెదను — (కుశగుచ్ఛము నూడ పెఱుకుచు దానిని గాలియందు విడువదొడంగును) — ఇపు డేలాగుననున్నది? — నా సంగతి బోధపడినదా? — ఇఁ కెపుడైన విప్రుని నగ్నపదమును నొప్పింతువా?

కాత్యాయన — (ముందునకువచ్చి) — విప్రపుంగవా! ప్రణామము.

చాణక్య — నీ వెవఁడవు?

కాత్యాయన — నందమహారాజు మంత్రిని — కాత్యాయనుఁడను.

చాణక్య — ఓహో! నందుని మంత్రివా!! — అట్లైన దూరముగఁ దొలఁగిపొమ్ము!

కాత్యాయన — తొలఁగిపోవు టెందులకు? ఆర్యా! నేనేమి యపరాధ మాచరించితిని?

చాణక్య — అయ్యా! ఏ యపరాధమైన నీవేల చేయుదువు! నీవు కాని, నీ తేఁడుకాని యెట్టియపరాధము సలుపలేదు. ఈశ్వరుఁడు కూడ నెట్టి యపరాధముఁ గావించియుండలేదు. ఎన్ని యపరాధము లున్నవో వాని నన్నియుఁ గావించినది నే నొక్కరుఁడనే! బ్రాహ్మణుని యాస్తియని సంశయింపక నీరాజు నా సర్వస్వమును తనకడుపునఁ బెట్టుకొనినాఁడు — ఆతఁడట్లు కావించుట నా యపరాధమే! పరాత్పరుఁడు నా గృహమును శూన్యము గావించినాఁడు — అదియు నా యపరాధమే!! దస్యులు పల్వురరుదెంచి నాయనుంగు నందని నపహరించిరి — అదియు నా యపరాధమే!!!

కాత్యాయన—పండితవర్యా! నేను భవద్దర్శనార్థమై యరుదెంచితిని.

చాణక్య—నాదర్శనము నీ కెందులకు బాబూ!—నాకిఁక నేమియు లేదు! ఇప్పుడు నాకు మిగిలిన దీప్రాఁతయిల్లుమాత్ర మొక్కటియే! వాంఛ గలదేని యీ శూన్యకుటీరమును దగ్ధ మొనరించి వెడలి పొమ్ము!—ఆహా! ఇప్పటి బ్రాహ్మణుల కానాఁటి ప్రతాపమే యుండిన—

కాత్యాయన.—విప్రవరా! ఎందుల కుండదు?—పాణిని మహాశయుఁడు—

చాణక్య—(తనలో)—కాని, యిది వారి దోషమే! విద్యాయశశ్శక్తు లన్నియుఁ దమ యొక్కరి హక్కేయని దలఁచి వారౌన్నత్యశిఖరమున నొక్క దాటులో నెక్క నుంకించిరి! శరీర మనశ్శపీడితం బగుచుండ మస్తిష్క వృద్ధి కాఁజాలునా? అదెన్నఁడైన సంభవమా!—మంచిది! సుందరీ! నీవు చెప్పుము! ఆవృద్ధి యెన్నటికైన సాధ్యమా? సాధ్యమే యగుచో, యిట్టి యధఃపతన మేల వాటిల్లును?

కాత్యాయన—ఇదేటి వింత! ఈతఁ డిపు డెవరితోఁ బ్రసంగించుచున్నాఁడు!!

చాణక్య—ఆహా! ఎట్టి యధఃపతనము!! ధరాధర శిఖరమునుండి గభీరగహ్వరాభ్యంతరమున నొక్కటియే లంఘనము! సిగ్గు బిడియము లించుకంతయు లేవు! ఒకప్పు డెవ్వాని యజ్ఞోపవీతముఁ గాంచి, ఆతనికిఁ బ్రణమిల్ల సమరపతియంతవాఁడుకూడ తనయైరావతమునుండి క్రిందికి దిగెడివాఁడో యెవ్వాని పదాఘాతచిహ్నము నొకప్పుడు సాక్షాన్నారాయణుండే సగర్వమునఁ దన వక్షమున ధరించుచుండువాఁడో—ఆతఁడు నేఁ డుపవీతమాత్రధారియై భిక్షాటన మొనరింపఁ గడు నాతుర పడుచున్నాఁడు! ఆహా!

హింత్య మాచరించువాఁడఁ గాను! ఉసురులు వీడవలయునన్నను నే నకార్య మొనరింపను! చాణక్యుఁడు క్షత్రియులకు దాసత్వ మొనరించువాఁడు కాఁడని యెఱుంగుము!

కాత్యాయన—భూసురోత్తమా! నా పల్కుల నాలిం—

చాణక్య—హా! ఇదేమి యన్యాయము!—ఇదేమి యత్యాచారము!! నేను నా గుడిసెలోఁ బడి యేడువఁగూడదా?

కాత్యాయన—మహాత్మా! విచారించుట పురుషుల కుచితము కాదు.

చాణక్య—ఆమాట నిజమే. (ఒకించుక చింతించి)—మంత్రి మహాశయా! ఏమి చేయుదును? విరామములేక ఘటిల్లిన యరిష్ట పరంపరలు నన్నేమియుఁ గావింపనేరకపోయెను! కాని కన్యాపహారణము నా మేరుదండమును విఱిచివైచెను!

కాత్యాయన—(మెల్లగా)—ఈతని ప్రవృత్తి యెంత కోమలమైనది!

చాణక్య—అమాత్యశేఖరా! నా యుదంతమును వినుము. ఒకనాఁటి రేపకడ నిలువెడలి కాగణాంతరమున గ్రామాంతరమున కరిగి, చనిన పని వైళంబ ముగియమి నిశీథమందు నిజ నిలయమునకు మరలివచ్చితిని. వచ్చి, సదనముఁజొచ్చి చూచునరికి నాభృత్యుఁడు చైతన్యరహితుఁడై నేలఁ గూలియుండెను! నాముద్దుతనయ పరుండిన—శ—య్య (డగ్గుత్తికతో) శూన్యమై—యుండెను! గృహము కళావిహీనమైయుండెను. గుభాలున నేలపైఁ జతికిలపడిపోయి, చేష్టలుడిగి కొంతసే పైనపిమ్మట యెట్టటులో లేచితిని! కనులు చీకట్లు గ్రమ్మెను; తప్తబాష్పము మృత్తవినిర్గతమై గగనవీథి కెగయసాగెను! తదనంతర మున్మత్తుని చందమునఁ బథమందుఁ బడి "అమ్మా! అమ్మా!!" యని యుచ్చైస్స్వనమునఁ గేకలిడుచు బర్వెత్తదొడంగితిని. అయ్యార్తనాదము విని పరిసరకాంతార భూజశాఖలందలి వికిరలోకము కలరవ మొనరించుచు నల్వంకల

కెగయసాగెను! శైవలినీపులినతలంబున కరిగి, పలుమారు తెలుంగెత్తిఁ బిడ్డను బిల్వ దొడంగితిని!! ఆ గభీరాంధకారమున నిర్ఝరీద్వికూలాభ్యంతరమునుండి వినంబడు కృష్ణసలిలరాశి గర్జనముమాత్రము తక్క మఱేశబ్దము నావీనులఁ బడలేదు!!! చాల సేపు సరిత్తీరమున నిలువఁబడి, "హా! తల్లీ!!" యని మూర్ఛిల్లి నేఁ నాకూలతలమున గూలిపోతిని!

కాత్యాయన—విప్రవర్యా! తాము విచక్షణు లయ్యు, యీ విధమున నధీరు లగుచుంటిరేల? తమబోటివార లిట్లు వర్తిల్లుట జెల్లునా?

చాణక్య—మిత్రమా! నే నేమి దుఃఖించుచుంటిని?—దుఃఖింపవలెననియే నే నిప్పుడు వాంఛించుచుంటిని—పెద్దపెట్టున నేడువవలెనని నే నెంతయో నభిలషించుచుంటిని!—నా బాష్ప పారావారముచే నీపృథ్వీతలమును ముంచివైవఁ గోరుచుంటిని! అశ్రుబిందువులు లోలోపల ఘనీభవించి పోయెనేమో యనుచు నేనవుడవుడు దలంచుచుందును! (క్షణమూరకుని)— అమాత్యవర్యా! రాహుకేతువులు సుధాంశునిఁ గబళించునట్లు అవిచారాత్యాచారము లతిప్రబలములై యీశ్వరునే దిగమ్రింగివైచినవి! దానంజేసి భగవానుఁడిప్పుడు దృగ్బాహ్యుఁడై యున్నాఁడు.

కాత్యాయన—ఆతఁడు మరల మీ దృక్పథమునఁ బడఁగలఁడు. నీల మేఘములు నలువలనులకుఁ బఱతెంచును. చేతులు ముడుచుకొని యొంటరిగ కూరుచున్న నిష్ఫలయనుశోచనము కావింపక నూతనోద్యమమునకు నడుముఁగట్టుడు. కాలహరణ మొనరింపక కర్మస్రోతమందు భవద్దేహమును విడువుఁడు. కార్యమయంబగు నీ విశ్వమందుఁ గాళులు సాచుకొని కూరుచుండ జెల్లదు.

చాణక్య—అవును. నీవనినది సత్యమే.

కాత్యాయన—సుఖదుఃఖములవల్లననే మానవజీవన మతివాహిత మగును. ఆలోకాంధకారములవల్లన గాలవికాసముసంభవమగును. విప్రవర్యా! మీ రొక్కరు మాత్రమే దుఃఖ మనుభవించు చుంటిరా? నాయార్తి యేదో యెఱుంగుదురా?—ఆర్యా! ఈ ప్రభువు నాజ్ఞ కారణముగనే అంధకారబంధురంబగు నొక కారా గారమున నాయనుంగు సుతు లేద్గురు బంధింపఁబడుటయు, ఆకలిద్పి పాసాపీడితులై, ఆ ముద్దుకుఱ్ఱలందఱు విగతప్రాణులగుటయుఁ గన్నులెదుటఁ గాంచితిని.

చాణక్య—పాప మటులనా! కాని వయస్యా! అతఁడట్టి దుష్కృత్య మొనరించినను, వానికడనే మంత్రివై యుంటివేల?

కాత్యాయన—స్వామీ! ప్రతీకారార్థము నేను మంత్రిపదమును స్వీకరించితిని! ప్రతీకారార్థమే అనాహారముచే మడియక నేనింకను బ్రదికియున్నాను. అయ్యా! కృపాళులరై తాము నా కిపుడు తోడ్పడుడు.

చాణక్య—[తనలో] ఆహా! బ్రాహ్మణునియెడల నింత యత్యాచా రమా?—సుందరీ! నాపై నీవిపు డింత తీవ్రదృష్టి నిక్షేపించుచుంటి వేల? ఏమి నీయాజ్ఞ?

కాత్యాయన—మహాత్మా! లుప్తమైయున్న మన పూర్వబ్రహ్మ తేజము నుద్ధార మొనరింతము రండు. నేను తేని కమాత్యుఁడనై యుండఁ, దా మాతని పురోహితులు కండు. బ్రాహ్మణుల మిరు వురము కలసి, మనలకు చూపఁబడిన దుర్నయమునకుఁ దగు శాస్తి గావింతము! భారతభూమి నిలచునంతకాలము బ్రాహ్మ ణుఁడు బ్రాహ్మణుఁడే యై తనరును—భ్రాతృవరా! రండు!

చాణక్య—[చెవియొగ్గి యేదియో వినునట్లు నటించి]. మంచిది! మంచిది!!—[పిదప కాత్యాయను నుద్దేశించి] అమాత్యపుంగవా!

నీ యభీష్టము ననుసరించి నేఁ బౌరోహిత్యమును స్వీకరించెదను! నీకుఁ దోడ్పడుట కేను వెనుకంజవేయను. కాని బ్రాహ్మణయుగ మంతమొందుట నిక్కము! నూతనముగ నావిర్భవించిన బౌద్ధయుగము విప్రలోకమందుఁ బ్రబలిన జఘన్యశాస్త్రాహంకార ప్రవంచనదుర్వినీతులను తన పిడికిట గట్టిగ నొడిసిపట్టి, యవిశ్వాస పిశాచికంఠమును నులిమివైవ గడంగినది. దానంజేసి బ్రాహ్మణుల వినాశము బౌద్ధమతస్థాపనము ధ్రువము! చూడు మదే ప్రబలతర వేగమున బౌద్ధమతవన్య మరుదెంచుచున్నది. అచిరములో బ్రాహ్మణప్రభుత్వము నిశ్శేషమై చనును. అదినిక్కము! నిక్కము!! నిక్కము!!! మనము దానిఁ గాఁపాడఁజాలము. కాని, ప్రళయ మాసన్నము కాక మున్నొకమాఱు ద్వాదశభాస్కరుల భాతి కలిబ్రాహ్మణుఁ డభ్రిమును దగ్ధం బొనరించి చనుగాక! మిత్రమా! నడువుము. నే నిప్పుడే వచ్చెదను.

[నిష్క్రమింతురు.]

## తృతీయరంగము

నందమహారాజు ప్రమోదోద్యానము—రాత్రిసమయము

సభ్యులఁగూడి నందమహారాజాసీనుఁడై యుండును

సమ్ముఖమున వేశ్యలు పాడుదురు.

### గీతమాల

నిన్నుఁ బ్రేమించినందున నీరజాక్షు!
నరుగుదెంచితి నిపుడు నీదరికి రేగ;
హాసన కుసుమములను సఖా! యొసఁగి తేని,
బొమ్మతోయము నిత్తుము పవలు రేయి;

చాలవేడ్కను శతదళమ్ముమాలగ్రుచ్చి,
దాని నిడుదుము నీపదతలమునందు;
మధురగానము నల్పుచు, మాలనీవు
కంఠమందునఁ గీలింపఁ గాంతుమపుడు;
ప్రాణమిత్రమ! మోహన వంశినీవు
పాడుమలరింప మమ్ము నీ యాడువారిఁ
వంశిధరుఁడవుకాన హృత్పద్మమందు
నిల్పి కొల్తుము నెచ్చెలి! నిన్ను మేము.

[చాణక్యుఁడు ప్రవేశించును]

చాణక్య—మహారాజా!

1 వ సభికుఁడు—ఓరీ! వీడెవడు?

2 వ సభి—[చాణక్యునివంకఁ దేఱి పాఱజూచి]—నీ వేలోకమునుండి యూడిపడితివి?

నంద—ఏమోయీ! నీ వెవడవు?

చాణక్య—నేను బ్రాహ్మణుఁడను.

1 వ సభి—పొమ్ము! ఇక్కడ నీకు తావులేదు.

2 వ సభి—స్త్రీ, గో, బ్రాహ్మణులను మే మేమియు ననము. తొలగి పొమ్ము—

3 వ సభి—పాపము బ్రాహ్మణులు నిరుపేదలు—అరిపేదలనికూడ చెప్పవచ్చును.

నంద—నీ విత్తావున కిపు డెందులకు వచ్చితివి?

చాణక్య—మహారాజా! నేను నీ మాతామహుని శ్రాద్ధకార్యము నకుఁ బౌరోహిత్యము సలుపవచ్చితిని, కాని యేమియు వేఁడు కొనుటకుగాదు—

నంద—బ్రాహ్మణుఁడా! నిన్నుమాత్ర మెవ్వరైన వేఁడుకొని యిచ్చ

టికిఁ దోడుకొనివచ్చిరా ?

చాణక్య—అవును.

నంద—ఎవరు ?

చాణక్య—మంత్రియే నన్నుఁ బిలచెను !

నంద—అట్లైన మంత్రికడకే పొమ్ము !

చాణక్య—నీ భావమరఁది నన్నవమానపఱచెను.

1 వ సభి—అవును. అవమానకుఁడా ?

2 వ సభి—భావమరఁది అవమానపఱుపకపోయినచో యింకెవ రవమాన పఱచెదరు ? వాని యుద్యోగమే అది !

చాణక్య—[బలముగఁ బాదమును నేలపై దన్ని)—ఛీ ! ఛీ !! కుమతులారా ! నోరుమూయుఁడు !! [సభాసదులు భీతిజెంది కిక్కురుమన కుండ నూరకుందురు.]

నంద—బ్రాహ్మణుఁడా ! అవమానించినంతనే పోయినదేమున్నది?—అతఁడు మగధనృపాలుని భావమరఁదికదా !

(వాచాలుఁడు ప్రవేశించును)

వాచాల—బ్రాహ్మణుఁడా! నేను సామాన్యుఁడనని తలఁచుచుంటివా? నేను మహారాజుగారి భావమరఁదిని! మహారాజుగారితండ్రియును, నాతండ్రియును వియ్యంకులు! మహారాజుగారి భార్య నాకు తోడబుట్టినది! మహారాజుగారి కుమారుఁడు నాకు మేనల్లుఁడు! మహారాజుగారి అల్లుఁడు నాకు సాక్షాత్తూ మేనకోడలి పెనిమిటి!—బ్రాహ్మణుఁడా! నేను సామాన్యుఁడనని తలఁచుచుంటివా?

నంద—నీ విచటినుండి తొలఁగిపొమ్ము. మేమిచట బ్రాహ్మణుని నేరముల వినుటకై కూరుచుని యుండలేదు.

చాణక్య—రాజా! నీవిఁక విప్రులయభియోగముల నేల విందువు? ఆదినములు గడచిపోయెను. ఈకాలవు బ్రాహ్మణుఁ డానాఁటి

బ్రాహ్మణుఁడు కాడు. దానంజేసియే యొకక్షత్రియుఁ డనాయాసముగ నాతని సంపదలఁ గైకొని నిర్భయముగ వానిపై కనువెత్తిఁ జేయ సాహసించుచున్నాఁడు! భూసురున కా తేజమే యిపుడున్నచో, రోషకషాయితనేత్రుండై సమ్ముఖమున నాతఁడుంటఁగాంచి భయంబున నిపుడీవు సింహాసనసహితముగ భూగర్భమునఁ గ్రుంగియుండకుందువా? కాని రాజా! ఆప్రతాప మొక్కమాఱుగ లుప్తమై పోలేదని తెలిసికొనుము!

వాచాల — ఓహోహో! ఏమియీ గాంభీర్యము!! ఇతఁడేదో ప్రతాపము జూపునఁట! — మంచిది! బ్రాహ్మణుఁడా! ఏది! నీప్రతాపమేమో చూపుము చూచెదను! పిదప నీవుకూడ మహారాజుగారి భావమరఁది ప్రతాప మెట్టిదో యొకమాఱు చూతువుకాని!

చాణక్య — వాచాలా! తొందరపడకుము!! విప్రప్రతాప మెట్టిదో శీఘ్రమే చూడఁగలుఁగుదువు — రాజా! దీనికిఁ బ్రతివిధానముఁ గావింపవేని నీవుకూడ దాని చవి జూడఁ జాలుదువు!

నంద — ఏమి! నీప్రేలాపన! భిక్షుకా! నాసమ్ముఖమున నిలువఁబడి ప్రసంగింపక గ్రుడ్లెత్తిఁ జేయ సాహసింతువుగా! ఇఁక విశేషముగ ప్రసంగింపక, యిం దుండి తొలఁగిపొమ్ము!

చాణక్య — హా! కలికాలబ్రాహ్మణా! ఈ కఠోరవచనములను నీవు వీనులనొగ్గి వినుచు నిలువబడవలసివచ్చెగా! "తొలఁగిపొమ్మ"ని యొకక్షత్రియుఁడు నిన్నాజ్ఞాపింప సాహసించినను, ఝంఝానిల మింకను యుత్పన్నమగుటలేదు! అగ్నివృష్టి గురియుటలేదు!! భయంకర భూకంపము కలుఁగుటలేదు! ఎట్టియుత్పాత ముత్పన్న మొందక, అంతయు స్థిరమైయున్నది! — ఏమియాశ్చర్య మేమి యాశ్చర్యము!

నంద — ఏమిరా! నిలువబడియుంటిరి! వీనిని మెడబట్టుకొని వెలుపలకు

ద్రోసివేయుఁడు.

చాణక్య—భగవతీ వసుంధరా! నీవీఁక నశించి పొమ్ము! పాఱుఁడా! జడునిచాడ్పున నిలువంబడి జూచుచున్నావేమి! జగతికి విద్రావంబవై, యైశ్వర్య కవాటము పొంత బిచ్చమెత్త దలఁపడుటకు నీకు సిగ్గు కలుఁగుచుంటలేదా? శక్తియున్నదేని లెమ్ము! కపిల తేజమున భయంకర స్ఫులింగ వృష్టిఁ గావించి, నీచుల దర్పమును భస్మమొనరించుము! అట్లొనరింపఁజాలవేని, యల్పుఁడా! ఘృణితుఁడా! పదదలితుఁడా! మహత్వకంకాలమా! ఇఁక నీముఖమ్ము నాలోకమందుఁ జూపకుము! అవనీగర్భమందడఁగి పొమ్ము!

నంద—ఏమి! మే మిచటి కొక యున్మాదుని ప్రలాపములను విన వచ్చితిమా? వాచాలా! చూచెదవేమి? వీనిని వెలుపలకుఁ ద్రోలివేయుము!

వాచాల—[చాణక్యుని శిఖను బట్టుకొని యీడ్చి]—ఓరీ! ఇట నుండి వెడలి పొమ్ము!

చాణక్య—సరే పోవుచుంటిని! కాని, పోవుటకు మున్నొకమాట చెప్పిపోయెద! నందా! ఈకలికాలమందే, విశీర్ణధ్వంసావశేష పృథ్వీసురప్రతాపము నొక పరి చూడఁగలవు! నరాధమా! నందవంశమును ధ్వంస మొనరింపకున్ననేఁ జణకుని పుత్రుండను కాను! నీరక్తముచే రంజితమగు హస్తముచే నాశిఖను ముడివైచు కొందును. దుర్మార్గుఁడా! ఈపాఱుని కఠోర ప్రతిజ్ఞ మఱువక తుదివఱకు జ్ఞప్తియుంచుకొనుము. అదియేగాక నేఁ దెల్పు భవిష్య ద్వాణినిఁగూడ మనమం దుంచుకొనుము!—నందా! ముందొకప్పు డీభిక్షుకుని పదతలమందే శిరమువంచి నీవు ప్రాణభిక్ష వేఁడుకొనవలసివచ్చును! నీ వెంత యంగలార్చినను నే నా భిక్షను ప్రసాదింపను. ఆనాఁ డీవు భూసురుని తపశ్శక్తిని, ప్రతిభా

ప్రభావమును, యభిశాప తేజమును, క్రుద్ధవిక్రమమును బాగుగ నెఱుంగఁ గలుఁగుదువు! అదో నిక్కము! నిక్కము! నిక్కము!!!

[నిష్క్రమించును.]

నంద—ఏ డెవఁడు! జరిగిన దేమి!!

వాచాల—ఇఁకేమి జరుగవలెను! ఈతఁడు పౌరోహిత్యము సలుప నరుదెంచెను. ఇతఁడు రాకముందే నే నొక పురోహితుని రావించితిని. అందుచే నీయవసరము లేదని వీనికిఁ జెప్పితిని. నామాటల నీతఁడు లెక్కచేయలేదు. నే నపుడు వీని మెడఁబట్టి గెంటివైచితిని! నేఁ గావించిన యపరాధమిది! ఇందుల కాతఁడు క్రుద్ధుఁడైనాఁడు!

నంద—వాచాలా! నీవు బ్రాహ్మణుని మెడఁబట్టి గెంటుట కేల సాహసించితివి?

వాచాల—నేను మహారాజు భావమరఁదిని!

1 వ సభి—అవు నవును! అతఁడు మహారాజుగారి భావమరఁది!

2 వ సభి—అంతేకాదు! మహారాజు భార్య సాక్షాత్తూ వాని చెల్లెలు!

3 వ సభి—ఇంకావుంది సంబంధం. వానిఅయ్య కేవలము మహారాజుగారి మామగారు!

4 వ సభి—ఇంకా వుందింకావుంది! వానికి వేలువిడచిన పినతల్లి పెద్దకోడలి చెల్లెలితోడుకోడలు స్వయానా మహారాజుగారికి వేలు విడిచిన మేనత్త పెద్దకుమారుని భావమరది అప్పతోడుకోడలు!

3 వ సభి—వాచాలా! మామంచిపని చేసితివోయి! నీఅంతరంబాగా తెలుసుకునే చేశావు చేసినపని!

నందు—ఈ వివాదమంతయు మన యుల్లాసమును పూర్తిగఁ జెఱచివైచినది!—ఇఁక దానిని తలపెట్టకుఁడు!

1 వ సభి—ఉల్లాసము చెడులేమి! ఇదొక క్రొత్తరకముగా తేలినది. ఇదే బాగున్న దినాకు !!

2 వ సభి—ఏమన్నా నరే కాని, ఆ బ్రాహ్మణుఁడు పోయేటప్పుడు మంచి చెలాకీ చూపించినాడు!

3 వ సభి—ఓ! ఏమి చురుగ్గాపోయింది వాడిగొంతుకు! ఏమాటైనా చెపితే ఆలాగే చెప్పాలి; లేకపోతే నోరుమూసుకు కూర్చోవాలి! ఒకటే లెఖ్ఖ !!

1 వ సభి—ఏమైనా నరేకాని, శ్రాద్ధకార్యమందు యిటువంటి మజానునే నెప్పుడూ చూడలేదు. పిల్ల పెళ్ళికి మాత్రమే యిటువంటి ఆటా పాటా జరుగుట యెఱుఁగుదును! కాని, యిదీ బాగానే యున్నది! పప్పూ మామిడికాయకలిపి వండినప్పుడు మంచి రుచి వచ్చునట్లు, శ్రాద్ధము పెళ్ళి కలిపినపుడు మంచి తమాషా తయారైనది!

2 వ సభి—పిల్ల పెళ్ళికూడ ఒకవిధమైన శ్రాద్ధమే!

1 వ సభి—ఎట్లు?

2 వ సభి—విను; శ్రాద్ధములు మూఁడు విధములు. తండ్రి యాబ్దీకము—అదే శ్రాద్ధము, పిల్ల యాబ్దీకము—దానినే వివాహ మందురు; రూపాయల యాబ్దీకము—దానిని వ్యాజ్యేమందురు!

3 వ సభి—ఇంక దీర్ఘవిధి నేమందురు?

4 వ సభి—అది మీ అబ్బాయి నడుగు! మొన్న పుష్కరాలకు దాని నాతడు పెట్టియే యుండును!

3 వ సభి—నేనుండగానే?

4 వ సభి—నీవు లేనిదే, అది జరుగనే జరుగదు! ఎప్పుడూ మీదంపతుల నుభయులను పీటలమీద కూర్చుండబెట్టి దాని నాతడు చేయవలెను !!

[అందఱు పకపక నవ్వుదురు.]

[మురాను వెంటనిడుకొని కాత్యాయనుఁడు ప్రవేశించును]

నంద—మరలని వెవరు?—ఓ!—ఈమనిషి నిచ్చటికిఁ దీసుకొని వచ్చితివేల?

కాత్యాయన—దేవర యాజ్ఞాపింపలేదా, యవిలంబముగ—

నంద—అట్లని ప్రమోదోద్యానము లోనికా దీసికొనివచ్చుట. పెద్ద మనిషితరహా యొకటి లేదా?

ముర—వత్సా! నీ నోటనుండి యీ మాట విని, మిగుల బ్రీతిఁ జెందుచుంటిని.

నంద—నీవు వచ్చి, మాకడ మిగులఁ బ్రీతిఁజెందుమవని నిన్నిచ్చటికిఁ దీసుకొని రాలేదు—మంత్రీ! రాజకార్య మిచటనా? నీవు వట్టి తెలివిహీనుఁడవు.

కాత్యాయన—ఆజ్ఞ యగుచో నీమెను మరల దిగవిడిచి వచ్చెదను.

2వ. సఖి—ఓహో! మంత్రిమహాశయా! నీపని సరిగ నట్లే కను పించుచున్నది!—

1వ. సఖి—ఎటు?

2వ. సఖి—ఒక పెద్దమనిషి పాతికమైళ్ళదూరము సవారీ ప్రయాణము చేసి, గమ్యస్థానము చేరి, తుదకు జేబులో చేయిబెట్టి చూచుకొనునరికి, దానిలో ధన మేమియు గనుపింపకపోగా, చాకలివారల కిచ్చుటకు భృత్యము లేక వారితో "బోయీలారా! నాదగ్గఱ డబ్బేమియులేదు; పాపము మీరు నిరుపేదలు. మీరు చిన్నబుచ్చు కొనుచుండ నేను చూడలేను. అట్టిదానికి నా మనసొప్పదు. అందుచే నన్నెచ్చటనుండి తీసికొనివచ్చితిరో అచ్చటికే తీసి కొనిపోయి దిగబెట్టి మీదారిని మీరు పొండు. నేను యేలాగో నడిచియే వచ్చెదను" అన్నట్లున్నది.

శివ. సభి—అటువంటిచే మఱొక చిత్రమున్నది! నీవంటి పెద్దమనిషి యొకడు, పది నిలువుల నుయ్యి త్రవ్వించి కూలిసొమ్ము విషయములో వివాదము బెట్టి, కూలివారితో, "అలా అయితే బాబులారా! మీగొయ్యి మీరు పూడ్చివేసికొనుఁడు. నేను మఱెవరినైన పిలచుకుని నుయ్యి మరల త్రవ్వించుకొందును" అనెనఁట!

కాత్యాయన—మహారాజా! ఈమెను దిగవిడిచి రమ్మందురేమో సెలవిండు.

నంద—తీసుకొనివచ్చితివికదా!—యిఁకెందుకు!! ఉండనిమ్ము!!!—మురా! నీ కుమారుడు చంద్రగుప్తుడు బ్రతికేయే యున్నాడు సుమా!

ముర—బ్రతికియే యున్నాఁడా!—నాయనా! వాఁడెచట? వాఁడెచట?

నంద—ఓహో! ఏమి నటన! ఏమి నటన!!—మురా! చంద్రగుప్తుఁడెచట నున్నాడో నీవే చెప్పవలెను. వాని యునికిఁ దెలుపుదువనియే నిన్నిచటికి రావించితిని. వాఁడెందున్నాడో చెప్పుము.

ముర—వత్సా! నే నెఱుఁగను.

నంద—ఎఱుఁగకేమి! ఎఱుఁగుదువు! ఆతఁడెందున్నాడో తెలుపుము. లేనిచో—నందు నెఱుఁగుదువా?

ముర—నందునే యెఱుఁగనా? నా యంకతలమందు దుగ్గపాలతోఁ బెంచి పెద్ద గావించిన వాని నెఱ్ఱుఁగకుందును?

నంద—ఆమాటకేమి? కాని యిపుడు చంద్రగుప్తుఁడెందున్నాఁడో తెలుపుము.

ముర—ఆతఁడెందున్నాడో నే నెఱుఁగను.

నంద—ఎఱుఁగకేమి! ఎఱుఁగుదువు. తెలుపుము. లేనిచో—

మురా—లేనిచో?—వధించెదవా! వధింపుము! కాని, యిపుడుకాదు. నేఁ బ్రాణముల వీడుటకుఁ బూర్వ మొకమాఱు కన్నులార చంద్రగుప్తుని చూడఁ గాంక్షించుచుంటిని.—ఒక్కమాఱు! ఒక్కమాఱుమాత్రమే!!

నంద—నిన్నిప్పుడే వధింపను. ఇంత త్వరలో నిన్నంత మొందించుట మంచిదికాదు. బ్రతికియున్నంతకాలము నిన్నుఁ గారాగారబద్ధ గావించెదను.. అనాహారజ్వాలంచే మెల్ల మెల్లగ నిన్ను దగ్ధమొనరించెదను!!!

మురా—నాయనా! నీవింత నిష్ఠురుఁడవు కాఁజాలవు. నేను నీతల్లిని.

నంద—అవునవును! శూద్రస్త్రీవి తల్లివిగావా!!—జనకునకు దాసివై బ్రదికి యిపు డేవేవో చెప్పవచ్చితివా! రాజాధిరాజునకే తల్లివైతివిగా!—ఏమిసాహసమే నీది పాడురండా!

మురా—ఆహా! ఏమి దురంతము!!—హా! భగవాన్!!

(అవనతమస్తకయగును)

నంద—శూద్రనారీ! నీవు మహారాజునకే మాతవు కాఁగోరుచుంటివా?

మురా—నేను మహారాజునకు మాతను కాఁగోరను! మహారాజా! నీవు చిరకాలము మహారాజువయ్యే యుండుము! నాబిడ్డ చంద్రగుప్తుఁడు భిక్షుకుఁడేయై యుండినను యుండనిమ్ము! జీవములతో వాఁడు నిలచియున్నఁ జాలును! ఒక్కమాఱుమాత్ర మా బిడ్డను కన్నులారఁ గాంచ నువ్విళ్ళూరుచుంటిని—ఒక్కపర్యాయ మాతని ఱొమ్మునఁ జేర్చుకొని పెట్టపెట్టున నేడ్వ నభిలషించుచుంటిని. చంద్రగుప్తుఁడు బిచ్చగాఁడు. ఆ బిచ్చగానికే మాతనగుట నాకుఁ బరమగౌరవము! దానికంటె నధికంబగు గౌరవము నాకువలదు. నేను మహారాజునకు మాతనుఁ గాఁగోరను! నా కట్టి పేరాస

లేదు.

నంద—చంద్రగుప్తుఁ డెచట?—ఇప్పుడైనఁ జెప్పుము. ఆతని యునికి నాకుఁ దెలియకపోదు!

మురా—ఆతని యునికి నొకవేళ నే నెఱిఁగియున్నను, నీకు దానిఁ దెలుపుదానఁగాను. నందా? నిజప్రాణ రక్షణార్థమై మాతృసనాభుని భయానకదుఃఖంబున విడచున నిదలంచితివా?—మూఢాత్మా! మాత యన నేమో యెఱుంగవా?

నంద—వృద్ధాంగనా! నీ యుపన్యాసము నీకఁ గట్టిపెట్టుము. ఆ దుర్మతి యిపు డెందున్నాఁడో తెలుపుము. లేనిచో మీ రిరువురు కూడ క్రూరదండనార్హు లగుదురు. ఇపు డాదురాత్మ్ముఁడు నా విపక్షమున విద్రోహము సలుపఁ జూచుచున్నాఁడఁట! నన్నెదురుకొనుటకు సైన్యముల సంగ్రహ మొనరించుచున్నాఁడఁట! నన్నాతఁడు తుద ముట్టించుగాఁబోలు!

మురా—పరాత్పరా! ఈ వచనములు నిక్కము లగుగాక! తన జనయిత్రికి సంభవించు యవమానమునకుఁ జంద్రగుప్తుఁడు తగువిధంబున వైరనాశన మొనరించుగాక!

నంద—(వాచాలు నుద్దేశించి)—వాచాలా! ఈమెను కారాగారమునకు బిఱబిఱ యీడ్చుకొనిపొమ్ము.

వాచాల—ముద్దుగుమ్మా!! రమ్మి!

(కేశములఁ బట్టుకొని యీడ్చుకొని యీమె నీడ్చును)

సభికు లందఱు నవ్వుదురు. వారితో నందుఁడుకూడ నవ్వును.

మురా—హా! ఏమి దురంతము!! భగవానుఁడా! అబలయెడ వీరలు జూపు ఘోర దౌరాత్మ్యమును వీక్షించుచుండుట లేదా? ఎట్టిగతి ప్రాప్తించెను! నిజసుతుఁడే యిట్టి క్రూరత్వముఁ జూపుచుండ నిఁక నొరుల నననేల! హా! ఏమి యత్యాచారము! (నందు నుద్దేశించి)

దుర్మతీ! నీ జననికిఁ జూపఁబడిన యవమానమునకు నీవుకూడ వేడుకఁబడుచుంటివా? ఈ యులంతులఁ గలసి నీవుకూడ నవ్వు చుంటివా? నరాధమా! నీకు నేను మాతను గాను. నేను నీకు స్తన్యము నొసఁగలేదు!! ఎవతెయో రక్కసి నీచే రక్తము ద్రావించి నిన్నుఁ బెద్దఁ గావించెను!!! అట్లే కానిచో నరగర్భ సంజాతుఁ డిట్టి చెట్ట కొడిగట్టఁడు! క్షత్రియకుల సంభూతు డిట్టి చెడుచెయ్దములకుఁ జేయిఁ గదపడు! ఎకిమీఁడనదలయెడ నిట్టి యుపచారముఁ జూప గడంగఁడు! క్షత్రియుఁడ ననుకొనువాని యాచారణ మీదృశంబగుచో, జన్మజన్మములందు నేను శూద్రాణినై జన్మింపఁగోరెదను!

1వ. సఖి—ఏహోవ్వా! మా బాగా చెప్పుచున్నదిరా!

2వ. సఖి—ఓ! బాగు! బాగు!! చెప్పు! చెప్పు!!

3వ. సఖి—బలే! ఏమి ఆవాగ్ధాటి!

4వ. సఖి—రాజాధిరాజా! శిరము వంచుకున్నారేమి?

2వ. స—(3వ. సఖికుని చెవిలో)—సిగ్గగుచున్నదిరా పాపఁ 'అంత వాఁడను నాకిట్టి తల్లి అని!' లోపల మహా కుళ్ళుచున్నాడు!!

మురా—నందా! నేను నీ జనయిత్రిఁగాను! కాని నేను నారిని—దీన దుర్బల నిస్సహాయను! నారియెడల జూపు యవమానాత్యాచారములను నారి సహింపఁజాలును కాని, ధర్మము సహింపఁజాల దని యెఱుంగుము!

వాచాల—రా! రా!! మే మిచట నీ ధర్మోపన్యాసము వినుటకై కూరుచునియుండలేదు! ఇఁక నీవాచాలత్వము విడిచి రమ్ము!! రమ్మీమ్మపథము ననుసరించిరమ్ము!

[ఇట్లని వాచాలుఁ డామె మెడఁబట్టుకొనును.]

నంద—ఇప్పుడైన జంద్రగుప్తుఁ డెందున్నాఁడో చెప్పుము! లేనిచో—

[ముక్తతరవారిఁ జేఁబూని చంద్రగుప్తుఁడు ప్రవేశించును]

చంద్రగుప్త—ఇదుగో! చంద్రగుప్తుఁడు నీసమ్ముఖమందే యున్నాఁడు. అధమాధమా! నీకండ కానర మచిరకాలములో నడంగిపోవునులే!! —[వాచాలుని బలంబుగఁ దన్ని భూమిం గూల్చును] జననీ!— [గద్గదకంఠుఁడై] నీ తనయుఁడు బ్రదికియుండ నీకిట్టి యవమానము ప్రాపించెనా! హా! మాతా! మాతా!!

ముర—హా! వత్సా!! [కుమారుని కౌఁగిలించుకొని విలపించును.]

చంద్రగుప్త—[నందు నుద్దేశించి] భీరూ! పాషండా!! ఎట్టి దౌరాత్మ్యమున కొడిగట్టితివి! ఆఁడుదానికడనా నీ యుట్టిపాటు! మాతకుఁ జూపవలసిన యాచరణమా యిది! కాపురుషా! దీనికిఁదగు ప్రతిఫల మనుభవింతువు! తప్పి పోఁజాలవు!—అమ్మా! రమ్ము!!

[మురగూడ నిష్క్రమించును.]

## చతుర్థరంగము

మలయరాజ్యమందుఁ జంద్రకేతు ప్రాసాదము సాయాహ్నకాలము
చంద్రగుప్త చంద్రకేతులు ప్రసంగించుచుందురు.

చంద్రకేతు—ఈనిలయము మీ నిలయము. నేను మీకు బహిఃప్రాణుండనగు మిత్రుండనని దలంపుము. అజస్రము భవదుత్థానార్థము నేఁ బాటుపడియెద. ప్రభూ! నాపలుకుల విశ్వసింపుము. దేవర కొఱకై సైనికులందఱుఁ దమ ప్రాణముల ధారవోసెదరు.

చంద్రగుప్త—నే నీయశిక్షిత సైన్యమును యవనప్రధానుసారముగ శిక్షిత మొనరించెదను. కుధరభూములఁ గ్రుమ్మరి, దిట్టరులై పెఱిగిన యీయోధుల సహజసాహసమును, కరగించి, విజ్ఞాన కర్మాగారమందు నేసుపను కారువుచేఁ బలుమాఱులు దానిని దిట్టముగఁ గొట్టి శాణిత మొనరించి, మగధరాజ్యమంతయు,—

ఒక్క మగధ రాజ్యమే యననేల, సమస్త భారతవర్షము కాంచి భీతిఁ జెందులాగున దాని న్యాస్థాలన మొనరించెదను!

చంద్రకేతు—ప్రభూ! నందునిమంత్రి యతికూటరాజనీతిజ్ఞుఁడనియు, నత్యంత బుద్ధిమాన్యుండనియు వింటిని.

చంద్రగుప్త—ఆతఁ డట్టివాఁడని నేనెఱుంగుదును. కాని, నాపై ఘనఁ గూడి నాతని కెందును దీసిపోని యమాత్యుఁడుండెను. పూర్వ మం దాతఁడు శందుని మంత్రియై యుండెను. కాత్యాయనుని పేరు నీవుకూడ వినియుందువు.

చంద్రకే—వింటిని.

చం॥గు—కాని, ఆతనికంటె నధికతరకుశాగ్రబుద్ధియు మేధాసంప న్నుఁడునగు పండితవర్యు నొకని నిపుడు నాప్రధానమంత్రిఁ గావింప వాంఛించుచుంటిని. సమ్మానపురస్సరముగ నాతనిఁ దోడ్కొని రమ్మని కాత్యాయనుఁ బుచ్చితిని.

చం॥కే—ఆ పండితవర్యుఁ డెవరు?

చం॥గు—చణకుని తనూభవుఁడు—చాణక్యుఁడు.

చం॥కే—ఆతఁ డంత దిట్టరియా?

చం॥గు—మిత్రమా! ఆతఁ డప్రతిమానమేధావి. ఏకనిష్ఠావ్రతుండు. బహువిచక్షణపరుఁడు. బుద్ధియం దాతఁడు బృహస్పతి కెనవచ్చును. మంత్రతంత్రములం దతఁ డారితేరినజట్టి! నందునిపై నాతనికి, క్రోధము బహుకాలమునుండి రగులుచున్నది. అవజ్ఞావాతహతిచే యిపు డది జాజ్వల్యమానమగుచున్నది! ఆతఁడు పూనిన పనికిఁ ద్రిమూర్తులైన నడ్డు రాఁజాలరు!

చం॥కే—ఏమి! ఆతఁ డట్టి మహిమాన్వితుఁడా!!

చం॥గు—అవును! ఆశాపాయుధునిగూర్చి నే విశేషంబులు వింటిని. ఆతఁడు గాలితోఁ బ్రసంగించునఁట! అనలముతో నాలోచనము

నలువునంట ! ఆతని క్రోధాన్వితదృష్టిజ్వాలచేఁ దృణరాశులు జ్వలించి భస్మీభూతము లైపోవునంట ! ఆతఁ డెన్నఁ డేకాకియై యుండునంట ! ఆతని కీజగతియం దెరుసులేరంట !

చం॥ కే.—కాని, అట్టి పురుషుం డతిభయానకుండుకాఁడా ?

చం॥గు॥—నెచ్చెలీ ! మన కిప్పట్టున నతి భయానకుండైన వ్యక్తియే కావలయును. [క్షణ మూరకుని] చంద్రకేతూ ! నీవు నావాఁడవని నమ్మి నీపై నే నింక సర్వము నిర్భరమొనరించియుందునా ?

చం॥ కే.—స్వామీ ! రాజభక్తుండగు చంద్రకేతు మిమ్మెప్పుడు 'మగధ న్యాయాధీశ్వరా' యని సంబోధించెనో—'సోదరా' యని యాతఁ డెపుడు ప్రణయపురస్సరముగ మిమ్మాలింగన మాచరించుకొనెనో అప్పుడే యాతఁడు దేవరకొఱకై నిజాసుల నర్పింప దృఢపణమొన రించెనని విశ్వసింపుఁడు !

చం॥గు—సోదరా ! [ఆలింగనముఁ జేసికొని] అట్లైన నాకిఁ కెట్టి చింతయు లేదు.

నేపథ్యమున—చంద్రగుప్తా !

చం॥గు—అమ్మా ! వచ్చుచున్నాను ! మిత్రమా ! రమ్ము ! జనని యా శీర్వాదముఁ బడసి వత్తము రమ్ము.

[ఉభయులు నిష్క్రమింతురు.]

[ఛాయ ప్రవేశించును]

ఛాయ—ఆహా ! ఈతఁడు భూలోకమున నవతరించిన సురేంద్రుని వలె నున్నాఁడు. ఈతని దర్శనము పూర్ణసుధాకరోదయమువలె నున్నది ! ఈతని కంఠనాదము రణధ్వనివలె మిగుల గంభీరమై యున్నది ! సోదరు నీ నరోత్తముఁడు తన భుజమృణాళవేష్టితుఁ గావించినపుడు శరత్కాలమేఘమునుబోల భాస్కరుఁ డాలింగన మాచరించుకొనిన కైవడి కనఁబడెను ! మలయోచ్ఛ్వాసము

మాడ్కి యీ మహానీయుఁడిల్లన వెడలిపోయెను!

ఛాయ పాడును.

గీతమాల

ప్రణయజాలమునందును పతితులౌచు,
అవని బల్వురు దురపిల్లి, యలరి, మనుదు
రంచు వింటి; ప్రేమవిషమ్ము, నమృతమును,
పడయఁగోరక నొంటినై పుడమినుండి,
తార, శీతాంశు, సుమ, మారుతవిలసిత వ
సంతఋతువు నాహ్వానించి, సతతమేను
సౌఖ్య పృథ్వీజతలమునఁ జోద్యముగను
హాసనసుమముల నేఱుదు మసలియుచట.

[ప్రసంగించుకొనుచుఁ జంద్రగుప్త మురలు ప్రవేశింతురు]

చం॥గు__మాతా! మనలకుఁ జూపఁబడిన దుర్వారదుర్నయమునకుఁ ప్రతీకారము సలుపుటకై నే బయల్వెడలితిని. అనలమును జ్వలించి వైచితిని. నీకుఁ జూపఁబడిన యత్యాచార మాయనలమం దాహుతి నొసంగెదను. ప్రేమాతిరేకమున నెన్నఁడైన సోదరుం డని నందుని మన్నింపఁదలఁచియుంటినేని, నేఁటినుండి ఆచింతను చిత్తమునుండి పోఁద్రోలెదను. నా ప్రేమాశ్రుబిందువులు నీకొఱకై నేఁడు స్ఫులింగపుంజములుగఁ బరిణతములగుగాక!

ముర__"శూద్రవనితవు నాకమ్మవా" యని ఆనాఁడు ప్రమోదో ద్యానమున నందుఁడు నన్నతి కఠోరముగ సంబోధించినపుడు నేను దుర్భరదురంతపరాభవానల దందహ్యమాన మానసనైనాను. అపుడే నందాజ్ఞచే వాచాలుఁడు నా శిరోజములనుబట్టి యీడ్చి—

[ఏడ్చును.]

చం॥గు__అమ్మా! నీవు బేలవుగాకుము. జయింతునో లేదో యని

యీావళిలో నపు డపుడు న్యాయైద నంటియున్న చింత నేఁడు నీ దుఃఖ జ ల ధి లో గ్రొ ట్టుకొ ని పో యె ను! నే నిపుడు శంకారహితస్వాంతుఁడనై రణభూమిని లంఘింప నువ్విళులూరు చున్నాను. అబలల కత్యాచారముఁ జూపిన మానవాధములు వినాశరూపమందుఁ బడిరని యితిహాసములు ఘోషించుచున్నవి. ఎట్టిజాతియైన నట్టి దౌరాత్మ్యమునకు దలఁపడినచో బూర్ణముగ నంతరించును. నందవంశమన నెట్టిది? మనకెన్నెని యరిష్టములఁ గల్పించిన శత్రువులను చెండాడి, నందుఁడు నీకుఁజూపిన యవమానమున కుచితరీతి ప్రతీకారము నలుప దృఢప్రతిజ్ఞుఁడనై యున్నాఁడను.

మురః—నాయనా! ఆయాశ నెదనిడుకొని నేనునుఱుల నిలుపుకొని యుందును.

[నిష్క్రమించును.]

చం॥గు—జననీ! శూద్రవనితవని యాతఁడు నీకవజ్ఞఁజూపెగా!—శూద్రులు మనుజులు కారా? క్షత్రియులచాడ్పున వారికవయవసౌష్టవము లేదా? హృదయములేదా? మస్తిష్కము లేదా? ఇంత యసహ్యమేల? ఇంత ఘృణాభావమేల?—మంచిది! శూద్రశక్తి యెట్టిదియో యొకమాఱు జూపెదను! శూద్రులుకూడ మానుషులేయని నిరూపించెదను—సికిందరుసాహా! నీపవిత్రభవిష్యద్వాణిని సఫల మొనరించుటే నాజీవనచరమలక్ష్యమౌగాక!

[కాత్యాయనుఁడు ప్రవేశించును]

చం॥గు—కాత్యాయనా! రమ్ము! చాణక్యమహాశయు లేరి?

కాత్యా—వారాహ్నిక మొనరించుచుండిరి. పూజ సాంగ మొనరించి యచిరముననే యరుదెంతురు.

చం॥గు—వా రెట్లున్నారు?

కాత్యాయన—మంథింపఁబడిన సాగరముపోల్కి నున్నారు. హాలాహల ముత్పన్నమగునో, లేక యమృత ముద్భవమగునో తెలియదు. కాని వారి ముఖలక్షణములు నాకేమాత్రమును బాగుగఁ దోపలేదు.

చం॥గు—ఏల?

కాత్యాయన—మన యుదంత మంతయు నివేదించినంతనే ఆపృథ్వీసురుని గంభీరముఖమండల మాకస్మికముగఁ బ్రత్యూషప్రాగ్దిశ్యము పగిది ప్రభాసమన్వితమై, తోడనే గోధూళీలీలమ్లానమై పోయెను! ఆభూసురుని శీర్ణకాయము పవనతాడితప్రదీపశిఖవలె కంపించి, మరల స్థిరమై నిలచి పోయెను! ఆతని యోష్ఠప్రాంతమున వ్యంగహాసము దోఁచెను. కాని, ఆహాసనశిఖ యప్పుడు నిర్వాణమైపోయెను!—సు హృ ద్వ రా! సంబద్ధయోష్ఠాధరులై, గభీరరేఖావిలసితలలాటులై, దూరమందు యసీమశూన్యోపరి ప్రసారితస్థిరతీక్ష్ణదృష్టి సమన్విత కృష్ణాపాంగచక్షుయుగళులై వారు నాకత్యద్భుతముగఁ దోఁచిరి!

చం॥గు—కాత్యాయనా! నీవల్కుల వినుచుండ నేఁ గూడ మిగుల నద్భుతపడుచుంటిని. (పచారిజేయుచు) వా రిఁకెంతసేపటిలో నరుదెంచెదరు?

కాత్యాయన—ఇంతలోనే యరుదెంచెదరు.

చం॥గు—(ముందునకు జూచి)ఆవచ్చున దెవరు?

కాత్యా—(చూచి) వారే చాణక్య పండితులు.

చం॥గు—వారేనా!

[చాణక్యుఁడు ప్రవేశించును.]

చాణక్యుఁడు సమ్ముఖీనుఁడు కాఁగనే, చంద్రగుప్తుఁడు నతజానువుడై యాతనికిఁ బ్రణామ మొనరించును.

చాణక్య — నీవు చంద్రగుప్తుఁడవా?

చం॥గు — చిత్తము. స్వామీ! నేను భవద్దాసుఁడను!

చాణక్య — (ఆపాదమస్తకము చంద్రగుప్తుని పరీక్షించి) — వత్సా! నీకు సామర్థ్యమున్నదా?

చంద్ర॥గు — గురువరుల కృపయుండిన, దేనికిఁ గొదువ?

చాణక్య — వత్సా! నీకుఁ గృపఁజూపుటకు నే నెవండను? నాయందే మున్నది? నీవొక్కరుండవే కార్యనిర్వహణ మొనరింపఁగలుఁగుదువు. దీనుఁడును, దరిద్రుఁడునగు విప్రుఁడేమి చేయఁగలఁడు?

చం॥గు — మహాత్మా! విప్రుఁడు దీనుఁడందురా?

చాణక్య — కాఁడా? యువకుఁడా! నేఁ డాతనివంటి దీనుఁడు విశ్వమందెవఁడును లేఁడు. ఆతని శాపానలముచే దుర్వారగర్వోన్మత్త రాజవంశము లిఁక భస్మీభూతములు కాకుండుటటుండ, సామాన్య దీపము సహితము వెల్గదు. వాని యుపవీతి నేఁడు భిక్షుకచిహ్నమై యుండెను. నేఁ డాతని, క్షత్రియుఁడు పదాఘాతమున బలంబుగ నేలఁ గూల్చి స్మితేందువదనుఁడై వెడలుచుండెను.

[చంద్రగుప్తుఁడు స్తబ్ధుఁడై యుండును.]

చాణక్య — కదాచితముగ సింధువు చాడ్పున శైలసంకాశతరంగముల నుత్పన్న మొనరించి వేగముగ సమ్ముఖమున కగ్రసరుండవగుచుంటివి; కాని కూలతలమున నరిఁగొనఁబడి గభీరహతాశ్వాసమునఁ దరగతో మరలి యరుగుచుంటివి! సుంతైన శక్తిలేదు. ఇసుమంతైన సామర్థ్యములేదు.

చం॥గు — ఆర్యా! అట్లను చుంటి రేల? చాణక్యపండితులు బహు—

చాణక్య — విచక్షణులనియు, విద్వాంసులనియు, నత్యంతకూట రాజనీతిజ్ఞులన్నియు విని యుందువు. ఆతని గుఱించి విశేషముగనే వింటివి, కాని యొక్క విషయము మాత్రము వినలేదు.

చం॥గు—మహాత్మా! అదేమి?

చాణక్య—చాణక్యునకు హృదయము లేదు. ఆతని మేరుదండము విఱిగిపోయెను. ఈవక్షమునఁ—[ఆకస్మికముగఁ జంద్రగుప్తుని కరమును లాగి దానిని తన ఱొమ్ముపై నిడుకొని]—గరముంచి పరీక్షింపుము. ఏమి తెల్లమగుచున్నది?

చం॥గు—క్షీణరక్త స్రోతము ప్రవహించుట మాత్రమే తెల్లమగుచున్నది.

చాణక్య—ఏమి స్రోతమంటివి?

చం॥గు—రక్త స్రోతము.

చాణక్య—మూర్ఖా! అది రక్తము కాదు. ఈదేహములో రక్తము లేదు! ఇందుఁ బాఱుచున్నది హిమానీ ప్రవాహము! ఉన్న శోణితమంతయు ఘనీభవించి పోయినది.

చం॥గు—(కొంచెము సేపూరకుని)—గురుదేవా! నే సర్వము వింటిని. నాకు మీరు ముదలమాత్ర మొసఁగుఁడు. కృపాళులరై నాకు భవదాశీర్వాదముఁ బ్రసాదింపుఁడు—“చంద్రగుప్తా! జాలమొనరింపక ముందున కరుగు” మని తాము నన్నుత్సహించిన జాలును. నేకిఁకేమియుఁగోరను. చేయవలసినఁ కార్యమంతయు నేన నిర్వర్తించెద.

చాణక్య—నిక్కముగ నీ వట్లొనరింపఁగలవా?

చం॥గు—చిత్తము. గురువరా! నేను దిగ్విజయవీరుండనగుదునను భవిష్యసూచన మహనీయుండగు సికిందరు షాహా జూపెను. ఆమహాత్ముని యాశ్వాసవాణి నిద్రాజాగరణములందు నాకర్ణములం దింకను మ్రోయుచున్నది. దాని నేఁ బూర్ణమొనరింప సమర్థుఁడఁగాఁ గల నంచాశీర్వదించి, నేఁ బూనిన యీమహాధ్వరమునకుఁ దాము పురోహితులు కండు. ఈపవిత్రవ్రతమందుఁ దాము

నన్ను దీక్షితుఁ గావింపుడు. మిమ్మాత్మ భృత్యుఁడు కోరునదంతియే!

చాణక్య—(చెవియొగ్గి)—ఏమి! ప్రాణేశ్వరీ! నీ వేమియాజ్ఞ యొసఁగుచుంటివి?

చం॥గు—ఏమీ! ఈతఁ డెవరితోఁ బ్రసంగించుచుండెను!!

చాణక్య—నీ యానకూడనట్టులేనా! మంచిది. (చంద్రగుప్తునుద్దేశించి)—మీయా దేశము నక్రాంత మొదలఁదాల్తు'నని నాపాదముల ముట్టి శపథమొనరింపుము.

చం॥గు—(చాణక్యుని చరణములను స్పృశించి)—గురుదేవా! మీయా దేశము నక్రాంతమునే నొదలఁదాల్తును. స్వామీ! శపథమొనరించితిని. ఇఁక నాకరమునకు దీక్షాసూత్రముఁ గట్టుఁడు.

చాణక్య—చంద్రగుప్తా! నీవు నిక్కముగఁ బూర్ణమనోరథుఁడవు కాఁగలవు. నీ ముఖవైఖరి నీవు సఫలయత్నుఁడవు కాఁగలవని సమస్వరమున వక్కాణించుచున్నది. దానంజేసి నిన్నచిరకాలములో నీ యాగమున దీక్షితుఁజేసెదను. నిన్ను మగధసింహాసనమందాసీనుఁ గావించెదను. భారతభూమికి నిన్నేకచ్ఛత్రాధిపతిఁ జేసెదను. కుమారా! నీ వింక నింధనములను సిద్ధమొనరింపుము. నే నానమిధలను బ్రహ్మతేజముచేఁ బ్రజ్వలితమొనరించెదను. దావానలము చందమునఁ దచ్ఛమిధ వినిర్గతాగ్నిశిఖ పల్వలనుల వ్యాప్తమగును. ఆ మహానలజ్వాలచే భారతవర్షమంతయు జాజ్వల్యమానమగును. వత్సా! ఊర్ధ్వమును వీక్షించి నీ కేమి కానంబడుచున్నదో తెలుపుము.

చం॥గు—వియత్తలము.

చాణక్య—దానివర్ణము?

చం॥గు—పాంశురక్తవర్ణము.

చాణక్య—దానివలన నీ కేమి బోధపడుచున్నది?

చం॥గు—ఝంఝూనిల ముత్పన్న మగునని.

చాణక్య—సరిగఁజెప్పితివి. ఝంఝూనిల ముత్పన్నమగును. ఇఁక సమ్ముఖమువిమ్యద్దిక్కుగ విలోకింపుము. ఏమియుఁ గానిపించుట లేదా ?

చం॥గు—లేదు.

చాణక్య—అంధుఁడా ! అందుఁగూడ నొకభీకరఝంఝయుత్పన్నమగును !—కపిలమౌని యభిశాపముగాని, గాధినందను తపోబలంబుకాని, జామదగ్ని శౌర్యము గాని, వామనుమాయగాని దానికిఁ గారణములు కావు. విప్రబుద్ధి, శూద్రనిష్ఠలును, విప్రసాధన శూద్రప్రతిహింసలును, విప్ర తేజశ్శూద్రశక్తులును యొండొంటితో నొండుకలసి ఆ యుత్పాతము నుత్పన్నమొనరించును. స్వర్గమర్త్యము లేకమగును ! వత్సా ! ఇఁక భయములేదు ! లెమ్ము. నా చక్షుసమ్ముఖమున నేనిపుడేమి వీక్షించుచుంటినో యెఱుంగుదువా ?

చం॥గు—గురుదేవా ! ఏమి వీక్షించుచుంటిరో తెల్పుఁడు.

చాణక్య—ప్రధ్వంశ, ప్రధూమిత, ప్రజ్వలితమై, ప్రవాహితభీభత్సయవారణశోణితశ్శ్రోతస్వత భైరవాకారమై యుండిన భారతమాత పూర్ణపరివర్తనమంది బహువిధరత్నాలంకార విభూషిత సురభిళసుమోజ్జ్వల మధురగానలహరీముఖర ఫుల్లసరోజవదనమహిళాశమంతకము చాఱ్పునఁ దోఁచుచుఁ బవిత్రహాసద్యుతుల మనపై బ్రసరించుచున్నది. చతుస్సముద్రముద్రిత మహీతలమంతయు నా కనులయెదుట ప్రత్యక్షమై యున్నది. శుభ్రాత్మా ! ఆ మహాసామ్రాజ్యమున కీవే ప్రతిష్ఠాతవు. దీనుండును, దారిద్ర్యపీడితుండునైన పాఱుండగు చాణక్యుఁడు నీకుఁ బురోహితుండు !

చం॥గు——మహాత్మా! ధన్యుఁడ!! ధన్యుఁడ!!!

[చాణక్యుని పదముల కెరలును]

చాణక్యుఁడువంగి చంద్రగుప్తుని శిరమున్పృశించుచు.

[తెరపడును]



# చంద్రగుప్త

## ద్వితీయాంకము

### ప్రథమరంగము

హిరాట్యయండలి సెల్యూకసు ప్రాసాదము—రాత్రిసమయము

సెల్యూకసునందనితోఁ బ్రసంగించుచుండును.

సెల్యూ—కుమారీ! అప్రతిమాన ప్రతాపోపేతుండైన సికిందరుషాహా స్వర్గము నలంకరించెను జుమీ!

హెలెన్—అటులనా! ఆహా! పృథ్వీతలమున నొక మహిమాన్విత పుణ్యజ్యోతినిర్వాణమైపోయెను. జనకా! ఈ హృదయవిదారక వార్త యెట్లు తెలియవచ్చెను?

సెల్యూ—భానుమంతుఁడస్తాద్రిఁ జేరఁ బృథ్వి యెఱుఁగకుండునా?

హెలెన్—తదుపరి?

సెల్యూ—తదుపరియిఁకేమి! ఆసియాసామ్రాజ్యమునకు నన్నుత్తరాధికారిఁ గావించి యాతఁడసువుల వీడెను.

హెలెన్—అత్యుచ్ఛవాంఛ తాడనంబునఁ బ్రాచ్యమహాఖండ మందాతఁ డొక బృహత్సామ్రాజ్యము స్థాపించియు, ఆతఁ డొండు యెడఁ బ్రాణముల వీడెను. తుదకు నిజసీమ మృత్తమందుఁ గలియుటాతనికిఁ బ్రాపింపలేదు!

సెల్యూ—అవును. నందనీ! వ్యర్థమనోరథుండై యా మహాత్ముఁ డసంపూర్ణముగ విడచిన కార్యమును నేఁబూర్ణ మొనరించెద.

హెలె—ఆ కార్యమేది?

సెల్యూ—భారతవర్ష విజయము.

హెలెన్—దాసివలన నేమి మేలు సేకూరును?

సెల్యూ—కీర్తి.

హెలెన్—కీర్తియా, లేక యపకీర్తియా? పురుషుని యుచ్చప్రత్యాశ యత్యాశ్చర్యమైనది. అదెన్నటికిఁ బూర్ణము కాదు. జిఘాంసా ప్రవృత్తిప్రేరితుండై మానవుఁడెంతేని దౌరాత్మ్యమున కొడిగట్టుచు, మృగవధోత్సుకుఁడైన మృగయునిమాడ్కి దోడిపూరుషుఁ బొలియింప నుంకించునకుఁ బెర్విడును. వన్యమృగసంహారము కరణి మనుష్యవధగూడ ననివార్య మని తలఁచి మానవుఁడు మాయోపాయముచే నరవధఁ గావించును. కాని, మృగవలల భక్షకుండయ్యు, నరుఁడేలకో నరునినంజుడుఁ గుడుచుచుండుట లేదు. జనకా! అందులకు హేతువది రుచ్యమైనది కాదనియా?

సెల్యూ—దాని నట్లు కుడుచు యాచారము లేదు.

హెలెన్—లేనిచో మీరు దానిని సృష్టింపుఁడు. భవన్నామమాచంద్రతారార్కమై యుండును! ప్రపంచమందు మీ ప్రతిభ చిరస్థాయిదై యుండును! జనకా! మీ పురుషులందఱెట్టి రక్తపిపాసువులై యుంటిరేల? మీ హృదయములందు మఱే ప్రవృత్తియు లేదా?

సెల్యూ—ఏ ప్రవృత్తి?

హెలెన్—సత్ప్రవృత్తి—సత్కార్యముల కుత్సహించు ప్రవృత్తి! పితా! దుఃఖార్తుల దుఃఖము దూరీకృతమొనరించుట, రుగ్ణులకుఁ బరిచర్యఁ గావించుట, క్షుధార్తులకోదనముఁ గుడువఁబెట్టుట, అజ్ఞానులకు జ్ఞానోపదేశ మొసఁగుట మొదలగు కార్యములు పురుషులచేఁ బాటింపఁదగినవి కావా? కేవలము స్వార్థప్రసారము, వేదనావృద్ధి, అత్యాచారయపచారపీడనములు మాత్రమే మానవ సంకల్పములై యుండవలెనా?

సెల్యూ—విజిగీష మానవమహత్ప్రవృత్తులలో నొకండని డెమస్థనీసు

మహాశయుఁడు పల్కియుండలేదా ?

హెలెన్—అతఁ డట్లెందును జెప్పియుండలేదు. డెమస్థనీసు గ్రంథములఁ దీసికొని వత్తునుండుడు. [పోఁ బోవును]

సెల్యూ—వలదు ! పోవలదు !! వానిని గొని రానక్కఱలేదు. నీవు డెమస్థనీసు మహాశయుని గ్రంథముల నన్నింటిఁ బఠించితివా ?

హెలెన్—పఠించితిని.

సెల్యూ—నీ వంత యధికముగ గ్రంథపఠనమేల గావించుచుంటివి ? చదువగాఁ జదువుగా నీ మతి చెడును. అధికపఠనము మూర్ఖత్వమును నశింపఁజేయురా?

హెలెన్—ఓహో ! పఠనము మూర్ఖత్వమును నశింపఁజేయునా ? అట్లైన పఠన మొనరింపనిచో మూర్ఖత్వము వృద్ధియగును కాఁబోలు ! జనకా ! ఈ నియమముఁబట్టి జూడ మూర్ఖశ్రేష్ఠము గార్దభమని దోపకమానదు !

సెల్యూ—ఏల ?

హెలెన్—అదేమియుఁ బఠింపలేదు కావున.

సెల్యూ—దుహితవయ్యు నీవు నన్నధిక్షేపించుచుంటివా ?

హెలెన్—మిమ్ము నే నెందుల కధిక్షేపింతును ?

సెల్యూ—నన్ను నీవు గార్దభముతోఁ బోల్చుచుంటలేదా ?

హెలెన్—నేను మిమ్మట్లు పోల్చలేదు.

సెల్యూ—పోల్చకేమి ? పోల్చితివి !

హెలెన్—జనకా ! అపరాధ మొనరించితిని. [కరకమలముల ముకుళించి]—తండ్రీ! నానేరము సైరింపుడు.

సెల్యూ—సైరింపను. నేఁ గినిసితిని. ఇట్లీవు నన్నుఁ దఱచుగా నవమానించుచుందువు.

హెలెన్—జనకా ! నన్ను మన్నింపుడు.

సెల్వ్యా—పొమ్ము! నే నట్లు మన్నించువాఁడను కాను. [చేయి విద లించుకొనును.]

హెలెన్—[గద్గదస్వరమున]—తండ్రీ! మీతనయను క్షమింపుఁడు.

[నతజానువ యగును.]

సెల్వ్యా—నందనీ! లెమ్ము!—నీ వేమియు నపరాధముఁ గావింప లేదు. దోసము నాయదియే. క్రోధవశమున నిన్ను నేఁ బొమ్మం టిని. నీయెడల నే నింత కఠినుండఁ గాఁగలనని యెన్నఁడు దలంచి యుండలేదు—అమ్మా! లెమ్ము! [తనయను మెల్లగ లేవనెత్తి] నీ యయ్యను మన్నింపుము!

హెలెన్—తండ్రీ! మీ రట్లనఁ జెల్లునా?

[జనకుని గళమును కౌఁగిలించుకొనును.]

సెల్వ్యా—[తనయను బాహువేష్టన మొనరించి]—అమ్మా! తల్లి లేని బిడ్డవని తలంపక నిన్నుఁ దూలనాడితిని! జనకుం డెంతైన గుమారియెడ నిట్టి నిష్ఠురుండై యుండునా?

హెలెన్—నేను తల్లిలేని బిడ్డ నైతిని? నాకుఁ దల్లియుఁ దండ్రియు మీ రేకదా! నాకు మీరొక్క తండ్రులే యగుచో నేనింత గార ముఁ గావింపఁగలనా?

సెల్వ్యా—అమ్మా! నీ వేమి గారముఁ గుడుచుచుంటివి?

హెలెన్—ఏమియు గారముఁ గుడుచుచుంట లేదా?

సెల్వ్యా—అమ్మా! నీవు నన్నేమియు నడుగుచుంట లేదు.

హెలెన్—నే నేమియు నడుగకుండనే నాకుఁ గావలయు వానినన్నిఁ టిని మీ రొసఁగుచుంటిరి. పితా! నాకేమి కొదువగలదు?

సెల్వ్యా—నీకు సుందరదుకూలములుకాని, యమూల్యభూషలు కాని యేవి?

హెలెన్—నాకట్టివి బహుళంబుగాఁగలవు!

సెల్యూ—అట్లైన వాని నెన్నఁడును ధరింపవేమి?

హెలెన్—వాని ధరించిన, సంతుష్టు లగుదురా? నీరట్లగుదురేని నేనిఁక వాని ధరించుచుందును!

సెల్యూ—ధరింపుము! అమ్మా! నీవు వాని ధరింప, నేఁజూచి మిగుల యానందింతును—నే నిపు డొకమాఱు సైన్యాధ్యక్షుని శిబిరమున కరుగుదును. నీవిఁక పోయి శయనింపుము. సాగరికా!—

హెలెన్—పోవుచుంటిని. జనకా! సంధ్యకాకనే పరిచారిక యరుదెంచి, నన్ను నిదురఁబుచ్చుటకు నే నింకను పసిపాపనా?

సెల్యూ—అమ్మా! నీవు చాల రాత్రివఱకు మేల్కాంచి చదువుచుందువు. నిదురమాని, చదివినకొలఁది దుర్బలవగుచుంటివి. నీ మేనిఛాయ మలిన మగుచున్నది. తల్లీ! నీ వెక్కుడుగ జదువకుము.

హెలెన్—(నవ్వి)—అట్లైన, జనకా! నే నిఁక నొకించుక మూర్ఖకనై యుందును.

సెల్యూకసు నిష్క్రమించును. క్షణకాలము విచారిజేసి, హెలె నొక పుస్తకముఁ దీసికొని కూరుచుని దానిఁ జదువసాగును; కొంతతడ వైనపిదప పాత్రమును ప్రక్కనుంచి ఆ బాల యాత్మగతంబున నిట్లనుకొనును—"అల్లదె! అంబుజాక్షుఁ డస్తశైలము నేరుచుండెను! సింధుశైవలినీకూలమం దానాఁడు కనులపండు వొనరించిన గరిమామయ యాదిత్యాస్త మిపుడు జ్ఞప్తికి వచ్చుచున్నది. వివిధరాగ విలసితమై, ఆహా! ఆనాఁడు విన్నెంత వింతయందముగఁ గన్పట్టెను! భాస్వంతకిరణచ్ఛటోజ్జ్వల భారతవర్ష మెక్కడ? కుజ్ఝటికావృత యేతద్గాంధారభూమి యెక్కడ? (మరల పుస్తకమువై పునకొకపరి జూచి తలనెత్తి) ఆహా! యశఃకిరణభాసమానుండై, ఆ మగధరాజపుత్రు డిపుడు చిత్తాక్షి సమక్షమున నెట్లు తోఁచు

చున్నాఁడు!—

ఆ సీమయాదిభాష యెంత శ్లాఘనంబైనది!—నిక్కముగ నేను సంస్కృతమును నేర్చుకొందును! భావుకత, కవిత్వ, జ్ఞానముల కా యార్యభాష యొక యద్భుతఖనియట! (నరల పుస్తకముఁ జూచి, పదముల యులికిడి కాగా మాళి నెత్తి)—ఎవరు? (వెనుకకుఁ దిరిగి జూచి)—ఓహో! ఏంటిగోనసా!!

(ఏంటిగోనసు ప్రవేశించును)

ఏంటి—అవును. నే నేంటిగోనసునే!

హెలెన్—(లేచి) నా జనకులు గృహమునందు లేరు.

ఏంటి—అట్లని నే నెఱుంగుదును.

హెలెన్—అట్లని యెఱింగియుండియు, బిఱబిఱ నీవు లోని కేల జొర బడితివి?

ఏంటి—ఒంటరివై యుండు నీతోఁ బ్రసంగింపవలెనని మతి—

హెలెన్—ఏమి! ఏమనుచుంటివి!!

ఏం—(అభ్యంగము సూచించుచు)—కాంతా! నా యాగమనము నీ కంత యప్రీతికరమా?

హెలెన్—అట్లని నేఁ బల్కియుండలేదు.

ఏంటి—ఆహా! నారీజాతి యెంత కపటమైనది! ఈమె చిత్తమందలి భావము నిప్పుడుకూడ గ్రహింపఁజాలకపోతిని. "అట్లని నేఁ బల్కియుండలేదు" ఓహో! ఎట్టి సుందరయుత్తరము! (హెలెన్ వంక దిరిగి) రమణీ! అట్లని నీవు పల్కియుండకుండుట నిక్కమే. కాని, నా యాగమనము నీకుఁ బ్రీతికరమో, యప్రీతికరమో తెలుపుట కేమైన యభ్యంతర మున్నదా?

హెలెన్—అది తెలిపిన లాభమేమి?

ఏంటి—నష్టముమాత్ర మేమి? తెలిపినందువలన నీకు లాభ ముండక

పోవచ్చును,—కాని, వినినందువలన నాకు లాభమున్నది!

హెలెన్—ఏమి లాభము?

ఏంటి—నీయుత్తరముపై నా భవిష్యత్తంతయు నిర్భరమై యుండుటే దాని లాభము!—రమణీమణీ! కడపటిమాటు నిన్నడిగిపోవుటకే యిపుడు నే నిట కరుదెంచితిని?

హెలెన్—కడపటిమాటు నన్నేమడిగిపోవుటకై యిపుడు నీ విట కరుదెంచితివి?

ఏంటి—అంబురుహాననా! అశ్రుజలపూర్ణాక్షుండనై, నతజానువనై, నా వేడికోలు నాలింపుమని పలుమాటులు నిన్ను వేఁడితిని. సుంతైన గరుణఁజూపక నా కీవు ప్రణయభిక్ష నొసఁగితివికావు. పదంపడి క్రోధకంపితస్వరమున నొకించుక వెఱవు గొలిపి నీ సమ్మతిఁ బడయ నుంకించితిని. అపుడుకూడ నేను శిథిల మనోరథుండనైతిని! సహజ సరళ శుష్క భాష నీ కడపటిపర్యాయమడుగుటకే నే నిపుడు నీ సమ్ముఖమున కరుదెంచితిని. ఇందుఁ గ్రోధముకాని, యనురోధముకాని యేమియులేదు—నన్నీవు పరిణయమాడుట కియ్యకొందువోలేదో తెలుపుము!

హెలెన్—నా జనకుని స్కంధముపైఁ గత్తినెత్తిన కట్టిడి నే నెట్లు పరిణయమాడుట కియ్యకొందును?

ఏంటి—మరల నీమాటుకూడ దానినే యుల్లేఖించుచుంటివా? నీమంతినీచూడామణీ! దానికిఁ గారణము నీవేకదా! తత్పూర్వము నీకడఁ బరిణయప్రస్తావ మొనరించినతఱి, నీ జనకుని యిచ్ఛయే నీయిచ్ఛయని వచించితివి! తదనంతరము నీతండ్రి యభీష్ట మేమోయడుగ వ్యంగస్వరమున 'నా వ్యక్తి యెవ్వాని జన్మ మనిశ్చయమై యుండెనో, యెవ్వాని జనకుఁ డజ్ఞాతుఁడై యుండెనో, వానికి సెల్యూకసు తనయ లభించుట గలలోనివార్త' యని వాక్రుచ్చెను.

హెలెన్—అతఁడు సేనాధిపతి. స్త్రీల యొక్క సామాన్య మాన వుఁడవు !—

ఏంటి—వియ్యమున కాతఁ డియ్యకొనకుండుట కది హేతువు కాదు. అతఁడు నా జన్మముగుఱించి పరిహాసము సలిపెను. ఆ వ్యంగజ్వాలచే నే నోడ లెఱుంగక యాతని మౌళిపైఁ గృపాణము నెత్తితిని—హేమాంగీ! నన్ను మన్నింపుము.

హెలెన్—నిన్ను మన్నింపఁజాలినను, పరిణయ మాడఁజాలను!

ఏంటి—ఏల?

హెలెన్—తన యభిప్రాయములను గుఱించి, రాజకన్య తన ప్రజలలో నెవరికడనైన సమాధాన మొసఁగ బాధ్యురాలు కాదు.

ఏంటి—ఏమి! నీ గర్వోక్తి!!

హెలెన్—నే నానుడువును రద్దుజేసివైచితిని. దానిని నే నుచ్చరింప లేదనుకొనుము. పరిణయము కాని పడతి నిజవివాహవిషయమునఁ దనకుఁ గల మతామతముల హేతుకము దేనినైన నేరికడనైన వ్యక్తీకరింప బాధ్యురాలు కాదనియంటి ననుకొనుము.

ఏంటి—నాకడ నీ మతామతముల హేతుకము దేనినైన వ్యక్తీకరింప నక్కఱలేదు. నాకుఁ గావలయునది నీ యుత్తర మొక్కటియే! నన్ను వివాహమాడెదవో లేదో తెల్పుము!!!

హెలెన్—సైనికా! ఏమి నీ కఠోరస్వరము! నీ భైరవదృష్టిఁ జూచి యీమె భయపడునని యనుకొనుచుంటివా?

ఏంటి—నాకిప్పుడే నీ యుత్తరము కావలయును. నన్ను వివాహ మాడెదవా లేదా?—చెప్పుము!

(హెలెన్ యొక్క కరము బట్టుకొనును.)

హెలెన్—దురాత్మా! ఇదేమి దుండగము!—కాపురుషా! నా కరము వదలుము!!—నీవు యవనుండవే?

ఏంటి—నేను ప్రేమికుఁడను! సర్వజ్ఞసులభప్రత్యుత్తరమిమ్ము. వివాహ మాడెదవా లేదా?

హెలెన్—నీయట్టి కలుషాత్మునిఁ గట్టుకొనుటకంటె నొక దుర్గంధ గళితకుష్ఠురోగిని వివాహమాడు టుత్తమము. అధమాధమా! (బలంబుగఁ జేతిని విదలించుకొని)—ఇందుండి పొమ్ము!

ఏంటి—మంచిదట్లనే పోవుచుంటిని! (ఒకించుక దూర మరిగి, మరల వెనుకకుఁ దిరిగి) హెలెన్! పోవుతఱి నేనొకమాటఁ జెప్పి పోదును!

హెలెన్—"రాజపుత్రీ!" యనుము. పేరుబెట్టి నన్నుఁ బిలచుటకు నీ కధికారము లేదు. ఇచ్ఛగించితినేని యెవనిఁ గీటముకరణి గాలితో నలిపివేయఁగలుగుదునో, అధమాధముం డగుటచే నెవని నట్లు తుదముట్టింప గడంగకుంటినో, అట్టి సామాన్య సైనికుఁడొకండు ప్రాచ్యసామ్రాజ్య సార్వభౌముని ప్రియదుహిత శరీరమును స్పృశింపసాహసించెగా!—దుర్మతి! నీ దౌరాత్మ్య మెంతదూర మరిగెను!!

ఏంటి—మంచిది! దీని కుచిత ప్రత్యుత్తరము మఱొండు దినమున నొసంగెదను! కాలచక్రము తిరుగునో, తిరుగ కటులనే యుండెనో చూచెదగాక!

ఇట్లని యాతఁ డందుండి వెడలి గొంతదూర మరుగును. అత్తఱి సెల్యూకస్ సాకస్మికముగ వాని కెదురగును.

సెల్యూకస్—ఎవరు? ఏంటిగోనసా! మరల నీవీ యేకాంతమున సాక్షాత్కరించితి వేల?

హెలెన్—(కంపితస్వరమున)—జనకా! మీ ముద్దుపట్టి కాయమును స్పృశింప సాహసించు కలుషాత్మ యవనుఁడు మీ సైన్యాధ్యక్షుఁడా?

సెల్యూ—ఏమి! నిన్ని దురాత్ముఁడవైనా!! (ఏంటిగోనసు నుద్దేశించి)—సైనికుఁడా! ఇది నిజమేనా?

ఏంటి—నిజమే!—నే నప రాధ మొనరించితిని.

సెల్యూ—దురాత్ముఁడా! ఏమి నీ కండ గావరము!!—సికిందరు పాహామహారాజుచే నిర్వాసితుండవైన వాఁడవయ్యు, నీపై జాలిఁగొని నిన్ను నాసైన్యాధ్యక్షునిగ నియమించి, నీ కొనరించిన యుపకారమున కిదియా ప్రత్యుపకారము? మంచిది, తగుశాస్తి నీవిప్పుడ బడయుదువు!—సేవకులారా!

(ఇరువురుభృత్యులు ప్రవేశింతురు)

సెల్యూ—ఈదురాత్ముని బందీగావింపుఁడు!

(భృత్యు లేంటిగోనసును బంధింతురు)

సెల్యూ—మృత్యువే నీకుఁ దగుదండనము!—భృత్యులారా! ఈ కూళను నీముహూర్తముందే వధ్యభూమికిఁ గొనిపొండు!!

భటులు—“చిత్తము ప్రభూ!” (అని యాతనిఁ గొనిపోవ నుద్యమింతురు).

హెలెన్—(భటుల నుద్దేశించి) “నిలువుఁడు! నిలువుఁడు!! (జనకుని సంబోధించి) తండ్రీ! ఈసారి వీనిని విడిచి వేయుఁడు!

సెల్యూ—విడువను! వీనికి గర్వభంగముచేయవలెను.

హెలెన్—వధింపకుఁడు! పదచ్యుతుఁ గావింపుఁడు!!

సెల్యూ—వీని కాశిక్ష చాలదు.

హెలెన్—రాజ్యమునుండి వెడలఁగొట్టుఁడు—మృత్యువువాతఁ బడ ద్రోయకుఁడు!

సెల్యూ—ఇటువంటి దురాత్ముని విడువఁదగను—వీని నిప్పుడే వధింపవలయును.

హెలెన్—ఈతఁడు వీరుఁడు—భయరహితుఁడై తన నేరము నొప్పు

కొనియెను! ఈయొక్కమాఱు—వీనిని క్షమింపుఁడు! చంపక, రాజ్యమునుండి పొమ్మనుఁడు.

ఏంటి—సెల్యూకసూ! క్షమింపుమనీ నిన్ను నేఁ బ్రార్థించుటలేదు. నే నపరాధమొనరించుట నిక్కమే. అట్లని నే నొప్పుకొనుచునే యుంటిని. నానేరమునకుఁ దగుశిక్ష విధింపుము.

హెలెన్—దానిని నేఁ గోరుచుంటిని—జనకా!—

సెల్యూ—వధింపకతీఱదు.

హెలెన్—(కరముల జోడించి)—తండ్రీ! ఈయొక్కపర్యాయము మాత్రము నా వేడికోలు నాలింపుఁడు.

సెల్యూ—మంచిది! (ఏంటిగోనసు నుద్దేశించి) సైనికుఁడా! నాసం దని యనురోధముకతన నిన్నీమాఱు మన్నించితిని! ఈదినముననే యిందుండి వెడలిపొమ్ము. ఇంకముందెన్నఁడైన నాసామ్రాజ్యమందీవు కాలిడినచో, మరణమే తథ్యమని యెఱుంగుము. భటులారా! వీనిని విడువుఁడు!

(భృత్యు లేంటిగోనసు సంకెలల విప్పివైచి, వానిని విడువ నాతఁ డటనుండి నిష్క్రమించును.)

హెలెన్—జనకా! నిక్కముగ మీరు వీనిని విడచివైతురని నే నెఱుంగుదును.

సెల్యూ—తల్లీ! నీకడ నాయుక్తులు రిక్తములైపోవుచుండును. ముదుసలివయసున నాకీవు తల్లివై యెట్టులైన నాపై మిక్కిలి వాలుకుము చలాయించుచుందువు!

హెలెన్—(నవ్వి)—తండ్రీ! ఈవిషయమున ఢెమిట్రస్కి నేమనినాడు? డెమెట్రియసని నట్లే యన్నాఁడా యేమి?

సెల్యూ—ఏమియు ననలేదు! నీవు మిగుల దుండగురాల వగుచున్నావు!—అమ్మా! ఇఁక లోనికిఁ బొమ్ము!

[నిష్క్రమించును.]

హేలెన్—(బిచారి చేయుచు) జనయితా! మీయిచ్ఛయే నా యిచ్ఛ! నీవు నాపైఁ జూపు యవ్యాజకరుణకు ప్రతిఫలమున నే నే మొసఁగఁగలను?—మీస్కంధముపై కృపాణాఘాతమేయ సాహసించిన వానిని మీముద్దుతనయ యెన్నఁడు బాణిగ్రహణ మొనరించు కొనుట కియ్యకొనదు! ఆతఁ డెంటిగోనస్ నైనను సరే, వానికంటె నధిక సాహసోపేతుఁడైనను సరే,—వాని యర్ధాంగి యగుట కీ యవనరమణి యంగీకరింపదు.

## ద్వితీయరంగము

రణాంగణమున చాణక్యుని శిబిరము—రాత్రిసమయము.

మురా చాణక్యులు ప్రసంగించుచుందురు.

ముర—దేవా! యుద్ధ మెల్లినుండియే జరుగునా!

చాణ—అవును. అట్లని పవలంతయు నూఱుమాఱులు నీకుఁ జెప్పితిని. మరల దానినే యడుగ నీ నిశీథమునందరు దెంచితి వేల?

ముర—గురుదేవా! స్థిరమతినై యుండ నేరకున్నాను.—స్వామీ! ప్రథనమువలన బ్రయోజనమేమి?

చాణ—(ఆశ్చర్య పురస్సరముగ)—మురా! ఏమంటివి!!

ముర—ఆర్యా! చంద్రగుప్తుఁడు నాప్రియపుత్రుఁడు—నందుఁ డందురా,—ఆతఁడు కూడ నాకతిప్రియుఁడగు నందనుఁడు! వారలిద్దరొకే వృంతమందలి రెండు గులాబిమొగ్గలు! చంద్రగుప్తనందులు నాహృదయాకాశమందుఁ, బరిభ్రమించు చండాంశుహిమాంశులు. వారల సంఘాతముచే నాయాకసము పూర్ణముగఁ జూర్ణీకృతమై చనును!—గురువర్యా! నాచంద్రగుప్తుఁడు పథబి

కారిదై యుండుగాక! వివాదమువలన ఫలమేమియుఁ జేకూరదు.

చాణ—వృద్ధురాలా! వ్యర్థమగు నాందోళన మందకుము. సమ్ముఖమున దండధరుని మూర్తిభీభత్సముగ కనఁబడుచున్నది! వియత్తలమెంత స్థిరమైయున్నదో చూచుచుండలేదా? రుద్ధశ్వాసంబున నదొండు ఝటికను నపేక్షించుచున్న ట్లున్నది! అంతయు సిద్ధమైయున్నది! నీవిలాపము వినుట కిది తగినయదను కాదు. శిబిరాభ్యంతరమున కరుగుము.

ముర—నా విలాపమందురా! గురుదేవా! నేనెంత దుఃఖము సహించి యుంటినో సుంతైన మీ రెఱుంగుదురా!

చాణ—కారాగారలోహద్వారములపై తమ నెత్తులను గొట్టుకొని చిమ్మిన రక్తముచే నేలను సిక్తముగజేయు రుద్ధావేగులగు పురుషుల లుప్తగౌరవదీనతామహాత్మ్యము నీవెట్లురుగ గలవు? కాంతా! ఈప్రతిహింసాజ్వాల, నీమర్మదాహము నీవెట్లెఱుంగఁ గలవు? ఇఁక విసుగుఁగొలుపక శిబిరాభ్యంతరమున కరుగుము— ఈసంగ్రామ మనివార్యము!

ముర—కాని, గురుదేవా?—

చాణక్య—[కఠోర స్వరమున]—పొమ్ము!

[భయాతురయై ముర నిష్క్రమించును].

[చాణక్యుఁ డేకాకియై, పచారి చేయఁదొడంగును]

చాణక్య—సూకరముఖంబును, శవదాహగంధంబును, గార్దభచీత్కారంబును మొత్త మొనరించి వాని నొక బృహద్భాండమందిడి దాని నధిశ్రయణిపై నుంచితిని. ఎట్టి పాకము తయారగునో చూచెద. నిశ్చయముగ నొక నూతనవిధమగు వ్యంజనము సిద్ధము కావలెను!—ఓ అదృశ్యమహాశక్తీ! ఎట్టి మధురమృతమృగకళేబరప్రపూర్ణ క్షేత్రాభ్యంతరమునుండి నాకరముఁ బట్టుకొని ముందు

నకుఁ గొంపోవుచుంటివి!—బళీ! బాగు!! బాగు!!!—[వెలు పలకు జూచి]—ఆహా! బాహ్యమున శిశిరబిందువు లొక్కొం డొక్కక స్ఫులింగముచాడ్పున జ్వలించుచున్నవి! ఆకస మంతయు ధగద్ధగాయమానముగ నున్నది! నేనీ యగ్నిప్రదాహమందు నా కాయమును విడచివైచితిని! బ్రహ్మతేజంబువలనఁ గాఁబోలు నది దగ్ధంబగుట లేదు. [నవ్వి]—ఈకలియుగమందుఁగూడ నొక మాఱు విప్రప్రతాపముఁ జూపవలెను!—ప్రేయసీ! చూపవలె గాదా? ఏమందువు? దీర్ఘదంతములచే వికట మహాహాస మొన రించుచు, ముక్తశిరోజావృతభయంకరోత్తమాంగము నూచుచు, నీ 'వౌనౌ' ననుచుంటివి! కాంతా! నీకంఠరవ మెంత స్పష్ట మైనది! —హే! సుందరీ! నీ వట్టి కదర్యకాయవు! నీ ప్రేమచేఁ దుద కున్మాదుండనై పోకుందుఁగాక!—ఎవరు!—కాత్యా యనుఁడా!!

[కాత్యాయనుఁడు ప్రవేశించును]

కాత్యా—చిత్తము. నేను కాత్యాయనుఁడను.

చాణ—ఇంతరాత్రివేళ వచ్చితివేల?

కాత్యా—వార్త యున్నది.

చాణ—ఏమది?

కాత్యా—నందుని వృద్ధయమాత్యుఁ డరుదెంచెను.

చాణ—[ఆతురమున]—వచ్చెనా?—తరువాత?

కాత్యా—ఆతఁడు సంధిమాటఁ గదల్పవైచెను.

చాణ—ఎట్లు?

కాత్యా—బహువ్యర్థప్రసంగానంతరమున, నన్నదమ్ములకు వివాద మేలయనియు, నిర్వురు భ్రాతలు సామ్రాజ్యమును సమంబుగ భాగించుకొను టుత్తమంబనియు, నందుఁ డజ్ఞానుండును కనిష్ఠం

డును నగుటంజేసి యాతఁడు కావించిన దోసము నగ్రజుండు సైరించుట సమంజసమనియు నాతఁడు వాక్రుచ్చెను.

చాణక్య—(సకౌతూహలముగ)—బాగు! బాగు!! చంద్రగుప్తుఁ డందున్నాఁడా?

కాత్యాయన—ఉన్నాఁడు.

చాణ—ఆమంత్రి మిగుల విచక్షణునివలె నున్నాఁడు—చంద్రగుప్తుఁ డేమైనఁ బల్కెనా?

కాత్యా—నీ వేమైన వచించితివా?

కాత్యా—మీయభిప్రాయము గైకొని పదంపడి నాయుద్దేశ్యమును వ్యక్తీకరించెదనని యుత్తర మొసఁగితిని.

చాణ—నాకడ కాతనిఁ గొనిరాలేదేల?

కాత్యా—ఆతఁ డందుల కియ్యకొనలేదు.

చాణ—మంచియెత్తు వైచినాఁడు. పరాజయ మనివార్యమని గ్రహించి—చూతముఁగాక!

(ఏదియో చింతించును)

కాత్యా—మీ రేమందురు?

చాణ—ఏమనుట కేమున్నది?—“మనసా చింతితంకర్మం వచసాన ప్రకాశయేత్”

కాత్యా—ఆర్యా! నేను మీమిత్రుండను కానా? స్నేహితునికడ మీభావమును వెలిబుచ్చరాదా?

చాణ—చాణక్యపండితుఁడు చెప్పియుండలేదా? “నమిత్రేప్యతి విశ్వసేత్” నీకు దానిని వ్యక్తీకరింపఁ దగుసమయ మింకను రాలేదు కాని సంధిమాత్రము కానేరదని యెఱుంగుము.

కాత్యా—ఏల!

చాణ—నీ వీఁక శిబిరంబున కరుగుము. నే నిపుడొకమారు ప్రేయ

సీతో నాలోచింపవలెను.

కాత్యా—ప్రేయసి యెవరు?

చాణ—నీవెఱుఁగవు. (నవ్వి) నాకొక వేశ్యకలదు.

కాత్యా—మీకు వేశ్యయా!!

చాణక్యుఁడు పెద్దనవ్వునవ్వెను. కాత్యాయనుఁ డబ్బురము సూచించుచు ముఖము తెఱచి చాణక్య నని మేషనయనుఁడై విలోకించును.

చాణ—ఆవృద్ధమంత్రిని నీవెఱుంగుదువా?

కాత్యా—ఎఱుఁగకేమి?—శైశవకాలమందు మే మిరువురము కలసి శాస్త్రపాఠ మొనరించితిమి. మనోవిజ్ఞానమం దాతని కద్భుత నైపుణ్య ముండెడిది. అహర్నిశము లాతఁడు సాంఖ్యశాస్త్ర పారాయణమే కావించుచుండువాఁడు!

చాణ—ఆతఁ డట్లొనరించుచుండ, నీవు పాణినీపఠన ప్రారంభించు చుండువాఁడవు కాఁబోలు.

కాత్యా—అయ్యా! పాణినీవ్యాకరణము మీకు నవ్వులాటగా నున్నదా: దాని సూత్రము లొక్కొక్కటి యొక్కొక లక్ష వరహాలు విలువజేయును. గూఢతత్వగర్భితము కాని సూత్ర మొక్కటైనలేదు. చూడుడీ సూత్రము.

చాణ—ఉండు! ఉండు!! ఇవు డేకరువుపెట్టకుము!—నీ సూత్రముల వినుటకు నాకిపు డవకాశము లేదు.

కాత్యా—ఆర్యా! పాణినీవ్యాకరణ—

చాణ—ఇపుడు వ్యాకరణముతోఁ గూరుచున్న యెడల పని జరుగదు.

కాత్యా—మీరు పాణినిని మిగుల తుచ్ఛముగాఁ జూచుచున్నారు! ఆ మహావ్యాకరణ మెందులకుఁ బనికిరాదని తలఁచుచున్నారు! మీకు తెలియునో, తెలియదో యొక్కసూత్రము విప్పి—

చాణ—నందుఁడు నిన్నుఁ గారాగృహమందేల బంధించియుంచెనో నాకిపుడు కొంచెము బోధపడుచున్నది.

కాత్యా—ఏలనుఁ జెను?

చాణ—నీపాణినీ పీడనమువల్లనే! కూర్చుని, అదేపనిగ పాణినీ సూత్రములను సానబెట్టు చుందువు. రాజ్యమంతయు మరిడిజాడ్యముచే మటుమాయమగుచున్నను నీపాణినిఁ బట్టుకొని భద్రముగఁ గూరుచుందువు! యుద్ధమగుచున్నను, నీకుఁ బాణినియే! అతివృష్టికలిఁగినను, పాణినియే! అనావృష్టికలిఁగినను, పాణినియే!!— మహారాణి మహారాజుతోఁ గలహించి యిల్లంతయుఁ దల్లక్రిందులు చేయుచున్నను నీకుఁ బాణినియే! తుదకు నీపాణినీసంధిచేఁ బీడ జ్వరపీడితుండై నిజప్రాణరక్షణార్థము నందుఁడు నిన్నొక చోఁ గూలవైచెనని వింటిని! ప్రాణము విసిగించినపుడిఁక వేఱుపాయ మేమి?

కాత్యా—ప్రాణము విసుగుటేమి? పాణినీముఖము తెలియనివానికి విసుగుకాక మఱేమిపుట్టును?

చాణ—నీపాణినీ పట్టుటవల్లనే నందుఁడు మంచము బట్టెనఁట! అపుడే గాటమగు శూలవేదన ముత్పన్నమాయెనఁట! శిరమంతయుఁ దిరుగసాగెనఁట! తేన్పులు వమనములు కలిఁగెనఁట! తుద కేయుపాయములేక నిన్నాతఁడు కారాగారమందు బంధింపవలసివచ్చెనఁట! కాత్యాయనా! నీపాణిని యొక్క గొప్ప తప్పిదము మాత్రము గావించెను.

కాత్యా—అదేమి?

చాణక్య—ఏపెద్దమనిషియైన ముఖస్తము జేయుటకు సాధ్యముకాని యొక వ్యాకరణము లిఖించుటే గొప్ప తప్పు!

కాత్యా—ఆహా! మీకుఁ బాణినీమహిమ యేమియుఁ దెలియఁజాల

కున్నందులకు నేను మిగుల వగచుచున్నాను. ద్రాక్షపానకమువలె నొక్కొక పాణినీసూత్రము—

చాణ—మిగుల మధురమై యుండును! నీ వనునది నిక్కమే! కాని దానిని విశేషముగాఁ గ్రోలుటవలన నీ మతి చెడినది. అందువలన నే నొకటి జెప్పునట్లు మొదలుపెట్టితివి—ఇఁక కాలహరణ మొనరింపక శిబిరమున కరిగి చంద్రకేతు వెందుండెనో చూడుము.

కాత్యా—ఆతఁడు చంద్రగుప్తుని శిబిరమం దుండెను.

చాణక్య—ఇది సులభముగఁ జెప్పివైచితివి. ఏ పాణినీ సూత్రము ననుసరించి నీ వీ యుత్తర మింత యవలీలగ నొసఁగఁగలిగితివి? అదేమో గొప్ప సూత్రమై యుండవలెను!

కాత్యా—ఇట్టి తుచ్ఛ విషయములతోఁ బాణిని తలనొప్పిఁ దెప్పించుకొనలేదు!

చాణ—ఇఁక బొమ్ము. చంద్రకేతు నొకమాఱు నాశిబిరమునకుఁ బంపుము.

కాత్యాయ—పంపెదను. కాని పాణినీసూత్ర—

చాణ—మరల బాణిని యనుచుంటివేల? రణభూమియం దీయర్ధనిశీథమున బాణినీసూత్రములను వినుట కవకాశము లేదు. నీవు పోయి వాని నంపుము. చాల జరుపురు యున్నది.

కాత్యా—కాని, ఆర్యా! పాణినీసూత్రముల విషయమున మీరు—

చాణ—పాణినిని, వాని సూత్రములను కలపి నరకకూపమందుఁ బడనిమ్ము. నీవిఁక నామాటయెత్తకఁ బొమ్ము—

కాత్యా—పాణినీగ్రంథమొక్క వ్యాకరణమే యని లోకులు తలఁతురు—మూర్ఖులు. పాణినీయందలి వేదాంతసారమును—

చాణ—పో! పొమ్ము!! ఇఁక విశేషముగ విసుగుఁ గొలుపకుము—పొమ్ము!

కాత్యా—పోవుచుంటిని—[పోవుచు] కాని మీరు పాణినీ నవమా నించివైచితిరి!

[దుఃఖితభావమున నిష్క్రమించును.]

చాణ—వట్టి యమాయకుఁడు! కేవలము ప్రవృత్తి ననుసరించి కార్యము సలుపును. నిర్బోధుఁడు—ప్రేయసీ! ఇవు డేమందువు? నందుని మంత్రి మంచి యుక్తిఁ బన్నెను కాదా? పరాజయ మని వార్యమని యెఱిఁగి—ఆహా! ఎట్టి యుక్తి! అది కానున్న నిఁక వేఱుపాయమేది? వాని ప్రవర్తన చిహ్నములను పూర్తిగ లక్ష్యించితిని!—నీవు కూడ లక్ష్యించియుందువు. మంత్రి మహాశయా! తగుయదను చూచి మంచి యెత్తు వైచితివి. కాని నీవు చాణక్యునితోఁ జాలలేవు. మీదు మిక్కిలి అతని—నొకించుక సతర్కుఁ గావించితివి! ఇఁక నీవు చేయఁగలుఁగున దేమియు లేదు.

[చంద్రకేతు ప్రవేశించి చాణక్యునికిఁ బ్రణామ మొనరించును]

చాణ—జయోస్తు!

చం॥కే—ఆర్యా! ఆజ్ఞ సెలవిండు.

చాణ—రేపు యుద్ధము. మీరలు ప్రాణములను తుచ్ఛమొనరించి పోరిన యెడల కదనమందు మనజయము నిశ్చితము.

చం॥కే—గురుదేవా! "ప్రాణములను తుచ్ఛమొనరించి పోరిన యెడల" ననుచుంటి రేల? నాయెడ మీకు నమ్మకము లేదా?

చాణ—నమ్మకము లేకేమి?

చం॥కే—అట్లైన మీకీసందేహమేల?

చాణ—చంద్రగుప్తుని నేను పూర్ణముగ విశ్వసింపఁజాలకున్నాను.

చం॥కే—ఏల?

చాణ—ఉచ్చ ప్రత్యాశకంటె బలవత్తరమైన ప్రవృత్తి యొండు

వాని వెనుకఁ దొంగి జూచుట నుపలక్షించితిని. చూడం జూడ కాంతివంతమైన యాతని యాననమాకస్మికముగ మేఘాచ్ఛన్న మగుచుండును. ఆసయోదమునుండి యొకటి రెండు మాఱులు వర్షధారలు గురియుటఁ గూడఁ గాంచితిని. ఈప్రవృత్తితో నాతని శౌర్యము సంభూతము కాకున్నచోఁ దచ్చౌర్యము దుర్జయమై యుండును!—కాన నీవప్రమత్తుండవై యట్లు కాకుండునట్లు చూడుము.

చం॥ కే—మీా ముదలయేదో సెలవిండు.

చాణ—కదనమెల్లి యారంభమగును. అంత దనుక నీవు వాని పార్శ్వమందు నిలచి, ఆతని వ్యాపృతుఁ గావించియుంచుము. వాని నొంటరిగ నుండనీయకుము. సమర సమయమందైనను, నీవాతని పార్శ్వమును ద్యజింపకుము.

చం॥ కే—చిత్తము. భవదాజ్ఞానుసార మాచరించెదను.

చాణ—మురఁ గూడి నే నీశైలసానుదేశస్థిత సేతుపార్శ్వనమున మీావిజయవార్తను ప్రతీక్షించుచు నిలువంబడియుందును.

చం॥ కే—చిత్తము.

చాణ—పొమ్ము. (చంద్రకేతు పో నుద్యమింప)—ఇంకొక మాట—

[చంద్రకేతు మరలును]

చాణ—చంద్రగుప్తుఁడు నిదురించుచున్నాడా?

చం॥ కే—చిత్తము.

చాణ—ఒకమాఱు—పోని, లేపకుము! కాని మురను యెందుకు, యీానిశీథసమయమునఁ బ్రయోజనమేమున్నది? నీవె రేపకడనే మేల్కొంచుము. చంద్రగుప్తునిఁ గూడఁ బ్రత్యూషమందే మేల్కొల్పుము. మురజాగ్రత కాని పూర్వమే మీారలిరువురు రణక్షోణికరుగుడు!

చం॥కే—చిత్తము.

చాణ—ఇఁకఁ బొమ్ము.

[చంద్రకేతు నిష్క్రమించును.]

చాణ—ఈతఁ డతియుదారుఁడు. అంతియ కాక—కాదు ప్రేయసీ! ఆకస్మికముగఁ బెదవి దాటివచ్చినది.—నిర్బోధయువకుఁడు! మాయ నెఱుంగఁడు—పరార్థమై సర్వస్వము పణమొనరించి వైచెను. చంద్రగుప్తుఁ డతని కేమగును? పాప మాతఁడు వట్టి మూర్ఖుఁడు!

(నిష్క్రమించును.]

## తృతీయరంగము.

హిరాట్ ప్రాసాదము—ప్రభాతకాలము.

ఏంటిగోనను, బందీ యవస్థయందున్న సెల్యూకను నిలువం బడి యుందురు.

ఏంటి—సెల్యూకసూ! నేఁడు నీవు నాకైదీవైతివి.

సెల్యూకను నతమస్తకుఁడై నీరవుఁడై యుండును.

ఏంటి—సార్వభౌమా! ఇపుడు నీగర్వమంతయు నేమైపోయెను?

సెల్యూ—నా కెన్నఁడు దంభములేదు. సంగరమందు జయము సంభవమగునట్లు పరాజయముకూడ సంభవము! ఆ రెండుగూడ నని వార్యములు. బహుయుద్ధములందు నేను విజయుఁడ నైతిని. నేఁడు నీ కరములందుఁ బరాజితుండనైతిని. మరల బ్రధనమగుచో—

ఏంటి—సెల్యూకసూ! ఇఁకఁ బ్రధనము కానేరదు—ఇదియే శేష దురము!

సెల్యూ—శేషదురమా! యువకుఁడా! నీవు నన్ను వధింపఁ జూచు చుంటివా?

ఏంటి—నిన్ను నేను వధింపను.

సెల్యూ్యా—అట్లైన నేమి చేయఁదలఁచుచుంటివి ?—ఏంటిగోనస్ ! ఇదేమి !! నీ కన్నులు హింసాజ్వాలచేఁ బ్రజ్వలితమ్ము లగుచుండె నేల ? నీ ముఖమంతయుఁ బాంశువర్ణమై పోయెనేల ?—యువకుఁడా ! ఏమట్లీవుదంత ఘర్షణ మొనరించుచుంటివి !! అంతరమందీ వేదియో పైశాచిక సంకల్పముఁ గావించుచున్నట్లు కానంబడుచుంటివి ! పదంపడితత్పైశాచిక సంకల్పము భీషణాకారముఁగాంచి కంపితకాయుండవగు చుంటివి !

ఏంటి—నిన్ను నేను వధింపను !—నేను నిన్ను వధింపను !!

సెల్యూ్యా—ఒక్క నుడువునే పలుమాఱు లుచ్చరించుచుంటివేల ? ఎట్టిచెట్టఁజేయఁ దలఁచుచుంటివి ?

ఏంటి—నేను సభ్యయవన జాత్యుద్భవుండను. మా జాతి యోధులు సమరమునఁ బోరిపోరి, పరస్పరవక్షములందుఁ దమవాడి సురియల గ్రుచ్చుకొందురు ! హింస్రశార్దూలంబుల కరణి నొండొరుల గళంబులను గట్టిగ గఱచిపట్టెదరు. కదనము ముగియగనే విజిగీషులు విద్రావతులను పట్టి వారల నా మరణము చిరాంధకారా గృహములందు బద్ధులఁగావించి యుంతురు కాని వారలు రిపులను సమయింపరు. గ్రీకు ప్రథననుసరించి నిన్ను నే నిపుడు తిమిరావృత బీభత్సజఘన్య కారాగారమున బంధించి యుంతును. కాని, నిన్ను హత్యగావింపను. భయపడకుము !

సెల్యూ్యా—హత్యయే గావింపుచో, యొక్క వ్రేటుననే నన్నుఁ దుదముట్టింపుము, కాని మెల్లమెల్లగ దుత్తునియలుచేసి దుస్సహజ్వాలాకూపమందుఁ బడఁద్రోయకుము !

ఏంటి—యపనుండ నగుటం జేసినే ననాగరకుఁడఁగాను ! నిన్ను నాకరవాలమున కెరఁగావింపను. భయంబుమెయి రవ్యాలోక మెక్క

రణి జఘన్యస్థానముఁ బ్రవేశింపసాహసింపదో, యెప్పగిది భయానక ప్రదేశము తనకఠోరకవాటములచేఁ బవనుఁ బ్రత్యాహతమొనరించి వైచునో, నిన్నమ్మాడ్కి భైరవచిరతిమిరమయరుద్ధకారాగేహమందాజీవనము బంధించి యుంచెదను! హత్యఁగావింపనని నమ్ముము!—

[సెల్యూకసు నీరవుఁడై యుండును]

ఏంటిగోనసు—సెల్యూకసూ! శైశవమందే నేను పితృహీనుండనైతిని. దాక్షిణ్యద్వారమున భిక్షుకుఁగావించి, యీశ్వరుఁడు నన్నీవిశాలవిశ్వమందు విడిచివైచెను. అట్లయ్యు, దారిద్ర్య దుర్భేద్యభిత్తిని బాహుబలంబునఁ బడఁద్రోచి, నిజశౌర్యదక్షతలచే సైన్యాధ్యక్షుఁడగాఁ గలిగితిని—అది నే బిడియపడవలసిన విషయమా?

సెల్యూ—అట్లని నే నెన్నఁడు బల్కియుండలేను.

ఏంటి—నిక్కమే. కాని, పృథ్వి నా కెంతేని యవిచారము సూపెను. నా జనకుఁ డెవఁడో నేఁజెప్పఁ జాలనైతినని జారజుం డనంచు నన్ను ఘృణీకరించి, జగతినన్ను దూరంబుగఁ దరిమివైచెను. నా జనయిత యెవఁడో నే నెఱుఁగను. కాని, నీవలెనే ఆతఁడుకూడ మనుష్యాకారుఁడై యుండెనని తలంచెద. నేను జారజుండనని పలుపర్యాయము లీవుప్రసంగమం దుల్లేఖించితివి. నా జన్మంబుకొఱకై నేను దాయీనికాను. నాకార్యంబులకొఱకే నేను త్తరవాదిని. సెల్యూకసూ! ఎన్నఁడేని నే నెట్టి నీచకృత్యమైన గావించుట నీవు లక్ష్యించితివా?

సెల్యూ—లేదు.

ఏంటి—అట్లైన—[ఏదియో చెప్పఁబోయి, ఆత్మసంవరణ మొనరించుకొని]—యెందులకు!—యిపుడు నీ ప్రశంసయందు మూల్యమేమున్నది? నేఁ బల్కుదానినే అధమకీరంబువలె మరలనందువు—

అదిగో! నీ తనయ యరుదెంచుచున్నది.

[బందీభావమునఁ బ్రహరులితో హెలెన్ ప్రవేశించును]

హెలెన్—హా! జనకా!! జనకా!!!

[సెల్యూకసువక్షమున నిజానన మిడి విలపించును]

సెల్యూ—అమ్మా! ముద్దుపట్టీ!!—

(గళరుద్ధుండై ఆతఁడు దుహితను కౌగిలించుకొని కన్నీరు విడచును)

ఏంటి—సెల్యూకసూ! మీరు నలుపవలయు|సాదరసంభాషణ మే మైననున్నచో, దానిని సత్వరమే ముగింపుడు. వేచియుండును. నేనంతనిష్ఠురుండఁగాను—యిదియే మీకడసారిచూపు.

హెలెన్—కడసారిచూపా!

ఏంటి—అవును. రాజకన్యా! నీజనకునకుఁ గఠినశిక్ష విధించితిని. ఆ జన్మాంత మాతఁడు చిరాంధకారమున బంధితుఁడై యుండును.

హెలెన్—విచారకర్తయాజ్ఞకదా!

ఏంటి—నీవు చెప్పుకొనవలసిన దేమైననున్నదా?

హెలెన్—నేఁ జెప్పుకొనవలసినదా!—ఏమియులేదు. వీరుని యెడ వీరుఁడు చూపవలయు యాచరణ వీరవిచార్యము! విజితునెడ విజయుండు జూపవలయుకర్జము విజయుని యభిరుచి. ఏమనుట కైన నే నెవతెను? అనధికారచర్చఁ గావించుదానఁగాను!

ఏంటి—నీవు చెప్పున దిదియా?—సెల్యూకసూ! నీ దుహిత పితృభక్తురాలుగ గానిపించుచున్నది!!

హెలెన్—ఏంటిగోనసూ! నీ రాజకీయవిషయ సంబంధమున నీవు ప్రసంగింపుము.

ఏంటి—ఇంకను నీ గర్వ మడఁగలేదా?

హెలెన్—కాపురుషా! నీవు సన్నిత్తావున కేల రావించితివో యెఱుంగుదును. అందరానిపండ్ల కేల చేయి జాచుచుంటివి? నీవు

వ్యర్థమనోరథుండవు కాఁగలుగుట నిక్కము. నీ యన్యప్రయత్నంబు జన్యంబు! అందీవు విజయుండ వైతివి. ఒక మహాసామ్రాజ్యమున కధిపతి వైతివి. బలంబునఁ బడసిన నీరాజ్యమం దీవు నీ యిచ్చవచ్చిన తెఱంగున విచ్చలవిడిగఁ గ్రుమ్మరి యెట్టి చెయ్దమైన గావింపవచ్చును. కాని తత్సామ్రాజ్యసీమ నతిక్రమించి యరుదెంచుటకు నీ కెట్టిహక్కు లేదు—ఓయీ! నాకుఁగూడ నొక రాజ్య మున్నదని యెఱుంగుము. ఆరాజ్యమునకు నేను యధీశ్వరిని. అందీవు ప్రవేశించుట కధికారము లేదు—(సెల్యూకసు నుద్దేశించి)—జనకా! పోవలయునెడ కరుగుఁడు. తాము వీరులు. ఇది వీరు నెడ వీరుఁడు చూపవలసిన యోగ్యాచరణమే యగుచో, ద్విధఁ గావింపక అంధకారబంధురగభీర భయావహకూపమం దే వసింపఁ బొండు. నేఁగూడఁ బోవుచుంటిని. ఈ విచ్ఛేదానంతరమున నిహాజగతియందు మరల మనము కలసికొనఁజాలము. ఈతఁడు వ్రాకుచ్చిన ట్లిదియే మన కడసారి చూడ్కు!—ఇఁక నాకు సెల వొసంగుఁడు—పితా! అ దేమట్లు నతశీర్షులై యుంటిరేల?

సెల్యూ—అమ్మా! అట్లే!—కాదు!!—మంచి దట్లే కానిమ్ము.

హెలెన్—ఈ విచ్ఛేదనమున మన యుభయుల దుఃఖము సమానము. మీ కన్నులఁ జీకట్లెట్లు క్రమ్మి యుండునో నా కన్నులుకూడ నట్లే తమఃపటలావృతములై యుండును. జనకా! తమ యిక్కట్టులఁ దాము పురుషునిగూడ్కి సహింపుఁడు! నారివడువున నా యరిష్టముల నేను సహింతును. ఇఁక వెఱపేల? ఈ కట్టిడి మనపై గండ్లెత్తిజేయునా!!!

ఏంటి—లలనా! నాపై నీ కింత కినుక యేల; నాయెడల నీవేలవిముఖ వగుచుంటివో నేనెఱుంగకున్నాను. కాంతా! ఇఁకనైన, దురంత

చింతచే బొగులక నన్నుఁ బరిణయమాడుట కియ్యకొనుము. నే నజస్రము నీ జనకునకుఁ గ్రీతదాసుఁడనై మెలంగెద. మరల నాతని నీ సింహాసనమున నాసీనుఁ గావించెద. కనకాంగీ! ఇఁకనైన బ్రసన్నురాలవు కమ్మా. ఈ సింహాసనము నిప్పుడ దృజించుమనై చు చుంటిని.

హెలెన్——(సవ్యంగహాసము మొనరించి)——మూర్ఖా! ప్రలోభనముఁ జూపి, నారీహృదయము జయ మొనరింపఁ జూచుచుంటివా?—— నారీధర్మము ప్రభాతప్రభాకరునికంటెఁ గూడ భాస్వరమైనది. మృత్యువుకంటెఁగూడఁ బ్రబలమైనది!! మాతృప్రణయముకంటె గూడఁ బవిత్రమైనది!!! అట్టి నారీధర్మమును ధూళిముష్టిచేఁ గ్రయ మొనరింప వాంఛించుచుంటివా? ఏమి నీ పేరాస! నీ దుస్సాహసము నాకు మిక్కిలి విస్మయము గొలుపుచున్నది. దుర్మతీ! నిన్ను ఘృణీకరింపఁగలను కాని ప్రేమింపఁజాలను.

ఏంటి——మంచిది!——సెల్యూకసూ! నాయం దిఁక నెట్టిలోపము లేదు. నాపై నిఁక నెపము వేయఁజాలవు! (భృత్యుల నుద్దేశించి) అరే! వీరల నిప్పుడే చేరి రొక యంధకూపమున నిక్షేపించి రండు—— పొండు!

(భృత్యు లిరువురు సెల్యూకసు హెలెనులఁ బట్టుకొందురు.

హెలెన్——జనకా! నా కిఁక సెల వొసంగుఁడు.

సెల్యూ——అమ్మా!——

(అవనతమస్తకుఁడై నిమీలితనేత్రుఁడగును.

హెలెన్——ఏమి! జనకా!! భవన్నేత్రయుగ్మమునుండి బాష్పతోయము వినిర్గతమగుచుండె నేల? వీరాగ్రేసరులయ్యు దుఃఖభారమునఁ గ్రుంగిపోవుచుంటి రేల? తా మిట్లు విలపింప నాకుమాత్రము సహన మెట్లుండును? జరాపీడితుఁ డవమానితుఁ డగుటయు,

రుగ్ణుఁడు పరిత్యక్తుఁ డగుటయు, మృత దేహము పదాహత మగుటయుఁ బ్రభృతి దుస్సహదృశ్యములను విలోకింపఁగలను, కాని, భవదక్షియుగ మశ్రుబిందువుల నిండియుంట నే వీక్షింపఁజాలను. అట్లైన నిఁక నీతఁడు కోరునట్లే కానిండు. మీ యాజ్ఞకై నేఁజేయఁజాలని దెద్దియు లేదు. స్వచ్ఛందమున నాత్మ బలిదాన మొసంగెదను. కాని,—అయ్యో!—జనకా! ఏమి చేసివైచితిరి! మీ చక్షు లవిరళోద్గళద్బాష్పపూరితంబు లాయెనేల? బిడియముచే నే నౌదల నెత్తఁజాలకుంటిని. అవమానజ్వాలచే నాయంగప్రత్యంగము లన్నియు జ్వలించుకొనిపోవుచున్నవి! ఆహా!—ఎట్టిగతి!!—ఓ!—హా!—భగవాన్!—పోనిండు!—(ఏంటిగోనసు నుద్దేశించి ఓయీ! నిన్ను నేను పరిణయ మాడెదను! ఆమరణము నీకు నేను విక్రీతదాసినై యుందును! (నతజానువయి)—కృపాళుండవై అస్మజ్జనకుని ముక్తుఁ గావింపుము.

సెల్యూ—అమ్మా!వలదు!వలదు!—నేనందులకంగీకరింపను. అకార్యమునకియ్యకొనుటకంటెనరకకూపమందులంఘింపసంసిద్ధుఁడనయ్యెదను!—నిన్ను విక్రయించి ముక్తుఁడ కాఁగోరను., నేను యవనుండను!—ఇది క్షణిక దౌర్బల్యము మాత్రమే—భృత్యులారా! నన్నిఁక కారాగృహమునకుఁ దోడ్కొనిపొండు! చిరాంధకూపమునఁ బడఁద్రోయుఁడు! మీయిచ్ఛవచ్చిన తెఱంగున హింసింపుఁడు!—అమ్మా! నాకిఁక సెలవిమ్ము. (బాహువేష్టన మొనరించి) ముద్దుపట్టీ! కన్నతల్లీ!—(గళరుద్ధుండగును.)

భృత్యులు వారల నిర్వురను విడిపించివైతురు. భటులచే సెల్యూకసు హెలెనులు కొంతదూరము కొనిపోఁబడినతోడనే యేంటిగోనసు చయ్యన సింహాసనమునుండి లంఘించి ముందునకరిగి—"నిలువుఁడు! నిలువుఁడు!!" అనును. (భృత్యులు కైదీలిరువురతో

నిలువంబడిపోదురు.)

ఏంటి—(ముకుళితకరకమలుండై, సెల్యూకసును సంబోధించి) సార్వభౌమా! నీవిఁక ముక్తుడవు; జారజుండనయ్యు, నేను యవనజాత్యుద్భవుండను! మహత్వమన నేమియో గుఱుతింపఁగలను! ఈరంగము సౌందర్యోపేతమైనదే కాదు—యిందు స్వర్గీయగరిమ కూడ గలదు! మహనీయుండగు ఫిడియస్ యింతకంటె సుందరతరదృశ్యము నెన్నఁడు గల్పనఁ గావింపఁజాలకపోయెను! నేను కఠోరుఁడనయ్యు, కుమతినయ్యు, క్రూరుఁడనయ్యు, యీయపూర్వమహిమమయదృశ్యముఁ గాంచినంతనే నాచక్షుయుగ్మమునుండి కూడ బాష్పశైవలిని స్రవించుచుండెను.—(హెలెను నుద్దేశించి) మత్తకాశినీ! నిన్నుఁ బడయుటకు నేను యోగ్యుండఁగాను!—నీకు నేను తగువాఁడనుకాను! కామాంధమగ్నుండనై నీయెడ మిక్కిలి యత్యాచారముఁ జూపితిని! మన్నింపుము—(సెల్యూకసునుసంబోధించి) సార్వభౌమా! నీసింహాసనము నీవుకై కొమ్ము!

(నిష్క్రమించును)

## చతుర్థరంగము

### యుద్ధాంగణము—సంధ్యాకాలము.

నారీశిబిరసమ్ముఖమున నెచ్చెలులతో ఛాయ నిలువంబడియుండును.

ఛాయ—ఈపవరఫలాఫలముల నెఱుఁగుటకు నేను మిగుల నాతురపడుచుంటిని. దూరమునుండి కేవలము గదనకోలాహలమే శ్రుతమగుచున్నను, యుద్ధపిపాసచే నాగుండ్లియ లవియుచున్నవి.

1 వ. సంగిణి—రాజకుమారీ! నీకింత రణతృష్ణయేల?

ఛాయ—నేను తనకుఁ దగినదానఁ గానని ఆతనికిఁ జూపఁగోరెద.

1 వ. సంగిణి—ఆతనికన, నెవనికి?

ఛాయ—ఎవనికా?—చంద్రగుప్తునకు.

3 వ. సంగి—ఇంక నేమి?—బాగుగనే వేసితివి!

ఛాయ—ఏమి?

3 వ. సం—కన్ను!!!

2 వ. సం—(నవ్వి తన స్నేహితురాల నుద్దేశించి) చంద్రగుప్తునిపై ఛాయాదేవికి మిక్కిలి మక్కువజనించెనుసుమా?

2 వ. సంగి—అక్కా! నీవు నిక్కము వక్కాణించితివి!

ఛాయ—మక్కువజనించెనో లేదో యెఱుంగను. కాని జాగ్రత నిద్రావస్థలందుఁగూడ నాతఁడే నాధ్యానంబైయుండును! వాణీ! నిన్న రేయి నే నెట్టిస్వప్నముఁ గాంచితినో యెఱుంగుదువా?

2 వ. సంగి—ఎఱుఁగను. అదేమో చెప్పుము.

ఛాయ—నేఁ గలలోఁ గ్రమక్రమముగ నంబరవీధి కెగసిపోతిని; పదతలమందుఁ గేవలము వియత్తలము, చంద్రగుప్తుఁడు తక్క నిఁకేమియుఁ గానఁబడలేదు. ఇంకను యూర్ధ్వంబునకుఁ బోయిన కొలఁది పృథ్వి క్రమక్రమంబుగఁ జిన్నదియై పదంపడి దృగ్బహిర్భూతమై పోయెను. కాని, చంద్రగుప్తుఁడు జగద్బాంధవుని మాడ్కి ప్రకాశింపసాగెను!

2 వ. సంగి—అవును! నేఁ జెప్పియుండలేనా? కనకాంగీ! బాగుగనే కన్నువైచితివి! కాని, నీవు మంచముపట్టెదవుసుమీ!

ఛాయ—ఏల?

2 వ. సంగి—ఈరుగ్ణతకతన.

ఛాయ—ఏరుగ్ణత?

2 వ. సంగి—ప్రేమరుగ్ణత.

ఛాయ—ప్రేమరుగ్ణతయా?

2వ. సంగి—దుర్గతలోను, సామాన్యదుర్గతకాదు!

ఛాయ—అది దుర్గతయే యగుచో దానివలననే నేను మరణింతుం గాక! అంతకంటె సుఖమృత్యువు నేఁ గోరను.

(చంద్రకేతు ప్రవేశించును)

ఛాయ—అన్నా! ఆహవవార్తలేమి?

చం॥ కే—నాయశ్వము హతమైపోయెను. అన్యసైంధవమున్నకై యరుదెంచితిని. (పోఁబోవును)

ఛాయ—ఆలమండలి విశేషములేమి?

చం॥ కే—మాకుఁ బరాజయము వాటిల్లెను.

ఛాయ—పరాజయమా!—చంద్రగుప్తుఁ డెచట?

చం॥ కే—అతఁ డిపుడు కడు విపన్నావస్థయం దుండెను. వానికిఁ దోడు దోడుపడఁబోవుచుంటిని.

ఛాయ—ఉండుము. నేఁగూడ వచ్చెదను. నా కొఱకుకూడ నొక హయము సిద్ధము చేయింపుము.

చం॥ కే—మంచిది.

[నిష్క్రమించును.]

ఛాయ—[చెలికత్తెల నుద్దేశించి] చెలియలారా! మీరిఁకపోయి, శిబిరమును కనిపెట్టుకొని యుండుడు.]

[చెలికత్తెలు నిష్క్రమింతురు.]

ఛాయ—భగవాన్! నాకిపుడు మంచితరుణము లభించినది కాన, కృతకార్యఁగాఁ గలుఁగునట్లు వరముఁ బ్రసాదింపుము. నిన్ను నేఁ గోరు వరం బిదియే! ఆతం డిత్తఱి విపన్నుఁడై యుండెను! ఇయ్యవసరమున నే నాతనికిఁ బ్రాణరక్షణ మొనరింపఁ గలుఁగుదుఁగాక! అతనిఁ గాఁపాడఁ జనుతఱి, నేఁ బ్రాణములను వీడవలయుచో, స్మితముఖనై మిత్తి నాహ్వానించెదను. అందులకు వినిమయంబుగ

ముహూర్తమాత్రకాల మిత్రుఁడు నన్నుఁ బ్రేమించి, మందహాస భాసమానముఖమండలుండై నన్ను పలకరించుచో, నామృత్యువు సార్థకమైనదని తలంచెద!

[రెండశ్వములఁ దీసికొని చంద్రకేతు ప్రవేశించును]

చం॥ కే—ఛాయా! తురగములు సిద్ధములై యున్నవి.

ఛాయ—అట్లైన నిఁకఁ గదలిపోదము రమ్ము—[నతజానువయై]—మహేశ్వరీ! ఏశక్తిబలంబున నీవు మహిషాసుర ప్రభృతిదానవుల యుక్కడించితివో, ఆశక్తియం దొక కణమును నాకుఁ బ్రసాదింపుము!—అన్నా! నడువుము.

[అశ్వారూఢులై యిరువురు నిష్క్రమింతురు.]

## పంచమరంగము

సేతు పార్శ్వారణ్యము—సంధ్యాకాలము
చాణక్యుఁ డేకాకియై యుండును.

చాణక్య—క్షుధితలేలిహానభషకంబులను భండనభూమిపై విడచి వైచితిని. ఇపు డవి ప్రవాహితభైరవరుధిరధారను స్వచ్ఛందముగఁ బాన మొనరించుగాక! ఈ నిబిడారణ్యమున భల్లూకభయానకములు లేనిలోటును నేఁ డివియే తీర్చివైచుచున్నవి. ఉన్న భేదమేమన శార్దూలభల్లూకము లుదరపోషణార్థ మనన్యోపాయములై మనుష్యశోణితమును శోషణ మొనరించును— మనుష్యులన్నచో లోభాంధహింసాప్రేరితులై యొండొరుల కుత్తుకలను గోసుకొనుచుందురు! ఆహా! సృష్టి యెంత చిత్రమైనది! అదుగో! ఆదిత్యుఁ డస్తాచలముఁ జేరుచుండెను! రేపు మరల నీసూర్యుఁడే యుదయించును! ఉదయింపనిమ్ము. ముం దొకప్పు డాతఁడు

బా_త్రిగ దృగ్గోచరుండు కాకుండు దినములు వచ్చును. ఉదయ భూధరము వాతఁ డధిష్టింపనే యధిష్టింపడు! వాని జ్యోతి క్రమ క్రమంబుగ శీర్ణమై, మలినమై, ధూసరమైపోవును! ఆతని పాంశు ర_క్త వర్ణధూమము పృథ్వీకాంత పాండురముఖంబుపై సోకును. కతిపయ కాలానంతరమం దదికూడ నట్లు సోక విరమించును. కృష్ణ సూర్యుఁ డనంత శూన్యమం దదృశ్యుండై పోవును! ఆహా! ఆదృశ్య మెంత గరిమామయమై యుండును.!—ఎవరు?

[కాత్యాయనుఁడు ప్రవేశించును]

చాణక్య—కాత్యాయనా! వా_ర్తలేమి?

కాత్యా—ఆహవమందు మేము పరాజితుల మైతిమి.

చాణక్య—ఏమి! పరాజితులరైతిరా? ఏల? ఎట్లు?

కాత్యా—ప్రథమమున చంద్రగుప్తుఁడు పరాజితుఁ డాయెను.—ఎకి మీఁదు విద్రావితుఁడగుట వీక్షించి మన సైనికులు చెల్లాచెదరై పాఱిరి.

చాణా—చంద్రగుప్తుఁడు పలాయితుఁ డాయెనా?—ఎచట?

కాత్యా—ఆతఁడు పూర్వదిక్కుగఁ బాఱెను.

చాణా—'ఏదిక్కుగఁ బాఱె?' నని యడుగుచుంట లేదు—ఇపు డాతఁ డెందున్నాడు?

కాత్యా—ఎఱుఁగను.

చాణా—వెఱచినట్లే యాయెను—చంద్రకే తెక్కడ?

కాత్యా—ఎఱుఁగను. కాని, ఆతఁ డశ్వమునుండి జారి క్రిందఁబడుటఁ గాంచితిని.

చాణా—మూర్ఖా! నీ వింతదనుక నేమిచేయుచుంటివి?

కాత్యా—నే నా శైలశిఖరమున నిలువంబడి, సంగ్రామగతి నిరీక్షించుచుంటిని.

చాణక్య—జయము నిశ్చితమై యుండ, నిలువున నిలువంబడి చోద్యము నిరీక్షించుచుంటివా!—హా! ఏమి చెడుగు. పుట్టునోకదా!

కాత్యా—అడుగో! చంద్రగుప్తుఁడిట్లే వచ్చుచున్నాఁడు.

చాణక్య—[ఆతురమున]— ఏడీ?—[కరతాళధ్వనిఁ గావించి] —అడుగో! ఇపుడుకూడ ఆశయున్నది. కాత్యాయనా! నీవుపోయి, సైనికుల నాశ్వాసింపుము. "చంద్రగుప్తుఁ డరుదెంచుచున్నాఁడు! పలాయితుఁడు కాలేదు. వెన్నియకొపోరుఁ" డని వారలను హెచ్చరింపుము. పొమ్ము! శీఘ్రముగఁ బొమ్ము!! జాగు సేయకుము!

[కాత్యాయనుఁడు నిష్క్రమించును.]

చాణ—చింత లేదు!—'కంటకే నైవ కంటకమ్!'—మురా! మురా!!

[ముర ప్రవేశించును.]

ముర—గురుదేవా! ఆజ్ఞయేమి?

చాణ—ఇందు నిలువంబడుము (నిలువం బడ జేసి)—వృద్ధనారీ! బాగుగ నేడ్వఁగలవా?

ముర—స్వామీ! అట్లడుగు చుంటిరేల?

చాణ—అడుగో! చంద్రగుప్తుఁడు వచ్చుచున్నాడు. నీ విపుడు వెక్కి వెక్కి యేడ్వవలయును!

ముర—తనయా! నా కన్న తండ్రీ!! [ముందునకుఁ బోవును.]

చాణ—ఖబర్దార్! ఇపుడు ప్రేమ పనికిరాదు—పుత్రునెడ మాత చూపఁదగు కినుకనంతయుఁ జూపవలెను! అభిమాన మానినివలె నటింపవలెను—సిద్ధముగ నుండుము! జాగ్రత్త!!

[ముక్తతరవారి కేలఁబూని నతమస్తకుఁడై చంద్రగుప్తుఁడు ప్రవేశించును.]

చాణక్య—రాజపుత్రా! రమ్ము!!—మురా! నీ తనూభవుఁడు జయ

ప్రదుఁడై యరుదెంచెను. ఆతురతమున నీ వాతని భవద్వక్షమునఁ జేరఁ దీసుకొమ్ము. వీరుండగు నందనుఁగాంచి ఆనందమున నుప్పొంగుము.

చం॥గు___[శతముఖుఁడై యుండి]___గురుదేవా! నేను విజయుఁడనై రాలేను.

చాణ___[అబ్బురము నటించుచు] ఏమి! జయప్రదుఁడవై రాలేదా! అట్లైన నేమైవచ్చితివి?

చం॥గు___యుద్ధాంగణమునుండి పలాయితుఁడనై వచ్చితిని.

చాణ___అసంభవ మసంభవము! ముఠానందనుం డాలంబున జయోపేతుండైన నగును లేక ప్రాణములనైన నర్పించును కాని పలాయన మొనరింపఁడు!

ముర___పాఱివచ్చితివా?___చంద్రగుప్తా! 'పాఱివచ్చితి' నని స్థిరచిత్తుండవై పల్కుచుంటివా? పిరికివాఁడా! చావలేకపోతివా?

చాణ___ఇది క్షణిక దౌర్బల్యము మాత్రమే!___చంద్రగుప్తా! పోయి పోరుసలుపుము.

చం॥గు___చేతులు రావు. [తరవారిని గురుపదతలమున నుంచును.]

చాణ___ఎందులకుఁ జేతులు రావు?

చం॥గు___సోదరుని కాయమున నస్త్రాఘాత మొనరించుటకు.

ముర___ఆతఁడు కట్టిడి! కాపురుషుఁడు!!

చం॥గు___కాపురుషుఁడు కాఁడు___సోదరుఁడు!

చాణ___రాజ్యమునుండి నిన్నుఁ దరుమఁగొట్టిన తమ్ముఁడు!

చం॥గు___అట్లయ్యు ఆతఁడు తమ్ముఁడేగదా!

ముర___నీతల్లి నవమానించిన సోదరుఁడు___ఏమి! యూరకుని యుంటివేల?

చాణ___దౌరాత్మ్యమునకు నామాంతర మాత్రంబైన రాజత్వముఁ

జేయు తమ్ముఁడు!

చం॥గు—గురుదేవా! భ్రాతృద్వంద్వమునకుఁ బురిగొల్పెదరా?— గురుని యాజ్ఞ యిదియా?

చాణ—అవును—కుమారా! నిన్ను ధర్మయుద్ధమునకుఁ బురిగొల్పు చుంటిని. కురుక్షేత్రమున శ్రీకృష్ణభగవానుఁ డాఖండలసూనుతో నేమి వచించెనో యెఱుంగవా?

చం॥గు—గురువరా! మన్నింపుఁడు. వెన్నముచ్చు యుక్తి నాహృదయమును స్పృశింపదు!

చాణ—[నేలపై గట్టిగఁ దన్ని]—ఈకలుషంబుకతననే ఆర్యావర్త మంతమొందెను. చంద్రగుప్తా! గీతామహాత్మ్యమము నీ వేమి గ్రహింపఁగలవు?—శాస్త్రచర్చ అవనీసురుల యధికారము.

చం॥గు—అవనీసురుల యధికారము నవనీసురులనే యనుభవింపనిండు. నాకు సెల వొసంగుఁడు.

చాణ—చంద్రగుప్తా! నీ యీ దౌర్బల్యమునేఁ గదాచితముగ లక్ష్యించితిని. అన్య సమయములం దీ దౌర్బల్యమరిష్టదాయకము కానేరదు. శుష్క నైరాశ్యమునఁ జిత్తము చిక్కువడిన ఫ్రడలసుఁడవై కాలయాపన మొనరింపుము; ఉష్ణాశ్రుతోయంబులచే నైశయుపాధానము నభిషిక్త మొనరింపుము— యెట్టిచేటు వాటిల్లదు! కొన్ని సమయములందుఁ గ్రందనముకూడ విలాసంబై యుండును. కాని, కర్మక్షేత్రమందు నిలచినతఱి యీ దౌర్బల్యము సాంఘాతిక మగును! భూమి కంపము భంగి, వెడలి, అది నిమేషములో బహుళతాబ్దముల రచనను నేలపాలుసేయును. చంద్రగుప్తా! ఒక్క ముహూర్తములో నిండుజీవనమున సల్పిన సాధనమును నిష్ఫలము కావింపకుము. జీర్ణవసనసన్నిభంబగు యీ యలసతనమును నీ హృదయమునుండి తొలగించుము. ఆహవమునకు సంసిద్ధుఁడవు

కమ్మా.

చం॥గు—దేవ దేవా! క్షమింపుడు.

ముర—కుమతీ! నిక్కంబుగ నీవు నాకడుపునఁ బుట్టితివా? ఏనందుఁడు—

చం॥గు—అమ్మా! ఆతని క్షమింపుము.

ముర—క్షమయా! రాత్రింబవళ్ళు నాసర్వాంగములను వేధించు శత వృశ్చికదంశనజ్వాలలను శీతలమొనరింపఁగలుగున దొక నందుని రక్తమే!

చం॥గు—అమ్మా! బాల్యమం దాతనితో నే నెన్నోయాటల నాడితిని. తమ్ముఁగూడి పేర్వేరు బొమ్మలపెండిలిలు గావించి, యెందుకైన నాతఁ డలిగిన, పలు తెఱఁగుల యాటవస్తువులఁ గొని వాని కిచ్చువాఁడను. తోడిస్నేహితురాం డ్రొసంగు గుజ్జనగూడుఁ దిని యింకను తెండని ఆతఁడు విలపించినపుడు నీకడనుండి మిఠాయి గొనివచ్చి నాభాగమందలి సగముపాలునుకూడ వాని భాగమునకుఁ గలిపి దాని నెంతయో గారాబమున వానికిఁ దినిపించువాఁడను. జనకుఁడు గద్దించినపు డాతనికనుల బాష్పములు క్రిమ్మ, సాదరముగ వాని కనులు తుడిచి, చెక్కిలి ముద్దిడి, మంచిమాటలచే మఱపించువాఁడను. ఒకనాఁ డొకగుఱ్ఱము పగ్గముఁ ద్రెంచుకొని పథమందలి తమ్ముని మీఁదికి రాగా, చివాలున ముందునకురికి, వాని నొడియందిడుకొని, ఘోటకపదాఘాతమును నామూపున వహించితిని. నేఁడు రణక్షేత్రరంగమునందు నందుని వదనమును గాంచినంతనే పసితనమునాఁటి విషయము లన్నియు నొక్కమాఱు జ్ఞప్తికివచ్చెను. ఆతని శీర్షంబుపై ఖడ్గ మెత్తినతఱి హృత్పిండమునఁ బైకుబికి హృత్పంజరద్వారమున సబలంబునఁ దట్టి, "చంద్రగుప్తా! జాగ్రత! ఆతఁడు నీతమ్ముఁడు! మగధసామ్రాజ్యమునుకంటె నుత్కృష్టమైనదా" యని యుచ్చై

స్వనమునఁ బల్కినట్టులయ్యెను.

ముర — నందుఁడు నీకుఁ దమ్ముఁడే కావచ్చును. కాని, నా కాతఁ డేమగును?

చం॥గు — పుత్రుఁడగును. మాతా! నీకు జన్మింపకున్నంతమాత్రంబున నాతఁడు నీకుఁ బుత్రుఁడుకాఁడా? నందుని జనయిత్రి సౌమనస్యమంద దివిఁజేరగనే వానికి మాతృస్వరూపిణివై, యుగ్గుపాలు వోసి, వానిఁ బెంచి పెద్దఁజేయలేదా? నీవలె వానికిఁగూడ నీవు స్తన్యపాన మొసంగలేదా? — చంద్రునిఁజూపి యాడింపలేదా? అడిగినదానిఁ దెచ్చి యీయలేదా? భుజంబున నిడుకొని నిదురఁ బుచ్చలేదా? అమ్మా! ఇపు డట్టిముద్దుపట్టి నీకేమియుఁ గాఁడా? వాని నింతలోనే మఱచితివా?

ముర — అట్లు పెంచితిని కావుననే వాని నిపుడు మన్నింపనేరకున్నాను. నిజసుఖముఁ దుచ్ఛ మొనరించి, మిక్కిలి గారాబమునఁ బెద్దయగు దనుక వానిఁ బెంచి చేసిన చేతనంతయు నందుఁడు మఱువకలఁడు కాని, నే మఱువఁజాలనా? అధముఁడగు వాచాలుఁడు నా శిఖబట్టి పదుగుర మోఁదిల యీడ్వగడంగిన తఱి తానుకూడ పక్కన నవ్వి, ‘శూద్ర వనితవు! నాకుఁ దల్లి వెట్లగుదు’ వని నన్నుఁ బరిహాసింప — హా! పుత్రా! ఏమి చెప్పుదు!! — పరిభవదావానల కీలల దగ్ధంబై నీ జనని సల్పు రోదన మరణ్యరోదనమా? తొమ్మిది నెలలు గర్భ గహ్వరమున మోసి, నీకు జన్మ మొసఁగిన మాత యవమానము నీ కంత యలక్ష్యనీయమైనదా? తమ్ముఁడే కాని, జనని నీ కేమియుఁ గాదా?

చాణ — ఏక మాతృగర్భమున జనించిన కతననే కదా అన్నదమ్ములకు సంబంధ మలవడుట. ఎవరు క్త మూలంబున, దత్సంబం

ధము సంభవమాయెనో, అది, ఆమెకు నీకుఁగల పవిత్ర సంబంధముకంటె నధికమైనదా? మాతకంటె భ్రాతయెక్కుడా? మాతకు జూపఁబడిన ఘోరతరపరాభవమునకుఁ బుత్రుఁడు ప్రతీకారము సల్పకుండుటకు బృథ్వి యందిదియే ప్రథమ దృష్టాంతరము!—(మురనుద్దేశించి)—అభాగినీ! ఆ మరణము నీవంగలార్పవలసినదే! బ్రతికినంత కాలము గోలు గోలున నేడ్చుచుండుము. నీ కన్న కొడుకే నిన్నుఁ బాటింపలేదు! తల్లినే యాతఁడు గుఱుతింపలేదు!

మాతృదేవి యెట్టిదియో ఆతఁడెఱుంగఁ జాలకపోయెను! జగమునఁగల పవిత్ర వస్తులన్నియు జనని మ్రోల నేమియుఁ గావని యాతఁ డెఱుంగడు!

చం॥గు—గురుదేవా! అట్లని యెఱుంగుదును.

చాణ—ఎఱుంగవా? ఎఱుంగకున్న మాతృ పరిభవ ప్రతీకారము సలుపఁ బుత్రుండు సంశోచించునా? సృష్టి యొకప్పుడు విష్ణు యోగ నిద్రయందభిభూతమై యుండి పదంపడి యెట్లు పృథక మాయెనో, అనలమునుండి స్ఫులింగమును, సంగీతమునుండి మూర్ఛనమును, యెట్లు విడివడియెనో అట్లే యే సీమంతినీ చూడామణి నీతో నొకప్పుడొకే యంగ, మొకే ప్రాణ, మొకే మన, మొకే నిశ్వాస, మొకే యాత్మమై యుండి యిపుడు వేఱాయెనో; యే యణువుమధ్య నీ యధరమునకు హాసనమును, రసనమునకు భాషను, లలాటమునకు నాశీషచుంబనము నొసఁగి నిన్నుఁ బృథ్వీ యాత్రకుఁ బుత్తెంచెనో; రోగమందును, శోకమందును, దైన్యమందును, కష్టసమయమందును యే ప్రణయిని నీదుఃఖభారమును నిజవక్షమున సహించి నీమ్లానముఖమాహ్లాదమయూఖోజ్జ్వలమై యుంటఁగాంచఁ దన యసువులనైన నొసంగ నువ్వి

ళులూరుచుండెడిదో; యే పల్లవాంఘ్రి స్వచ్ఛ ప్రేమ మందాకిని శుష్క తప్తమరుభూమియగు యే తద్విశ్వ మండలమున నుచ్ఛ్వసిత వన్య ప్రవృక్ష శతశాఖా సమన్వితమై ప్లావితమాయెనో; యే కుందరదన యపారనిర్వాచ్య శుభ్రకరుణ మానవ జీవనమునఁ బ్రభాత భాస్వరుని భంగి అరుణ కిరణ వితరణ మొనరించెనో; యే కాంతామ తల్లి యీయవని కార్పణ్యము కావింపలేదో; యే మానినీ తిలక మెన్నఁడు విచారము సలుపలేదో; యే పల్లవోష్ఠి జీవన మందొక ప్పుడైనఁ బ్రీతిదానము నభిలషింపలేదో; యే వారణయాన యున్మత్తోదారకంపిత యాగ్రహంబున నిరు కరములఁ బ్రసారిత మొనరించి నీకుఁ దన్నుఁదాఁ బూర్ణముగ సమర్పించి వైచుకొనెనో ఆమెయే భవజ్జనయిత్రియగు యీ విదుషి!

చం॥గు—గురు దేవా! రక్షింపుఁడు. భ్రాతృవధకు నన్ను త్తేజితుఁ గావింపకుఁడు!

ముర—చంద్రగుప్తా! నేను నీకేమియుఁ గానని యింతకాలమున కెఱుఁగఁగలిగితిని. నందుఁడు క్షత్రియుఁడు. నీవు క్షత్రియకుమారుఁడవు. నందుఁడు నీతమ్ముఁడు. అతఁడే నీకుఁ గావలసినవాఁడు!— నేను శూద్రాణిని. నేను నిన్ను నాగర్భమందు ధారణ మొనరించి నంతియే! నే నెవర్తుకను? నీకు మాతను గాను!

చం॥గు—అమ్మా! పుత్రు నెడల నీవింత నిష్ఠురవగుట పాడియా? నీవు నామాతవు కావా?—నీవు నాకొక్క మాతవే కావు—నీవు నా ధర్మమవు; నా సాధనమవు; నా తపమవు; నాయీశ్వరివి; నీ యాజ్ఞ నాకు దైవవాణి!

ముర—అట్లయని నీవు తలఁచుచో యిపుడే సమీకమునకు సంసిద్ధుఁడవు కమ్ము—ఏమి! ఇంకను నీరవుఁడవై నిలచియుంటివేల?—

చంద్రగుప్తా! [భగ్నస్వరమున] నేను నీ మాతను! నీ యవమానిత ప్రపీడితపదాహతమాతను. నా యాజ్ఞ యేమో తెలిపివైచితిని! ఇంక నీయభిరుచి యెట్లో యట్లాచరింపుము.

చం॥గు—అమ్మా! నీ యభిరుచియే నా యభిరుచి! నీ యిచ్ఛయే నా యిచ్ఛ! ఇంక నేజాల మొనరింపను. ఇంకెట్టి చింతయు సలుపను. భవదాజ్ఞయే యీ ప్రశ్నసంకులకుటిల జగతియందు నాకు మార్గమ్ముంజూపి ముందునకుం గొనిపోవుగాక! నిన్నే నాజీవన ధృవతారం గావించి పార్శ్వమునకు భ్రుక్షేపము గావింపక సంసార సముద్రమందు తరణిని నడపుకొని పోదును—మాతా! నన్నాశీర్వదింపుము. ఈముహూర్తమందే నేను కదనమునకుం గదలిపోదును!

మురా—నాయనా! నిక్కముగ నీవు నానందనుండవు! ఈ నుడువులు నాతనూభవునకుం దగినవి!

చాణ—వత్సా! ఇపుడు చాణక్యుని శిష్యుండవని యనిపించుకొంటివి. ఈక్షణిక యవసాదమును నీప్రాణమునుండి దులిపి పాఱవేయుము. ఒక్క మాఱుసబలమున—

దూర నేపథ్యమున—ఈదిక్కున! ఈదిక్కున!!

చాణ—అల్లదె వార లరుదెంచుచుండిరి!—ఇయ్యెడకే వచ్చుచుండిరి! వత్సా! ఇంక పాలుమ్మంచు లెమ్ము. నీరదనిర్ముక్త నీరజాప్తుని మాడ్కి ద్విగుణీకృత తేజఃశాలివై భాసిల్లుము! అదిగో! తూర్య నినదము! నీచదలముకూడ నరుదెంచుచున్నది. భయములేదు! ఒక్క చంద్రగుప్తుండు శతనందులకు సముండు! నాశిష్యునిం బరాస్తుం గావించుటేరికి సాధ్యముకాదు! దూరమునుండి చంద్రకేతడుగో! నీకుం దోడ్పడ వాహినీ సహితముగ నరుదెంచుచున్నాండు.

నికటతర నేపథ్యమున—ఈ యరణ్యమధ్యమందే!

చాణ—చంద్రగుప్తా! దృఢచిత్తుఁడవు కమ్ము. మెకములపై నుఱుకు వ్యాఘ్రముచాడ్పున ముందునకుఁ బర్విడి రిపులోకము రూపు మాపుము! మురా! మన మింకఁ బోదము రమ్ము!—కుమారా! జయకరమను తోడ్కొనిరమ్ము!! శుభంబగుగాక!!

ముర—వత్సా! నాచరణధూళి గైకొమ్ము.

[తనయునకుఁ బదధూళి నొసఁగును.]

[ఉభయులు నిష్క్రమింతురు; రెండవవలనునుండి నలువురు సైనికు లతో ముక్తఖడ్గమును కరంబునఁబూని నందుఁడు ప్రవేశించును]

నంద—ఇదిగో! ఆకాపురుషుఁ డిందే యున్నాఁడు! దుర్మతీ! కాచు కొమ్ము!! [చంద్రగుప్తునిఁ దాఁకొనును.]

చం॥గు—నందా! నిన్ను నీవు రక్షించుకొమ్ము! [కత్తిఁబై కెత్తి]—నాకరము కంపించిపోవుచుండెనేల!

[ఆల మారంభమగును. ఇరువురు సైనికులు నేలఁగూలుదురు.] పిదప చంద్రగుప్తుని తరవారి యాఘాతమున నందుని కరవాలము కరమునుండి క్రిందపడిపోవును. చంద్రగుప్తుఁడు తమ్ముని శిరము ఛేదింప నుద్యమింప నిజహస్తముచే నందుఁ డగ్రజునిజతనమును వారణమొనరింప గమకించి, "అన్నా! నన్ను వధింపకు" మనును. తత్క్షణమే చంద్రగుప్తుఁడు తన తరవారిని దూరముగఁ బాఱవైచి "తమ్ముఁడా! నా ఱొమ్ముఁ జేరు" మని నందుని గవుంగిలించు కొనును. ఇయ్యవసరమున మిగిలిన సైనికులిరువు రాతనిఁ దారు కొన నుద్యుక్తులగుదురు. ఆముహూర్తమునఁ జంద్రకేతు ఛాయ లును, వారలవెనుక గొందఱు సేనానులుఁ బ్రవేశించి శత్రువులపై భల్లపరంపరల నిక్షేపింపఁబూనుదురు. సరిగ నయ్యవసరమందే చాణక్యుఁడు సేతువుపై గానంబడి, "వధింపకుఁడు! బంధింపుఁ!!" డని పల్కును. [తెర పడును]

# చంద్రగుప్త

## తృతీయాంకము

### ప్రథమరంగము

సముద్రతీరము—సంధ్యాకాలము

సైనికులు పాడుచుందురు. దూరమున ఏంటిగోనను నీరవుండై నిలువంబడియుండును.

**గీతమాల.**

సఘనగగనము గర్జింప సర్వదిశల
కరకధారావృష్టిగురియ కరము వేగ
అవని వెలిగొందు మాయగ నక్షియుగము
తారచంద్రులు చయ్యన దాగనపుడు
ఇరులనడుమను తోంచు నాయింతిముఖము.
నికిరస్తోమము మెగురగ వేడ్కతోడ
జోత్స్నహాసిత నీలగగనసీమయందు
స్నిగ్ధవాతుల యలలందు శిహారితగుచు
ముగ్ధనేత్ర నీరజకాంగ బుడమికాంత
నాతి మధురమృదులవాణి నన్నుఁజేరు!
తిమిరమందును సొగసురాతిరులయందు
కాననంబున గుంజవసానియందు
నిఖిలవిశ్వవలయమందు నఖిలదిశల
నాపె హాసనమె పాలును బ్రాపుమీాటి
సాంత్వనంబుచె నిండింప స్వాంతమంత.

హృదయకుహరగమ్యందనిశమాముదిత మురళి
ధ్వనియె శ్రుతమగు నెదకు మోదంబునొసఁగ;
సరగ ఫదనముఁజేరి యాసన్న తాంగి
విరహావిధురాధరమునఁ గాంతురభసమున
మధురహాసము; పత్నిసుమధుర వాణి
విరహానీరవకంఠంబు వీడివచ్చి
దీర్ఘనిశ్వాసనావంతఁ దీర్పఁగాన.

ఏంటి—వీరలిపుడు నిజాలయములకు మగుడి చనుచుండిరి. ఆహా! నేఁడు వీరల కెట్టియానందకరదినము! బహుకాలానంతరమున నీ సైనికులు తమ ప్రియజనులముఖములను వీక్షింతురు. దానం జేసియే వీర లిత్తఱి పరమహర్షసంభరితస్వాంతు లగుచుండిరి. ఆహా! వారల యాననము లెట్లాహ్లాదద్యుతులతోఁ దేజరిల్లుచున్నవో! జన్మస్థానపునర్దర్శన మెంత ప్రమోదదాయకము! మధురసంగీతము సలుపుచు వార లెట్లుప్పొంగుచుండిరో! ఇఁక నేనో—నేనుదయించినంతనే యుజ్జ్వలమగు ముఖమేమియు స్వీయసీమయందు లేదు. ఒకవృద్ధమాత శైశవమున నన్నుఁ బాలన మొనరించుట నిక్కమే! కాని ఆబిడ నన్నుఁబెంచి పశువుపగిది సంతయందు నన్ను విక్రయించివైచెను. ఇపుడు జగతియందు నా ప్రేమకుఁ బాత్రులగువారు కాని, నన్నుఁ బ్రేమించువారుకాని యెవరు లేరు. అట్లైన నేనిపుడు నిజసీమ కరుగుచుంటి నెక్కతన? వాతులకరండము నొక మహాజ్వాల యార్తశ్వాసమున నూర్ధ్వమున కుడ్డీన మొనరించి కొంపోవు తెఱంగున నొక తీవ్రవ్యంగము క్షిప్తవేగమున నన్నుఁ గొనిపోవుచుండెను. నిజసృష్టి జనితంబు కానిదియు, దన యుత్పన్నమునకు నే నుత్తరవాదిని కానిదియు నగు మహా వ్యాధియొండు నన్ను వేధించుచున్నది. పృథ్వి

యొక్క విచారమిట్టులేయుండును! — కాదు — దాని యపరాధము మాత్రమేమి? — ఈ విచారము కేవల మీశ్వరునిది! పితృ కలుష, దైన వ్యాధులకు, బుత్రులు భాగులగుచుంట లేదా — అయినను — పోనిమ్ము! ఇంకం దలపను! ఉన్మాదుండనై పోదును. అదిగో వియత్తలము నీల మేఘావృతమగుచుండెను! అచిరకాలములో భీషణఝంఝామారుత ముత్పన్నమగును. అదే! మహోదధి భయంకర గర్జనము సలుపుచుండును! హే! యుచ్ఛ్వసితనీల సింధూ! హొంగిపొరలుము! కల్లోలివికమ్ము! మానవుని క్షుద్ర దంభము నుపేక్షించి కాలభ్రుకుటినిం దుచ్ఛమొనరించి, అనంతాంబరమున భవదంగములను మిళితంబొనర్చి సృష్టియనాది సంగీతమును పాడుచు మృదుమందయాందోళనమునం బృథ్వీ ప్రాంతమునుండి యపర ప్రాంతమునకు ధావితవుకమ్ము. నీలనీరధీ! నీవు స్వాధీనవు! ఉన్మత్తవు!! ఉదారవు!!! సృష్టి మహావివర్త నాభ్యంతరమునుండి యుగయుగంబు లీవాకే విధంబునం బ్లావితమగుచుంటివి! ఊర్ధ్వస్థోన్మత్త నీలాభ్రమునకు నిమ్న మందీవు స్వచ్ఛ ప్రతిచ్ఛవివై యలరుచుంటివి! క్షపాకర ఖద్యోతాది మహాగ్రహంబులును, సౌందర్యమండితంబైనయఖండ జ్యోతిఃపుంజమండలంబును భవదగాధ హృదయమందీవు ప్రతిబింబితమొనరింతువు! ఉన్మత్తఝంఝుతో నుత్తాలతరంగభంగమున నీదానవక్రీడల సల్పుచుందువు! క్షుబ్ధగంభీరమంద్రమున భైరవ నిర్ఘాతరవమున కుత్తరమొసంగుదువు! విభావరికాలమున ఫేనాయితపింగళవర్ణోపేతవై విద్యోతము నుపహాసము కావింతువు! ఝంఝావసానమున మఱల నిర్మలనభముభంగి నీలంబవై, స్థిరంబవై, మౌనంబవై, యుదారంబవై, గంభీరవై తనరుచుందువు! హే! హే! కాంతిమంతరత్నాకరమా! హే! అగాధమహార్ణ

వమా! భవదుద్దామ ప్రమత్తాంధవిక్రమంబున విజృంభించి బిర బిర పారలిపొమ్ము!—హే! వీర్యసంపన్నా!! చిరదినము సమ భావమునఁ గల్లోలితంబవై పొంగిపొరలుము!!!

## ద్వితీయరంగము

కారాగారము—రాత్రికాలము.

నందవాచాలు రొకగదినుండి మఱొక గదిలోని కరుదెంతురు. నందుఁడు చింతామగ్నుఁడై యుండును.

నంద—అయ్యో! ఏమిబుద్ధి! ఈ గదికూడ అంధకార బంధురమైయే యుండెను!

వాచాల—అంధకారబంధురమై యున్న మాత్రమేమి? మశకముల బాధనుండి బ్రతికి యీవలఁ బడితిమి!

నంద—ఈ చీఁకటి కోణమందేకదా కాత్యాయనుఁ గైదీగావించి యుంచితిమి?

వాచాల—చిత్తము మహారాజ్!

నంద—ఆహా! ఈ ప్రదేశమెంత భయానకమై యున్నది!

వాచాల—మహారాజా! ఈ గదిలోనే కదా కుడువఁ గూడుబెట్టక వాని యేడ్గురు బిడ్డలను మలమల మాడ్చి చంపితిరి?

నంద—వాచాలా! ఇపు డనుతప్త హృదయుఁడ నగుచుంటిని.

వాచాల—ఓహో! అటులనా!! అయిన మహారాజా! ఇఁకనెట్టి భయము లేదు.

నంద—భయము లేదని మాత్రమెట్లు చెప్పఁగలము?—కాని చంద్రగుప్తుఁడు నన్ను వధింపఁడని వక్కాణింపఁగలను. ఒకవేళ నాకు వధ ప్రాపించినను, అది యాశీర్ణ భ్రుకుటికుటిల ప్రతిహింసాపరా

యుణ బ్రాహ్మణునివలనఁ బ్రాపించును. నఖరాఘాత హారిణము పై శార్దూలము వలెపులోలుపదృష్టిఁబోలు భయావహాదృష్టి నాపైఁడాదినమున నాపై సారించెను. అబ్బా! ఆ ఘోరాపుఁ దలఁచిన, భయముచే నొడలంతయుఁ గంపించుచున్నది!

వాచాల—భయ మెందులకు ?

నంద—వాచాలా! నీకు భయ మొదవుచుండుట లేదా ?

వాచాల—భయమా! నాకా!! మహారాజా! భయమన నేమో వాచాలుఁ డెఱుఁగనే యెఱుఁగడు. ఆ బ్రాహ్మణుఁడు మాత్ర మేమి చేయఁగలఁడు? ఏమైన విశేషముఁ జేయఁగలఁడని యనుకుందమన్నను, మహారాజుగారిని మాత్రము వధింపఁగలఁ డనవచ్చును. అంతకు మించి విశేష మాతఁడేమియుఁ జేయలేడు. ఇట్లుటఁగి నేను భయపడు టెందులకు? నా సోదరి విధవయగును. అంతే! ఆమె వితంతువైనచో నా కేమి?

నంద—ఆహా! ఏమి యుబ్బు! నన్ను వధించి, వారునిన్ను మెల్లగ విడిచివైతురని తలంచుచుంటివా? నిన్ను వధింపరని కాఁబోలు నీ కులుకు?

వాచాల—బలే! చాలా బాగుగా గ్రహించితివయా మహారాజా! కాని పాపము యేలిన వారింకెంత సే వుందురు ?

నంద—వాచాలా! నీవు తప్పిపోదువని కలలోనైన దలంపకుము!

వాచాల—ఆహా! ఆలాగుననా!!

నంద—నీవు చంద్రగుప్తుని తల్లి కొప్పుపట్టి యీడ్వలేదా?

వాచాల—అయ్యో! ఏమిమాట!! ఆలాగున నీడ్చితినా? ఆలాగున యీడ్చుటయే! ఎంతమాట సెలవిచ్చినారు ?

నంద—నీవు చాణక్యపండితుని శిఖఁబట్టి యీడ్వలేదా ?

వాచాల—నేనా? నేనా?—చాణక్యపండితుని శిఖఁబట్టి యీడ్చితి

నా ?__అబ్బే ! అదేమిపని ! __ఆలాగున నెవుడు చేసితిని ?
నంద__ఆ రెండు పనులటుండ, నీవు నా బావమరఁదివి! నన్ను వధించి నిన్ను విడతురా ?
వాచాల__ఓహో ! అటులనా ?
నంద__నన్ను విడిచిపెట్టినను, నిన్ను విడిచిపెట్టరు ! ఈ విషయము బాగుగా జ్ఞప్తియందుంచుకొనుము !
వాచాల__అయ్యో ! అయ్యో !! అటులనా ? [చేతులు జోడించి]— మహారాజా ! మీరే ? __
నంద__పిచ్చివాఁడా ! నా ముందు చేతులు జోడించుకొను టెందులకు ?
వాచాల__అయ్యా ! ఇది అభ్యాసముకాని మరేమియుకాదు__కాని మహాప్రభో ! నేనేపాపము నెఱుఁగను ! [కంపితకాయుఁడగును]
నంద__భయమేమి ! వారు కావించునది వధమాత్రమే !__ఇంతియే కదా !
వాచాల__వధించివేయుట, యింతియేనా !
నంద__అట్లని నీవేకదా యింతకుఁ బూర్వ మంటివి !
వాచాల__మహారాజా ! ఆలాగున వచించితినని నాకు జ్ఞప్తికి వచ్చుట లేదు.
నంద__అవునది యెఱుఁగుదును. జ్ఞాపకశక్తి అంతయు నీ యధీనమందున్నది !__ఇపుడేకదా అంటివి !
వాచాల__నే నంటినా ?__
నంద__నిన్ను తప్పక వధించితీరుదుము.
వాచాల__(కరములు జోడించి)__ మహాప్రభూ ! నే నే పాపము నెఱుఁగను.
నంద__నీ తల యెగురుటకు తడవులేదు !

వాచా—అయ్యో! పాపమది ముండమోయును కదా!

నంద—నీవు చచ్చిన ముండమోయువా రెవరు? నీకు పెండ్లి కాలే దుగదా?

వాచా—ఆహా! ఎట్టిగతి!! ఈ సమయమున ముండమోయుట కొఱకు పెండ్లామైన లేకపోయెగదా!!!

నంద—నీ కొఱకేడ్చు వారెవరును లేరు.

వాచా—మహారాజా! నాకు పెండ్లామే యుండినచో, పాపమా జేల (క్రందన స్వరము ననుకరించి) గోలుగోలున యేడ్వకుండ నుండ దని యెఱుంగుఁడు.

నంద—విపత్సమయమందు పరిహాసవచనములు వినగా నాకు నవ్వు వచ్చుచున్నది.

వాచా—అదే జ్ఞాపకముంచు కొనుడు. మహారాజా! "నవ్వు వచ్చు చున్న"దనే దానినే జ్ఞాపకముంచు కొనుఁడు.

నంద—యుద్ధమునకు ముందు మహారాజ్ఞిని నీవు మంత్రియాశ్రయ మందుంచి వచ్చితివికదా?

వాచా—చిత్తము. సరిగా ఆమె నచటేయుంచి వచ్చితిని.

నంద—ఓ! అదేమిశబ్దము వాచాలా!

వాచా—(వణఁకుచు)—అయ్యో? వచ్చినారు కాంబోలు బాబో!— అరుగో! అరుగో!! తలుపు తెఱచుచున్నారు!

[ఇరువురు భృత్యులతో కాత్యాయనుఁడు ప్రవేశించును]

కాత్యా—మహారాజా! ఎట్లుంటివి?

నంద—మంత్రీ! నీ వెంత విశ్వాసఘాతకుఁడవు!!

కాత్యా—నేను విశ్వాసఘాతకుఁడనా?

నంద—ఆ శైశవము నా జనకుని యన్నముఁ దిని,—

కాత్యా—అతఁడు నీకును చంద్రగుప్తునకును కూడ జనకుఁడే! నీజన

యితకు విరుద్ధముగ నేఁ నెట్టి కార్యముఁ గావింపలేదు. నే నాతని పుత్రులలో నొకనికి విరుద్ధముగ నిలిచి, రెండవవాని పక్షము నవలంబించితిని. ఇందుఁ దప్పే మున్నది?

నంద—అవును! దాసీపుత్రుని పక్ష మవలంబించుటయెందుఁ దప్పే మున్నది? బ్రాహ్మణుఁడా! నీవును, చాణక్యుడును,—యిరువురు నగ్రజాత్యుద్భవులై, ఆర్యులై, ద్విజులై, ఘోరంబగు కుట్రపన్ని అనార్యపార్వత్య సైనికుల సాయముఁగొని క్షత్రియు నొకని సింహాసనచ్యుతుఁ గావించి, జనకుని దాసీపుత్రుని రాజపీఠమం దుపవిష్టుఁ జేయుటకు మీకు సిగ్గేల కలుఁగలేదు? ఒకశూద్రుఁడు—ఒక జారజుఁడగు శూద్రుఁడు నేఁడు మగధసింహాసన మందాసీనుఁడై యుండెగా! ఆహా! ఎట్టివిధి! ఎట్టిగతి!!—బ్రాహ్మణుఁడా! నీ ప్రఖ్యాతి యిదియా?—ఏమి, తలవంచుకొంటివి విశ్వాసఘాతకా!

కాత్యా—నేను విశ్వాసఘాతుకుఁడనై యుండలేదు. నందా! నీవేనన్ను విశ్వాసఘాతకుని గావించివైచితివి! నీవు నాయెద్దురు ముద్దుబిడ్డలను,—యే పున్నెము పాపమెఱుఁగని పసికూనలను అంధకారబంధుర కారాగారమందు బంధించి మృత్యుగహ్వరమునఁ బడఁద్రోసితివి! నేను, నాయీవృద్ధక్షీణదృష్టి సమ్ముఖమున, యీ భయంకర ప్రదేశమున,—యీ గభీరాంధకూపమున నా ముద్దుబిడ్డ లొక్కరొక్కరు క్షుత్పీడితులై, శుష్కదేహులై, శల్యావశిష్ట కంపితకాయులై మరణించుట వీక్షించితిని. ప్రాణములఁ బరిత్యజించుటకు ముందు తనయులందఱు తమతమ ముష్టిమేయఖాద్యమందలి శీర్ణశేషాంశమును తమ యయ్యకొసఁగిపోయిరి. అసువులను వీడకమున్నె వారు నీ కభిశాపమొసఁగి "జనకా! ఇట్టి దౌరాత్మ్యమునకుఁ దగు విధంబున బ్రతిహింసఁగావింపు" మని

పల్కి పిదప తమ దేహములు చాలించిరి. నందా! కన్నకొమ
రులకొఱకు వృద్ధుండగు జనకుఁడు పడువ్యధను నీ వేమెఱుంగు
దువు? ఘనాయమానాంధకారమునఁ బృథ్వియంతయు లుప్తమగు
తఱి జనకున కిహజగతి భవిష్యతంబగు కన్నకొమరుండే కేవల
మాతని దృక్పథమున దేదీప్యమానుండై యుండును. జనకుఁడు
తన కీర్త్యపకీర్తులను, భాగ్యదారిద్ర్యములను, పుణ్యపాపములను,
వేయేల లోకమునఁ దనకుఁగల సర్వస్వమొక్క సుతునికే యొసఁగి
చనును. అట్టి నాసుతులేద్వార నీవు నీ పైశాచికనఖములచేఁ
జీల్చివైచితివి! నా యావజ్జీవన మొక దీర్ఘహాహాకారముగ మార్చి
వైచితివి!!—నీతో నాడుచుఁ బాడుచు వేడుకనుండి, నీ కెన్నఁ
డెట్టి చెట్టఁజేయని ఆ పట్టు కొమ్మల గట్టిడివై నీ పొట్టఁబెట్టు
కొంటివి!

నంద—(ఒకించుక చింతించి)—భూసురేంద్రా! నిక్కముగ నేను దుర్ణయమున కొడిగట్టితిని. ఘోరతరకిల్బిష మొనరించితిని. నేనిట్టి పాషండుఁడనై యుండలేను. సంగదోషము నన్నుఁ బాషండుఁ గావించివైచెను.

కాత్యా—మహారాజా! ఎట్లీ విట్టి నిష్ఠురుండవు కాఁగలిఁగితివి? పసి పాపవై యున్నప్పటినుండి నిన్నుఁ బెనుచుచు వచ్చితిని. నిన్నారువు లందు పవిష్టుగావించి, పలు తెఱంగుల నాడించి, పెద్దవగుదనుక నిన్ను నా ప్రాణంబట్ల జూచితిని. అట్టి నాయెడ నీ వెట్టు లిట్టి క్రూరత్వముఁ జూపఁగలిఁగితివి?

నంద—భూమీసుతా! నన్ను మన్నింపుము.

కాత్యా—మంచిదినందా! నిన్ను మన్నించితిని. ఇఁక నేను సంసారమును త్యజించివైచెదను.

వాచాల—మంచిమాట! మంచిమాట!! ఈసంసారమంతయు చిక్కుల

మయము! ఏదో కష్టమో పిడుగువలె వచ్చి మీఁదపడుచుండును. ఇటువంటి పాడు ప్రపంచమును విడిచిపోవుటయే మంచిది—అయితే యిపుడు నా విడుదలమాటేమి?

కాత్యా—నిన్ను విడుదల జేయఁగల యధికారము నాకు లేదు. అయినను నీ ముక్తికొఱకై నేఁ జాణక్యమంత్రినిఁ బ్రార్థించెదను.

నంద—ఆశీర్ణకాయుఁడగు బ్రాహ్మణుఁడు నేఁడు మంత్రియా?

కాత్యా—ఒక్క మంత్రియేకాఁడు. అతఁడు చంద్రగుప్తమహారాజు యొక్క గురుదేవుఁడు.

నంద—ఆహా! కాలమహిమ!! శూద్రుఁడైన చంద్రగుప్తుఁడు మహారాజా? భిక్షుకుఁడైన చాణక్యుఁడు మంత్రియా? ఇఁక సేనాపతియో?

కాత్యా—మలయాధీశ్వరుండవైన చంద్రకేతు.

నంద—బాగుబాగు! ఒకరి కొకరు సరిగఁ గుదిరిరి.—అవనీసురోత్తమా! నీ యెడ మిగుల నత్యాచారముఁ జూపితిని. క్షమింపుమని వేఁడుటకు నా కేమియు లజ్జా సంశయములులేవు—కాని శూద్రుఁడైన చంద్రగుప్తుని, శూద్రవనితయైన మురను తలఁచినంత మాత్రమున నా కరికాలు మంట తలకెక్కును. నాకు ముక్తియే లభించుచో—

కాత్యా—రాజా! నీ ముక్తికొఱకై నేను వేఁడెద.

వాచాల—అయ్యా! మంత్రి మహాశయా! నా విడుదలకొఱకు కూడ కొంచెము వేఁడుకొనుఁడు! ఇక్కడనుండి వెలుపలఁ బడవలెనని నాకు చాలతొందరగా యున్నది. నా కీయుపకారము చేసినయెడల మీ కాజన్మాంతము కృతజ్ఞుఁడనై యుందును.

కాత్యా—వాచాలా! నీవు స్వయముగ వచ్చి ప్రార్థింపుము. చాణక్యమంత్రి నిన్నుఁ గొనిరమ్మని ఆనతిచ్చెను.

వాచా—ఓరి బాబో!!

కాత్యా—దానం జేసియే నే నిచటికి వచ్చితిని.
నంద—వాచాలునితో వానికిఁ బనియేమి?
కాత్యా—ఎఱుఁగను—వాచాలా! రమ్ము.
వాచాల—(సరోదనస్వరమున) మహారాజా!
నంద—నేనేమి చేయఁగలను? నేఁగూడ నేఁడు నీవలెనే బందీకృతుఁడనై యుంటిని. ఇఁక విశేషముగ విసిగింపక పొమ్ము—
వాచాల—ఆహా! మహాప్రభో! ఆబ్రాహ్మణుని తలఁచుకొనినచో నా హృదయము కంపించిపోవుచున్నది. ఇఁక వానిదగ్గఱకుఁబోవుటెట్లు?
కాత్యా—వాచాలా! రమ్ము. ఏమియు భయములేదు.
వాచాల—భయమునులేదు, భక్తియులేదు!—అయ్యో! ఇంకేమి బుద్ధి! ఇంక ఆశలేదు.
కాత్యా—రమ్ము.
వాచాల—చిత్తము స్వామీ!
[కాత్యాయనునితో వాచాలుఁడు నిష్క్రమించును.
నంద—ఆహా! నేఁడు దాసీపుత్రుఁ డొకఁడు మగధసింహాసనమందాసీనుఁడై యుండెగదా! ఈ కైదునుండి నాకు ముక్తిప్రాపించుచో (తలపంకించి) వాని మదమడంచెద!

[మఱొక గదిలోనికి నిష్క్రమించును.]

## తృతీయరంగము.

చాణక్యుని కుటీరాభ్యంతరము—రాత్రికాలము.

చాణక్యుఁ డేకాకియైయుండును.

చాణక్య—ఇఁక మరలి యరుగుదునా?—ఎటకు? నిశ్చింతయలస స్థితికా? నిష్కర్మనై రాజ్యమునకా?—వలదు! అశ్రుల్ప్రవేడి యసహ్యమైనది. అంతకంటె నిదే మేలు. ఇందుఁ బ్రతిహింసా

జ్వాలయున్నది. ఉత్తేజనాకుటూన్మాదనమున్నది! పతననిశ్చితము లక్ష్యమైయున్నది! అయితే స్వర్గము, లేకున్న నరకము. విధాతస్వర్గమునుండి నన్ను భ్రష్టుంగావించెను—నాకుం బోయిన దేమి? నరకమునకుం బోదును! ఈశ్వరా! నీస్వపక్షమున నన్నుం జేర్చుకొనలేదు. దానంజేసి యిపుడు నీవిపక్షమున స్థిత పక్షుండనై నిలువంబడుదును! ఏమి చేయుదువో చేయుము.—వలదు! మరలి పోవలదు!—కాని—అయ్యనను నీయక్షయసౌందర్యము నన్ను విద్ధమొనరించుచున్నది!—పిశాచీ! నీపాపవర్ణముచే నన్నాచ్ఛాదితమొనరింపుము. అతండేమి చేయంగలండో జూచెద. హే అదృశ్య మహాశక్తీ! నీమ్రోలనే నాత్మవిక్రయ మొనరించుకొంటిని. నేను నీప్రేమికుండను—నీక్రీతదాసుండను. నీ యధరవిషమును గ్రోలి నే నమరుండనగుదును. నీవిషాక్తాలింగనమును వక్షమునం బూని నేను నిరయమున కరిగెద! ప్రేయసీ! నన్ను వదలకుము. నాచేతినిబట్టుకొని మఱి—మఱింత దూరమునకుం దోడ్కొనిపొమ్ము.

(వాచాలుని వెంటంగొని కాత్యాయనుండు ప్రవేశించును.)

చాణ—కాత్యాయనా? ఈతం డెవరు?

కాత్యా—నందుని బావమఱంది యగు వాచాలుండు.

చాణ—ఓ! ఈతం డతండా?

[వాచాలుండు చాణక్యునకు భక్తిపూర్వకముగం బ్రణామ మొనరించును.)

చాణ—ఓహోహోహో! ఏమి భక్తి! ఏమి భక్తి!! ఒకప్పుడు నాశిఖను పట్టి లాగితివి.—జ్ఞాపకమున్నదా?

వాచా—లాగితినా?—అబ్బే! ఎంత మాట! అంతపనియే!!

[వెనుకకుం జూచును.]

చాణ—పాపము! స్మరణలేనట్లున్నది!! చూడు మీవుడే స్మరణకుఁ దెచ్చుచుంటిని. ఒకించుక తాళుము. ముందీప్రశ్నకుత్తర మిమ్ము—నందుని భార్య యెచట?

వాచా—నందుని భార్యయా?

చాణ—అవును.

వాచా—నందుని భార్యయేనా?

చాణ—అవు నామెయే!

వాచా—అయ్యో! నందుని భార్యయెందున్నదని యడుగుచుంటిరా?

చాణ—(క్రోధస్వరమున)—అవును!

వాచా—నందుని భార్య యెందున్నదో నే నెఱుఁగను.

చాణ—(పాదములతో గట్టిగ నేలఁదన్ని)—నీ వెఱుంగుదువు.

వాచా—(త్రోడ్తోడనే)—అయ్యో! ఎఱుంగుదును!! ఎఱుంగుదును!!!

చాణ—ఎచట నున్నది?

వాచా—(నిమ్న స్వరమున)—ఏమో!

చాణ—ఎచట నున్నదో చెప్పుము.

[వాచాలుఁడు వెనుకకుఁ జూచును.]

చాణ—వెనుక నేమి చూచుచుంటివి? నందుని భార్య—నీఅక్క యెచట?—ఆమె పుత్రు లెచట?

వాచా—మలయపర్వతమున.

చాణ—(గట్టిగ నేలపై తన్ని)—అబద్ధము.

వాచా—(త్రోడ్తోడనే)—అబద్ధము!—శుద్ధఅబద్ధము!!

చాణ—ఎచట?—నిజము చెప్పుము. గొప్ప బహుమానమిచ్చె దను. చెప్పుము. నీఅక్క యెచట?

వాచా—దేవాలయమున—కాదు! కాదు!! పితృాలయమున!

చాణ—కాత్యాయనా! అచటికి సైన్యమంపుము. ఇపుడు వీనిని

కారాగారమునందు బంధించియుంచుము. నందుని భార్య పితృసదన సమున లభ్యమగుచో వీనిని విడతును. ఆమెయందుఁ గానరానిచో వీని తలఁ గొట్టింతును!—పొమ్ము.

కాత్యా—వాచాలా! రమ్ము!

వాచా—బాబో! త–ల–గొ–ట్టిం–తు–వా? అంత—అంతపనే? అంతపనే?

చాణ—అవును? అంతపనే!!

వాచాల—ఆలాగున నయినచో మాఅక్క యక్కడ లేదు!

చాణ—వాచాలా! నల్లత్రాచుతో నాటలాడుచున్నావని యెఱుంగుము. నిజము చెప్పుము.

వాచాల—బాబయ్యా! నన్నేమియు చేయకుఁడు. దేవుడు సాక్షి. ధర్మము సాక్షి!

చాణ—ఎందులకు?

వాచా—(నిమ్నస్వరమున)—ఏమో!

చాణక్య—వాచాలా! నిజము చెప్పుము. ఇదే కడపటి మాట—నందుని భార్య యెచట?

వాచాల—(వణఁకుచు)—స్వామీ! ఆమె మంత్రి యాశ్రయమందున్నది.

చాణ—(క్షణకాలము యోచించి, పిదప మెల్లగ)—ఇది నిక్కమై యుండవచ్చును. మంచిది చూచెదఁగాక!—అరే ఎవరురా అక్కడ?

[భృత్యుఁడు ప్రవేశించును.]

చాణ—వీనిని బందీ చేసియుంచుము. ఈతఁడు చెప్పినది నిక్కమైనచో, వీనిని ప్రాణములతో విడచివైతును. అది కల్లయగుచో, వీనికి మృత్యువు తప్పదు—తోడ్కొని పొమ్ము.

వాచాల—అయ్యో! నా నాలుక యెండిపోవుచున్నది. ఎవరైన

కొంచెము నీరు నాకొంతునందుం బోయుఁడు.

చాణ—(భృత్యునుద్దేశించి)—దండుఁడా! ఈప్రక్క గదిలోనికిఁ గొనిపోయి, వీనికిఁ గొంచెము మంచి నీ రిమ్ము.

[భృత్యునితో వాచాలుఁడు నిష్క్రమించును.]

చాణక్య—పృథ్వియం దేమియు విసర్జితము కాదు.—అవర్జనము కూడ సారభూయిష్ఠమగును. పెంట కూడ పంటయగును. పురీష దుర్గంధము కూడ పారిజాత సౌరభముగఁ బరిణతమగును. కాని, దానిఁ దెలిసికొనవలెను.—కాత్యాయనా! ఏమి యోచించు చుంటివి?

కాత్యా—మానవుఁ డింత నీచుఁడు కాఁగలఁడని యోచించు చుంటిని. అత్యాచార, పీడన, హత్యలాది దురంతకృత్యములను సహింపవచ్చును కాని కృతఘ్నత యసహ్యము!

చాణక్య—మానవుని కృతఘ్నతయందే చాణక్యుని రాజనీతి జన్మిం చెను. మనుజుని కదర్యప్రవృత్తుల నుపయోగమునకుఁ గొనివచ్చు టాతని కర్జము. మిత్రుని శత్రు గావించుట, భ్రాతచే భ్రాతృ గళమున ఛురిక గ్రుచ్చుట, హింసా ప్రవృత్తిను త్తేజిత మొనరించుట, లిప్సాపిశాచికి ఖాద్యమొసఁగుట మున్నగు వాని నామము చాణక్య రాజనీతి. కత్తి సానబెట్టు నెడ మందహాస మొనరింప వలెను. పానీయమందు విషముఁ గలుపుతఱి మధుర ప్రసంగ ముచే నెదుటి వానిని మోహితుఁ గావింపవలెను. వీని నామ ధేయమే చాణక్య రాజనీతి!—'శఠే శాఠ్యం సమాచరేత్!'

కాత్యా—ఆర్యా! నేను ప్రతిహింసాంధుఁడనై యున్నను, మీ రాజ నీతిని సరిగ హృదయంగమము గావించు కొనఁజాలకుంటిని.—

చాణ—కావించుకొనఁజాలుదువు. ఒకించుక యోపికపట్టుము. నిన్ను నేను పూర్ణవిశ్వాసఘాతకుఁ గావించి విడిచి పెట్టెదను.

శాస్త్రమును నేఁ గళావిద్యవలె నభ్యసించితిని. నీకు దానియందు శిక్షగఱపెదను. కొంత కాలమునకు నీవు కూడ శాస్త్రమం దారి తేరిన వాఁడవగుదువు.

కాత్యా—కాని, యిది యన్యాయము. పాణినీ వ్యాకరణమందలి "నిర్వాణోవాతే" యను సూత్రప్రకారము—

చాణ—మరల నిన్ను పాణిని ఆవహించెనా ?—ప్రాణము విసిగింపక కొంచెము సేపు నీ పాణినిని మూలపడవైచియుంచుము.—అన్యాయమని యెవ రందురో చెప్పుము.

కాత్యా—సమాజము.

చాణ—సమాజమును లెక్క జేయను.

కాత్యా—అంతరాత్మ.

చాణ—అది యొక కుసంస్కారము.

కాత్యా—అట్లైన యన్యాయమని యీశ్వరుండేయనును.

చాణ—ఈశ్వరుఁడు లేడు!

కాత్యా—చాణక్య పండితా! మీరొక్క మాఱుగా శైలశృంగాగ్రముపై నిలువంబడితిరి.—పడిపోదురు సుడీ!

చాణ—పడుచో, ఒక ప్రకాండయుల్కాపాతము కలుఁగును. జగమంతయు దానిఁ దేఱి చూచును.—నీవిఁకఁ బొమ్ము! నేను శయనింప నరిగెదను! సిద్ధముగ నుంచుము.

కాత్యా—ఏమి ?

చాణ—యూపకాష్ఠఖడ్గములను—బలివిషయమై యిఁక యోచింప నవసరము లేదు.

కాత్యా—కాని సందుఁ విడుదల జేయరాదా యని పల్కుచుంటిని.

చాణ—విడుదల జేయవచ్చును. కాని, అట్లుచేయుట పడదు. పొమ్ము. అంతయు సిద్ధముచేసి యుంచుము. చూడుమడె! నాప్రేయసి

యొట్లు నవ్వుచున్నదో! ఇఁకఁ భూమ్మ.

[కాత్యాయనుఁడు కడు విస్మయపడి నిష్క్రమించును.]

చాణ—హే అదృశ్యమహాశక్తీ! నీవు నన్నతి నేర్పుగ నడిపించుచుంటివి. నీ యనురాగవాహినియందు నేఁగొట్టుకొని పోవుచుంటిని. ఆహా! నీకుటిలదృష్టి, వక్రహసనము, దుర్గంధనిశ్వాసము, పంకిలస్పర్శ యెంత మధురముగ నున్నవి! ఇట్టివాని నన్నిఁటి వీడి చనఁదలఁచితిగా! ప్రేయసీ! నీవెట్టి కుత్సితవు! అనిమేషనయనుండనై నిన్ను వీక్షించినకొలఁది నేను ముగ్ధుఁడ నగుచుంటిని. కృష్ణదావానల ముత్పన్నమై, పృథ్వీసౌందర్యము నంతయు లేహన మొనరించు చున్నది! లోలుపవిస్ఫారితనేత్రియై వన్యవ్యాఘ్రి తన భారివీడి పాఱఁజాలని నిష్పందప్రాణహరిణమును తేఱిచూచుచున్నది!—ఆహా!ఎట్టిభీషణదృశమం దెట్టి సౌందర్యము!!

## చతుర్థరంగము

### హిరాటునందలి ప్రాసాదము—రాత్రికాలము

(సెల్యూకసు త్తేజితభావమున, దత్ప్రాసాదసమ్ముఖాగారమునఁ బచారిచేయుచుండును—హెలెన్ నిలువఁబడియుండును.)

సెల్యూ—ఈమాఱు సికిందరుషాహా దిగ్విజయము సంపూర్ణము కావించెదను. చంద్రగుప్తా! ఒక్కవత్సరములో నీవు భారతభూమింగల యవనోపనివేశమును నిర్మూల మొనరించి వైచితివి! ఈ మాఱు నీచెయ్దమునకుఁ దగు ప్రతీకారము చేసెదఁ జూడుము!

హెలెన్—జనకా! భారతభూమిని జయింప నువ్విళులూరుచుంటి రేల? మీ సామ్రాజ్య మాసియాఖండమం దర్థభాగము వ్యాపించియున్నది. మీ కీర్తిచంద్రిక లవనియందెల్లెడలఁ బ్రసరించి

యున్నవి. సింధునది కావలియొడ్డునఁ జంద్రగుప్తుఁ డేలుచుండెను. ఇపు డాతనిపాలనము మీకు చక్షుశూలమగుచుండెనేల?

సెల్యూ—అతఁ డత్తావున మాత్ర మేల యేలవలెను. చంద్రగుప్తుఁడు యవనుఁడాయేమి?

హెలెన్—యవనుఁడు కాకున్నను, మానవుఁడేకదా!

సెల్యూ—జగతియందు నేగణించుజాతులు రెండే. అందొకటి సభ్యులైన గ్రీకులజాతి. గ్రీకులుకాని తక్కుంగలయసభ్యమానవులు రెండవజాతివారు.

హెలెన్—జనకా! యవను లెల్లకాలము విశ్వవిజయులై యుండ లేదు. ఎల్లకాల మట్లుండఁజాలరు. యవనభాస్వంతుఁ డస్తాంబుధి యలల మునింగిపోయెను! ఇపుడు కానఁబడునది తదతీత మహిమాశేషమ్రియమాణజ్యోతి. ఇత్తఱిమీమనోరథము వితథ మగుట నిక్కము.

సెల్యూ—విశ్వవిజయుండగు సెల్యూకసు మనోరథము వితథంబగునా?

హెలెన్—మీ రరాతికరగతు లయ్యెదరు.

సెల్యూ—అట్లయ్యెద?—నందనీ! నీవు మహాశుభానుధ్యాయి వలెనే కానంబడుచున్నావు. ఇవి దుహితనోటనుండి రావలసిన నుడువులా?

హెలెన్—పితా! తాము దుర్నయమున కొడిగట్టుచుంటిరి.

సెల్యూ—ఆహవవిషయములను నీతోనేఁ దర్కింపఁదలఁచుకొనలేదు. ఎరిష్టఫెనిస్ చెప్పనేచెప్పెను.

హెలెన్—ఎరిష్టఫెనిస్ యేమనిచెప్పెను?

సెల్యూ—[సందిగ్ధభావమున]—స్త్రీలు తర్కములోనికి దిగుట అనుచితమని.

హెలెన్—అట్లాతఁ డేసందర్భమందు వచించెను? ఉండుఁడు—ఎరిష్ట

ఫెనిస్ గ్రంథములను కొనివత్తున్న... [నిష్క్రమింపఁబోవును]

సెల్యూ—కాదు కాదు, ఆలాగుని పల్కినది యెరిష్టఫెనిస్ కాదు— థెమిష్టక్లిస్.

హెలెన్—థెమిష్టక్లిసతి రాజనీతివిశారదుఁడు. ఆతఁ డీవిషయమున నేమనెననుచుంటిరి ?

సెల్యూ—అట్లైన, ఆలాగున నుడివిన దాతఁడుకాడు. సఫోక్లిస్.

హెలెన్—మంచిది సఫోక్లిస్ గ్రంథములనే కొనివచ్చుచుంటిని. ఆతఁ డట్లేసందర్భమం దనెనో చూపుఁడు. [నిష్క్రమించును.]

సెల్యూ—పొరపాటు పడితిని. నిక్కముగ ఎరిష్టఫెనిస్ గ్రంథము లందు నాకెంతజ్ఞానమున్నదో, సఫోక్లిస్ గ్రంథములందుఁగూడ నంతయే జ్ఞానమున్నది. అభిప్రాయము నాదియే యయ్యు, ఒకటి రెండుపెద్దపేరులను కలిపిచెప్పినయెడల మాటయొక్క మహాత్మ్యమ్ము హెచ్చిపోవునని తలఁచి అట్లంటిని. కుఱ్ఱది యవనగ్రంథముల నన్నిఁటిని పఠించి, దొంగను పట్టివైచినది. ఈచదువు చాలక కాఁబోలు యింకను సంస్కృతమును చదువుదుననుచున్నది. అదిగో! పుస్తకములకట్టఁ బుచ్చుకొని వచ్చుచున్నది. త్వరలోఁ గాలికి బుద్ధిఁజెప్పు టుచితము.

[నిష్క్రమించును.]

[నాలుఁగైదు గ్రంథములఁగొని హెలెన్ ప్రవేశించును]

హెలెన్—ఏరీ ? జనకులేరీ ?— అరుగో! పలాయన మొనరించు చున్నారు — వదలను. చూపితీరవలెను. సాధారణముగా విడచు దానను కాను.

[పుస్తకములను ప్రక్కనుంచి, నిష్క్రమించి, సెల్యూకసు కరముఁ బట్టుకొని మరల బ్రవేశించును]

హెలెన్—కూర్చుండుఁడు ! అట్లు సఫోక్లి సేసందర్భమందు వచిం

చెనో నాకుఁ జూపి తీఱవలెను.

సెల్యూ—ఏమి యీ బలవంతము! నేను చూపువాఁడను కాను. ఏమి చేయుదువో చేయుము. నాయిష్టము. అట్లని లక్షమాఱులు పదిలక్షలమాఱులు అందును నీవు మిగుల నసాధ్యపుపిల్ల వగుచున్నావు. నాపై నీకేమియు నాపేక్షలేదు.

హెలెన్—మీపై నేమియు నాపేక్షలేదా?—జనకా! మీరిట్లేలాగున ననఁగల్గితిరి? మీ కన్నీటిబిందువు నొకటి దుడుచుటకు నేను నాసర్వస్వము వీడఁగలనని యెఱుంగరా?

సెల్యూ—అమ్మా! నేననుచితము వచించితిని. నన్ను మన్నింపుము.

హెలెన్—జనకా! అపరాధము నాయది. నేను మిమ్మేమియుఁ బ్రేమించుటలేదు. నన్ను క్షమింపుఁడు.

సెల్యూ—తల్లీ! తప్పునాది. నీవు నన్నుఁ జాలప్రేమించు చుంటివి.

హెలెన్—(మందస్మితముఖియై)—కాని యీవిషయమున నపోక్తి నేమియు ననలేదా?

సెల్యూ—లేదు.

హెలెన్—మంచి దట్లైన నికేతర్కము లేదు. జనకా! అలెగ్జాండరు ప్రభువు విషయమున నొక విశేషమును వింటిని. అదినిక్కమేనా?

సెల్యూ—ఆవిషయమేమి?

హెలెన్—ఆతఁడు భారతభూమిని జయింపఁ జనినపుడు ఒక బ్రాహ్మణునికిని వానికిని సమావేశమాయెనఁట. విప్రుఁడు సికిందరు నుద్దేశించి, "రాజేంద్రా! భారతవిజయము ముగిసినపిదప తామిఁకేమి జయింతు" రని ప్రశ్నింప, నావిక్రమసింహుఁడు "చీనాసీమ జయింతు" ననెనఁట. "తదుపరియే" మని పాఱుఁడు ప్రశ్నచేయ "ఆఫ్రికా" యనియు, "పదంపడి యిఁకే" మని మరల బ్రాహ్మణుఁ డడుగ "యైరోపా" యనియు నుత్తర మిచ్చి,

మరల నృపాలుఁ డట్లే ప్రశ్నింప నీ కేమియుఁ జెప్పుటకు దోపక సికిందరు "తదనంతర మొక్కొ గొప్పపిందుఁ జేయుదు" ననెనఁట. అపుడు భూసురశ్రేష్ఠుఁడు "ఆవిందు నిపుడే యేలజేయరా?" దని యడిగెనేఁట!

సెల్యూ—ఆబ్రాహ్మణుఁడు మంచి భోజనప్రియుఁడై యుండును.

హెలెన్—కాదు. ఆతఁడు పరమదార్శనికుఁడు. మనుజుని యుచ్ఛ్వాశ కంతము లేదని యతఁడు నిరూపించెను. తత్త్వజ్ఞానవేత్తయగు డయోజినిస్ మానవప్రయత్నాసపథమునకు విపరీతమగు దిక్కుగఁ జనెను. జీవనమునకు వలయువస్తుల నాతఁడు సాధ్యమగువఱకు దగ్గించివైచెను. ఆతఁ డొక నీటితొట్టియందు వాసముచేసెనని యెఱుంగుదురా! విశేషముగ వాయువన్యభక్షణమే ఆతఁ డభిలషించెనఁట.

సెల్యూ—ఆ తత్త్వజ్ఞానవేత్త ఒక గొప్ప శుంఠయై యుండును!

హెలెన్—శుంఠయందురా? ఆతఁడు శుంఠయనియేనా పీరవరుండైన సికిందరాతని దర్శింపఁబోయెను? "నేను భువనవిజయుండనగు సికిందరును. నీ వేమికోరినను యొసఁగఁగలను. వలయుదాని నడుగు" మని యులగ్జాండరు దార్శనికు నడిగెనఁట.

సెల్యూ—బాగుబాగు! వానిరొట్టె నేతిలోఁబడియుండును. ఏదో యొక గొప్ప జమీా నాతఁ డవశ్యముగ నడిగియుండును. జమీాతోఁగూడ నైదారుబిరుదుల నాతఁడు కోరకుండనుండడు.

హెలెన్—స్వార్థపరులైన దేశభక్తులే బిరుదుల నపేక్షింతురు. దార్శనికుఁ డట్టివాని నేమియుఁ గోరలేదు. "నా యాశ్వరుని కాంద్రమును వీడి నిలువంబడుము. ఇఁకేమియుఁ గోర" నని యాతఁడనెనఁట.

సెల్యూ—ఆతఁడొక యున్మాదుఁడని సికిందరు నిక్కముగఁ దలఁచి

యుండును.

హెలెన్—జనకా! సికిందరు సెల్యూకసుకాడు. ఆతఁడట్లు తలఁప లేదు. "నేను సికిందరుషాహాఁగానిచో డయోజినిస్ గాఁగోరి యుందు"నని యామహానీయుఁడనెనఁట.

సెల్యూ—ఓహోహో! "నేను సికిందరుని కానిచో" యనెనా? నిక్కముగ సికిందరు చతురుఁడు.

[నవ్వుచునవ్వుచు నిష్క్రమించును.]

హెలెన్—హా! మానవులారా!! పరులసుఖము వీక్షింపఁజాలరా? దూరమున నిలచి, తోడిమానవులఁ గలహమునకుఁ బురికొల్పుచు, నొకనిపై నొకండు కోఱచూడ్కుల నిగుడించుకొనుచు, భైరవములలీల పెడబొబ్బలు వెట్టుచుందురు! పర్వుపర్వున ముందునకు సాగి, యొండొరుల కుత్తుకలను కఱచుకొన వాంఛింతురు; కాని వెఱపుచేమాత్ర మట్లు కావింపఁజాలకుండిరి. సాగరసమేతముగ మేదినీవలయమునంత నొక్కగుటుకున గ్రసియింప మీఁర లంద అభిలషింతురు! జననీ! వసుంధరా! ఇట్టి రక్కసుల కీవు జన్మమేల యొసఁగితివి?—ఈశ్వరా! నీజఘన్యసృష్టిని మరలించి వైచుకొమ్మ!!—ఆద్యంతములు భ్రమాభూయిష్టములై యుండెను!!!

పంచమరంగము.

చంద్రకేతు గృహోద్యానము—సంధ్యాకాలము.

నదీతీరమున ఛాయ యేకాకినియై పచారిచేయుచుఁ బాడుచుండును.

గీతమాల.

అంబుజాతుని మధురగానంబు నభము
నంటి, శిహరితఁజేసి యాయవనిఁ బిదప;

హృదయద్వారముఁ జొచ్చి యిసన్నదిసెనిపుడు
పరగజాబిల్లిఁ గరమందుఁ బడయఁజూచి
వార్థిరత్నముఁ జేకొనువాంఛఁజూపి
ఆశశృంఖలబద్ధనై యార్తిఁగూలి
సాధుసద్గుణఖని యలసార్వభౌముఁ
జేరనుంకించుచుంటిని శీఘ్రముగను;
ప్రేమకాంక్షను నుంతైన వీడలేక
పట్టిభ్రమయందుఁబడుచు నేనిట్టులిఁకను
విరసజీవనయాత్రను జరుపమాని
సరసమృత్యువు వాంఛింతు ధరణివీడ.

(చంద్రగుప్తుఁడు ప్రవేశించును)

చం॥గు—కాంతా!

ఛాయ—ఎవరు? (వెనుకకుదిరిగి చూచి) ఓహో! మహారాజా!
స్వామీ! జోహారు.

చం॥గు—ఛాయా! నీయన్న యెచట!

ఛాయ—ఎఱుఁగను. చూచివత్తును.

(పోఁబోవును.)

చం॥గు—పోకుము. క్షోంచెమాగుము.

(ఛాయ వెనుకకు మరలి నిలువంబడి స్థిరనేత్రియై చంద్రగుప్తుని వీక్షించుచుండును.)

చం॥గు—హేమాంగీ! ప్రథమానంతరమున నిన్ను మరల గలసికొనలేదు.

(ఛాయ నీరవమైయుండును)

చం॥గు—నాయనువులఁ నీవు కాపాడినందులకు గృతజ్ఞతఁ బ్రికాశ మొనరించుటకు నాకుఁ దరుణము లభింపలేదు. బాలా! నీయొగ్గ

నే నెన్నఁడు మఱువఁజాలను.

ఛాయ—(అర్ధోచ్చారితస్వరమున) ఈమాత్రమునకేనా!—

చం॥గు—ప్రత్యుపకారస్వరూపంబుగ నీకు—

ఛాయ—మహారాజా! నాకేమియుఁ బ్రత్యుపకార మక్కఱలేదు. మేము హీనపార్వత్యజాతివారలము. మే ముపకారమును విక్రయ మొనరింపము. మహత్త్వవృత్తి వాణిజ్యము సలుపము. దేవర ప్రాణములఁ గాఁపాడఁగలిఁగితిని. ఆసౌభాగ్యమే నాకు యథేష్ట పురస్కారము. అంతకంటె నధిక మేమియు నపేక్షింపను.

చం॥గు—ఆహా! ఈకిశోరహృదయమందింత మహత్వమున్నదా? లేక—

ఛాయ—భూమీశా! శైశవమునుండి మేము మృగయ యొనరింప నభ్యసించితిమి. ఆలమొనరింప నేర్చితిమి. వంచన మేమో మే మెఱుఁగము. సభ్య, ద్వ్యర్థక భాషయందుఁ బ్రసంగింపనేర్చుకొన లేదు. దానంజేసి నేఁజెప్పినదానియం దొకేయర్థమున్నది. అందు "లేక" లేదు.

చం॥గు—ఛాయా! నీవొక ప్రహేలికవుసుమీ!

ఛాయ—(క్షణ మూరకొని) మహారాజా! నాకేమియుఁ బ్రత్యుప కారమువలదు.

[నిష్క్రమింపఁబోవును.]

చం॥గు—బాలా! పోకుము. నిన్నొకవిషయ మడిగెద. ఉపకార మాచరించి, వదంపడి యుపకృతునెడ నీవింత యుదాసీనవగుచుంటి వేల? నీవు చంద్రకేతుతోఁ బ్రసంగించుచుండ, నే నరుదెంచ, తోడనే తరలిపోవుచుందువు. నే నది పలుపర్యాయములు గుఱు తించితిని. కాంతా! నాపై నీకింత యుదాసీనభావమేల?

ఛాయ—(అస్ఫుటస్వరమున)—ఉదాసీనభావమందురా? (క్షణకా

లము నతముఖియై యుండి, పిదప నాకస్మికముగ) — రాజకంఠీరవా! తామెన్నఁడైన భూధరశిఖరమున నిలువంబడి ప్రభాకరోదయ ముపలక్షించితిరా? — దిగంతవితతవినాసపైనుండి వికంపితసూర్యరశ్మితరంగము మనోహరక్రీడల దేలుచు ముందునకుఁ బర్విడుతఱి అసమేమనముసులై ఆ యద్భుతదృశ్యము విలోకించితిరా?

చం॥గు — విలోకించితిని.

ఛాయ — మహారాజా! మాజీవనము తాదృశంబైనది. గిరిచూడపై నుజ్వలఘనశ్యామలత ఆవేగముసఁ గంపించుట సధిత్యకావాసి యెట్లు వీక్షింపఁగలఁడు?

చం॥గు — దానం జేసియే కాఁబోలు మేము నిమ్ము బాగుగ గుఱుతింపజాలకుంటిమి. అయినను, మీఘనశ్యామావరణముక్రింద హృదయ మున్నదని తలఁచుచుందుము.

ఛాయ — ఆహా! దేవరసౌజన్య మెట్టిది! కృష్ణకాయమని యుచ్చరింపక ఘనశ్యామావరణమని వచించుచుంటిరి. ప్రభూ! ధారాధరము కృష్ణవర్ణమై యున్నకొలఁది సలిలసంభారసమృద్ధమై తీవ్రవిద్యుత్క్షేలనభాస్వరవృత్తి సమన్వితమై తోఁచుట దేవర కనుఁగొంటిరా? మాకు హృదయ మున్నదనిమాత్రము తాము తలఁచితిరిగా? ఆ హృదయ మెంత విశాలమైనదో, అందెట్టి తరంగము క్రీడించుచున్నదో గ్రహింపఁజాలరైతిరా?

చం॥గు — అట్లా! — అట్టి ప్రేమయా? ఛాయా! నాయెడ ననురాగిణివై యుండఁగలవా?

ఛాయ — ఏల నుండఁజాలను? ఈశ్వరుఁడు మీ కాయములపై రెండు కుంచెల రంగెక్కుడుగ బూసెను. దానం జేసి అహంకారమున మీ పదములు మృత్తము సంటవు. 'నన్ను వలచితివా' యని

ప్రశ్నించుచుంటిరా?—వసుమతీశా! మిమ్ము వలచుట లేదు—సేవగించుచుంటిని. భికారిణిభంగి భగవదనురాగమును యాచించుచుంటినని తలంచుచుంటిరి కాఁబోలు! అనుకంపభరమునఁ దామునాకుఁ బ్రేమముష్టి నొసఁగుటయు డోసిలిఁ జాపి దాని నే స్వీకరించుటయునా! ఇంత గరువమా! ఇంత స్పర్థయా!! మహారాజా! నేను హీనురాలను! బర్బరజాత్యుద్భవను! కృష్ణవర్ణ కాయను! పార్వత్యరమణిని!—తామో మగధమహీపతులు! అమరవంద్యులు! రాజాధిరాజులు! అట్లయ్యు మీకు నేను రోఁతఁ జూపుచుంటిని!

(వేగముగ నిష్క్రమించును.

చం॥గు—అద్భుతము! ప్రాణరక్షణ మొనరించినదప ఘృణఁజూపుటయా! నిక్కముగ నారీ చరిత్ర మొక యపూర్వ ప్రహేలికము—బహు దినములకు బూర్వము సింధు సరిత్తీరమున, సికిందరు సాహాసమతము న సెల్యూకసు దుహితపఱపిన కృతజ్ఞతాపూర్వక సజల దృష్టి యిపుడు జ్ఞప్తికి వచ్చుచున్నది. అందు వ్యక్తమైనది ప్రణయమా లేక కృతజ్ఞతమాత్రమేనా? ఆహా! ఆ యవనాంగన యెట్టి యపూర్వసుందరి! మహానీరధినీలతోయరాశిపై నవతీర్ణంబగు యుషాద్యుతిమాడ్కి, రాశి రాశి రక్తజవకుసుమాభ్యంతరస్థ వికసిత స్థల పద్మముచాడ్పున ఆ యున్నులమిన్న యంద మెంత వింతగఁ దోఁచె! వలదు! వలదు!—చిత్తమా! ఆ యందముల ప్రోవుఁ దలంపకుము. ఆతలంపుచే నిన్ను నీవేల గాసిలఁ జేసికొందువు? అదొక మధురస్వప్నము!

(చంద్రకేతు ప్రవేశించును.)

చం॥గు—చంద్రకేతూ! రమ్ము!

చం॥కే—సుహృద్వరా! చాణక్యపండితుని యానకతన నేఁటి నిశీథ

మున భూతపూర్ణ మగధాధిపతి, బలి కావింపఁబడునఁట.

చం॥గు___(సవిస్మయమున)___ఏమి!, నందుఁడు బలి యగునా!___ చాణక్యుని యానకతనసనా! చాణక్యుఁ డాజ్ఞయిచ్చువాఁ డగుచో నే నెవండను? మగధయేలికనంచు జెప్పుకొనుచుంటినా! ఇంత శ్రమయు, యింతసన్నాహమును విప్రప్రభుత్వ హోమాగ్నియందు ఘృతము ధారవోయుటకా? చంద్రకేతూ___

చం॥ కే___ఏమి యనుమతి?

చం॥గు___విప్రదండాజ్ఞ నిపుడుల్లంఘింపవలయును. ఇవుడేనీకు క్షమాపత్రము లిఖించి యొసఁగుచుంటిని. దానిఁ గొని 'ఇది చంద్రగుప్త మహారాజు ముదలకాని ప్రార్థనకా'దని ఆ బాపనికిఁ దెల్పుము పొమ్ము.

(చంద్రకేతు నిష్క్రమించును.)

చం॥గు___నా కెట్టివార్త నంవక, నా యనుమతిఁ బడయక బ్రాహ్మణుఁ డెట్టి సాహసకృత్యమునకుఁ బూనెను! ఏమి ఆపాఱుని తలబిరుసు తనము!___ఆశ్చర్య మాశ్చర్యము! నే నీసామ్రాజ్యమున కేమియుఁ గాను కాఁబోలు! చాణక్యుఁడను జంత్రకానికరములందు నే నొక జంత్రపుబొమ్మను కాఁబోలు!

(ఛాయ మరలఁ బ్రవేశించును.)

ఛాయ___స్వామీ! క్షమింపుఁడు.

చం॥గు___కాంతా! నిన్ను క్షమించు టెందులకు?

ఛాయ—నేఁ గినిసి యపరాధ మొనరించితిని. ప్రభూ! మన్నింపుఁడు. మన్నింపనిచో దండింపుఁడు.

చం॥గు___నిన్ను మన్నించుటగాని దండించుటగాని యెందులకు! నీ వెట్టి యపరాధమును గావించియుండలేదు. నీవు నన్నేవగించినచో, ని యాంతరికభావమును వ్యక్తీకరించుటయందు దప్పేమున్నది?

ఛాయ___ఏవగింతునా ? ఏ పురుషోత్తముఁ డస్మజ్జాగ్రదవస్థయందు ధ్యానంబై తనరుచుండునో, యే యశస్తిలకుఁడు నిదురయందు స్వప్నమై వఱలుచుండునో, యేసుభావణుఁడు నా కిహలోక భాగ్యంబై, పరలోకస్వర్గంబై పరగుచుండునో, యే పవిత్రాత్ము దర్శనము తీర్థసేవసంకాశమో, యే యజాతశత్రువు యదర్శన మభిశాపసన్నిభమో, ఆ గుణగరిష్ఠు నేవగింతునా? అవనీశా! మిథ్య వచించితిని. కాని, యేవగింపఁజాలియే యుందుఁగాకని కోరుచుందును.

చం॥గు___తొయ్యలీ! న న్నేవగింపనేల? నే నేమి చేసితిని?

ఛాయ___ఏమి చేసితిరా!___ఏమి చేయలేదు? నా యాహారమందలి రుచిని, శయనమందలి నిద్రను, సర్వసమయములఁ జిత్తశాంతిని పోనాడవైచితిరి! నాచక్షుసమ్ముఖమునుండి తాము పృథ్వినంతయు లుప్త మొనరించివైచితిరి. అంతియే యననేల?___భవిష్యచ్చింత యందు నాయస్తిత్వము లీనమైపోయెను. నే నిపుడు నాకమదుంటినో లేక నరకమం దుంటినో యెఱుంగఁజాలకున్నాను. న న్నిట్టు లొనరించినను, "ఏమి చేసితి"నని యడుగుచుంటిరా? ఇంత నిష్ఠురమా?

(క్రందన మొనరించును.)

చం॥గు___మానినీ! అదేమట్లు వందురుచుంటివి ?

(ప్రేమపురస్సరముగ నామె కరముఁ బట్టుకొనును.

ఛాయ___నృపాలా! నన్ను స్పృశింపకుఁడు!___స్పృశింపకుఁడు! మీ స్పర్శచే నాయంగప్రత్యంగములందుఁ దడిత్ప్రవాహము ప్రవహించును! పాషాణముపైఁ బతితమగు కారిస్యపాత్రము వడువున నా మస్తిష్కము ఝణఝణమని శబ్దించును___ఇట్లేల___నే నీ యున్మాదనమును దమన మొనరించివైతును.

(దృపదమై నిష్క్రమించును.

చం॥గు—అబ్బురమబ్బురము! ఇంతకాలి మెవతెను శోదరి చాడ్పున ప్రేమించుచు వచ్చితినో ఆమెయే,—ఆశ్చర్య మాశ్చర్యము!

## షష్ఠరంగము

### చాణక్యుడు—ఆతని దేహరక్షకులు.

సమ్ముఖమున బందీయవస్థయందు నందుఁడు నిలచియుండును. పార్శ్వమున శాణితఖడ్గమును, నికటమున యూపకాష్ఠమును నుండును.

చాణక్య—భూతపూర్వమగధాధీశ్వరా! విప్రపతాప మంత మెుంద లేదని యిపుడు నీకుఁ దెల్లమాయెనా? ఈశ్వరుఁడు మూర్ఖుఁడు కాఁడు—దానంజేసియే ఆతఁడు మస్తిష్కమును బాహువులకుఁ బైనుంచెను. ఆర్యఋషీంద్రు లవివేకులు కారు—కావున నేవారలు విప్రులకు క్షత్రియులకంటె నుచ్చతరస్థాన మొసఁగిరి. అగ్రాసనాధి పులగు నయ్యవనీసురులను తమ యుచ్చపీఠములనుండి క్రిందికి నీడ్వ నేరికినిసాధ్యముకాదు. భారతభూమి యెంతకాలము భారత భూమియై యుండునో, యంతవఱకు బ్రాహ్మణుఁడే సంఘశాసన మొసరించును. అనంతర మొక్కమాటే సర్వము విలయధ్వంశము!

నంద—నీ దంభవాక్యములను వినిపించుటకా నన్నిత్తావునకు రావిం చితివి ?

చాణ—సరిగ నందులకు గాదు. అదిగో! ఖడ్గమునుచూచుచుంటివా? అల్లదె! నీకొఱకై తేఁబడిన యూపకాష్ఠమును వీక్షించుచుంటివా? ఇచట కీ వెందులకు రావింపఁబడితివో గ్రహించుట కిపుడుకూడ సందియ మున్నదా? భవద్రక్తరంజితకరద్వయముతో నా శిరోజ ములను ముడుచుకొందుననుచు నే నానాఁడు కావించిన ప్రతిజ్ఞ

జ్ఞప్తియందున్నదా? చూడుము యిదిగో నాశిఖ నింకను ముడుచుకొన లేదు—నిన్నిచటికేల రావించితినో యెఱుంగుట కింకను నీకు శంక యున్నదా?

నంద—బ్రాహ్మణా! నన్ను వధింతువా?

చాణక్య—అట్లని వేఱె వక్కాణింపవలెనా?

నంద—నిరస్త్రుండైన ఖైదిని హత్య గావింతువా? బ్రాహ్మణా!—నీ సనాతన ధర్మప్రబోధ మిదియా?

చాణ—అబ్బో! సనాతనధర్మ మర్మమును బ్రాహ్మణుఁడు నేఁడు క్షత్రియునికడ నేర్చుకొనవలెనా?—నందా! ఇది హత్యకాదు—మృత్యుదండనము! ఆకఠినశిక్షను విధించువాఁడను—విప్రుఁడను నేను!

నంద—ఏమి యపరాధ మొనరించితినని నీవట్టి కఠినశిక్ష విధించుచుంటివి?

చాణ—నీ వొనరించిన యపరాధ మొక్కటికాదు. కూళుఁడవై నీ వనేకాపరాధములఁ గావించితివి. బ్రహ్మహత్యాపరాధ మొక్కటి. బ్రాహ్మణసంపత్తి లుంఠన మొనరించు టింకొక యపరాధము. బ్రాహ్మణు నవమానించుట మఱొక యపరాధము. ఇన్ని యపరాధములఁ గావించిన దుష్టునికి దియె తగినశాస్తి! దీనిని నీవు హత్య యనుచుంటివి. కాని, యిది న్యాయవిచారమని నేఁ బల్కుచుంటిని. ఈన్యాయవిచారణ మొనరింపఁగల యధికారము నాకుఁ గలదు—నేను బ్రాహ్మణుండను. నందా! ఇఁక సిద్ధముకమ్ము. కింకరులారా! ఆదుర్మతిని యూపకాష్టముపై బడఁద్రోయుఁడు!!

నంద—చాణక్యా!—కాత్యాయనునకును, నీకును చాలదుర్ణయముఁ జూపితిని. నన్ను మన్నింపుము!

చాణ—(పెద్దనవ్వునవ్వి)—అక్షరక్షరములనంతయు సరిగ సరిపోయినది. నందా! భవిష్యమందొకప్పు డీభిక్షుకుని పదతలమునఁబడి

నీవు క్షమాపణ వేఁడుదువనియు, జేనాభిక్ష నొసఁగననియు నీతో నేనొకప్పుడు చెప్పియుండలేదా?

నంద—బ్రాహ్మణా! నేను ప్రాణభిక్ష నపేక్షింపను. నేను క్షత్రియ కులోద్భవుండను. బ్రాహ్మణ ప్రభుత్వమును విశ్వసింపను. శూద్రుని తృణీకరింతును. నాజనకుని యుంపుడుకత్తె కొమరుని నే నేవగింపకుండఁ నుండజాలను! నిర్భీకుఁడనై నాయుద్దేశ్యములఁ బ్రకాశ మొనరింతును. కాని నేను మృత్యువునకు వెఱచువాఁడనుకాను. నీక్రోధకంపితాంగములఁ గాంచి నేను బెగ్గిలఁజాలను. నీరక్తరాగాక్షులను నేఁదుచ్ఛముగ జూతును. కాని నిజకృతాన్యాయమును గుఱుతింతును! ప్రజలసంపత్తి లుంఠన మొనరించి, నరహత్యకుఁ బాల్పడఁ దొరఁకొనుటకు నేనంత పాషండుఁడనై యుండలేదు. సంగదోషము నన్నుఁ బాషండుఁ గావించివైచెను. క్షమింపుము—కాత్యాయనా!

కాత్యా—(కంపితస్వరమున)— నం-ద-మహా- రాజా ! నేనుక్షమించితిని.

చాణక్య—కాత్యాయనా! జాగ్రత!!—క్షమయనున దేమియు లేదు. పృథ్వియందెరును యేరికిని క్షమఁజూపరు—చూపఁజాలరు. హృదయాంతరాళమున సలసలమని పొంగు ఘోరయాతనాతైలము దైనికమగు నీ యశ్రుబిందువులచేఁ జల్లవడునా? అసంభవము! క్షమయంతయు మాఖికము. అనుతాపము మాఖికమగులాగున క్షమకూడ మాఖికమే! సమ్ముఖమున శిక్షను కాంచక యేరికైనను తాపము కలుఁగుట నేనెన్నఁడు జూచి యుండలేదు. ఛిన్నవిచ్ఛిన్నమైన చిత్త మెట్టి క్షమకతననైన మఱలఁ దొంటియట్లు నాటుకొని యేకఫలకమగుట నేనెన్నండు వీక్షించియుండలేదు. అ దట్టులగుట యసాధ్యము!

కాత్యా—కాని—నందుఁడు—బాలకుఁడు!

చాణ—బాలకుఁడైనవాఁడు బాలకునివలె నుండు టుచితము. అజ్ఞానముకతన బాలికుఁ డింగలమందుఁ గరముంచిన, చిన్నవాఁడని యనలము వానిని కాల్పకుండునా? అగ్ని తనపనిఁ దాఁగావించుటకు సంశయించునా?

కాత్యా—అయినను—పాణిని—

చాణక్య—(నేలపై పాదమును గట్టిగఁ దన్ని)—మరల పాణిని యనుచుంటివా? కాత్యాయనా! ఇత్తఱి నీవు మరల పాణిని పేరెత్తిన్నచో, నిన్ను హత్య గావించివైతును.

కాత్యా—నందుఁడు పిన్నవయసువాఁడు—

చాణ—అట్లని నీవు చెప్పనక్కఱలేదు! ఆపిన్నవయసు వాఁడెదుటఁ గనఁబడుచునే యున్నాఁడు! కాత్యాయనా! ఇఁకఁ గాలహరణ మాచరింపక కరవాలము గైకొమ్ము. నీవే యీతనిఁ దుదముట్టింపవలయును. నీకరములందే యీతఁ డంత మొందవలెను!

కాత్యా—నాకరములందేనా?

చాణ—అవును నీకరములందే! పుత్రహత్యకుఁ బగఁదీర్చుకొమ్ము. నీయెద్దురు ముద్దుబిడ్డల శీర్ణాయమానపాండురమూర్తులను జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. ఆపసిబాలుర నిష్ప్రభాయమానదృష్టిని స్మరించుకొమ్ము. ఆహారార్థమై వారలు సలిపిన క్షీణ హాహాకారము నొకపరి తలంపునకుఁ దెచ్చుకొమ్ము. నీకుఁ బ్రాణతుల్యులైన ఆ లేఁబ్రాయపు పుత్త్రులు తునకకు హిమంబుచొప్పునఁ జల్లవడి, కాష్ఠంబు కరణి కఠినకాయులై, పడియుండ వారల నిర్నిమేష చక్షుర్ద్వయముపై మృత్యుకరాళముద్రాంకనము నీ యక్షిసమక్షమునఁ దోఁచుట నొకమాఱు స్మరణకుఁ దెచ్చుకొమ్ము! ఆదుస్సహదుఃఖజనక దృశ్యమిపుడు నీనేత్రమునకుఁ గట్టినట్లు కానం

బహుచుండుట లేదా? వారి వేడినిట్టూర్పుల, వారి కడసారి వీడుకోలు నింతలోనే మఱచితివా? కడుపుశోకముచేఁ బొక్కి పొక్కి యిపు డీతని మృషావిషయముఁగాంచి, "ప్రతిహింసఁ గావింపు" మని మృతులుపలికిన వేడికోలును విస్మృతియందు ముంచివైచి, చేతికిఁజిక్కిన చెనటిని నీవు విడువఁగలఁచుచుంటివా? కాత్యాయనా! నీవు పురుషుండవుసుమా! స్వహస్తములతో నీ పిఘాతకుని దారుణకృత్యమునకుఁ దగు విధమునఁ గసిదీర్చుకొమ్ము! అందుల కిదియే తగినయదను!!

[కాత్యాయనుఁడు ఖడ్గముఁ దీసికొనును.]

చాణక్య—ఇఁక విలంబమేల?—కింకరులారా! (బలికాష్ఠముఁజూపి) చూచెదరేమి? పడవేయుఁడు!

[భృత్యులు నందుని యూపకాష్ఠమందుఁ బడవైతురు]

చాణ—అస్తైన, నందమహారాజా! యిఁక సిద్ధపడుము!—కాత్యాయనా! నీపని కానిమ్ము!!

[ఖడ్గహస్తుఁడై కాత్యాయనుఁడు యూపకాష్ఠ నికటమున కరుగును.]

చాణ—నందమహారాజా! ఇది విప్రోచిత కార్యము కాదు. కాని, యేమి చేతును? నేఁడు దానిని కావింపవలసివచ్చెను. ఈ నాఁటి బ్రాహ్మణునకు ఆ కాలపు తపోబలంబు లేదు. ద్వితీయ జామదగ్ని చందమున నేఁడు భారతవర్షమును నిక్షత్రియ మొనరింపవలెనని యభిలషింతును. కపిలుని కరణి నొక్క క్రుద్ధదృష్టిపాతముచే నందవంశమును భస్మమొనరింప వాంఛించుచుంటిని. కాని, కలియుగమున నది సాధ్యముకాదు. దానంజేసి యిపుడు ఖడ్గసహాయముఁ గొనవలసివచ్చుచుండెను. కలుష భూయిష్ఠమైన యీ కలియుగమందుఁగూడ భారతవర్షమొక మాఱు బ్రాహ్మణప్రతాపముఁ గాంచుగాక! (కాత్యాయను నుద్దేశించి)—వధింపుము!

ఓ! ఉండుము!—నందా! చచ్చుటకు ముందొకమాఱిది విని మఱీ చనిపొమ్ము. నీవంశమందు దీపము వెల్గించువారిం కెవరును లేరు. నందా! నందవంశము నీతో నిర్మూలమగుచున్నది!

[నందుఁడార్తనాదముఁ గావించును]

చాణ—కాత్యాయనా! ఇంకఁ గానిమ్ము!

[అతివేగముగఁ జంద్రకేతు ప్రవేశించును]

చం॥ కే—బ్రాహ్మణా! జాగ్రత!! కత్తి దింపుము!!!

చాణ—ఏల!

చం॥ కే—రాజాజ్ఞ!

[కాత్యాయనుఁడు ఖడ్గము దింపును.]

చాణ—చంద్రకేతూ! దీనియర్థ మేమి?

చం॥ కే—ఇదిగో! చంద్రగుప్తమహారాజు క్షమాపత్రము. మహారాజు తమ్ముని ముక్తుఁ గావించివైచెను. ఇది తేనియాజ్ఞ!

చాణ—ఓహో! ఇది తేనియాజ్ఞయా?—తెలిసినది కాని, చంద్రకేతూ! యీయాజ్ఞ నాకొఱకు కాదు! నాకడ నిది పనిచేయదు! [కాత్యాయను నుద్దేశించి]—వధింపుము!

చం॥ కే—గురుదేవా! ఇది రాజాజ్ఞ!!

చాణ—అది రాజాజ్ఞ యగుచో, యిది బ్రాహ్మణాజ్ఞ!—కాత్యాయనా! వధింపుము!!

చం॥ కే—అట్లైన మహారాజునే స్వయముగ నిత్తావునకు రానిండు. ఆతని రాకకు మున్నె నే నీవధఁ గావింపనీయను. రాజాజ్ఞఁ బాలన మొనరింతును. నాకర్తవ్యమును నేను కావింతును—లెంకలారా! దూరముగఁ దొలఁగుఁడు.

చాణ—వలదు! తొలఁగకుఁడు!!—నిలువంబడుఁడు!!!

చం॥ కే—వీరబలా!

[సైన్యాధ్యక్షుఁడైన వీరబలుఁడేగుతు సైనికులతోఁ బ్రవేశించును]

చం॥ కే—సైనికులారా! నేఁడు వచ్చువఱకు, యీనాకై దిని రక్షింపుఁడు. వీరబలా! నీవుపోయి నేనిక్కిదంతయుఁ దెలిపిరమ్ము.

[వీరబలుఁడు నిష్క్రమించును.]

చాణ—కాత్యాయనా! కరమందుఁ గరవాల మిడుకొని వెత్తివాని వలె వెడగుచూడ్కుల నిగుడించుచు నిలువఁబడి యుంటి వేల? నీవు మృణ్మూర్తివా యేమి?— చేతకానిచో కృపాణము నా కొసఁగుము. [ముందునకు రా నుద్యమించును].

చం॥ కే—[చాణక్యుని సమ్ముఖమున కరిగి నతజానువుౖయె తరవారితోఁ బథరోధ మొనరించి]—భూసురుని మ్రోల నేను నతజానువునగు చుంటిని. అట్లొనర్చుచునే రాజాజ్ఞనుపాలన మొనరింతును!

చాణ—కాత్యాయనా! వధింపుము!!

కాత్యాయనుఁడు ఖడ్గమెత్తగనే చంద్రకేతు రాజాజ్ఞ నాతనికిఁ జూపి—"ఇది రాజాజ్ఞ సుమీ!" యనును. కాత్యాయనుఁడు కరవాలము దింపును.

చాణక్య—కాత్యాయనా! శంకింపకుము. ఇది చింతింపఁదగు సమయము కాదు. యోచనసేయవలయు యక్కఱ మాత్రమే మున్నది? చంద్రగుప్తుని సింహాసనాసీనుఁ గావింపఁ గలిగిన ధరామరుఁడే ఆతని సింహాసనచ్యుతుఁ జేయ సమర్థుండని యెఱుంగుము.—ఇఁకఁ జూడకుము! వధింపుము!

కాత్యాయనుఁడు ఖడ్గమెత్త నుద్యమింప చంద్రకేతు గంభీర స్వరమున "బ్రాహ్మణా! జాగ్రత! ఇత్తఱి బ్రహ్మహత్యకు దలఁ పడవలెనన్నను, వెనుదీయను" అని పల్కును.

[మందిరము నుండి వేగముగ మురఁ బ్రవేశించును.]

ముర—మఱి నారీ హత్యకుఁ దలఁపడవలెనన్న నేమి సేతువు?

[ఇట్లని యామె కాత్యాయన-చంద్రకేతులకు నడుమ నిలువంబడును.]

చం॥ కే—(స్తంభితుఁడై)—అమ్మా! మీరా!!

ముర—అవును నేనే! నాయాజ్ఞ నోదలఁ దాల్పుము. వధింపుము.

చం॥ కే—జననీ! ఈదీనుని క్షమింపుఁడు.

ముర—(సవ్యంగహాసన మొనరించి)—క్షమయా! క్షమించు దానను నేనా!!—యువకుఁడా! నేను క్షమింపఁజాలను. క్షమించుటేమో నే నెఱుఁగను. నేను శూద్రనారిని! క్షమయనునది బ్రాహ్మణధర్మము—శూద్రధర్మము కాదు.

చం॥ కే—అమ్మా! క్షమమనుష్యధర్మము—ఒక్క బ్రాహ్మణధర్మము మాత్రమే కాదు. క్షమాదాన జనిత యపారసుఖ మొక్క విప్రుల యధికారమేనా? క్షమ స్వర్గమునుండి భాగీరథీ పవిత్రాంబువవలె నిలాతలమున నవతరణ మొనరించెను. అది నిజకల్లోలినీపుణ్యతరంగములందు స్నాతులై పవిత్రులగుట కందఱ కధికారము కలదు. అంతరిక్షమునుండి యీశ్వరక్షమ శతధారలుగ మర్త్యభూమిపై బడుచుండుట మనము వీక్షించుచుండుట లేదా? రోగమందు క్షమ స్వస్థ్యరూపిణియై యరుదెంచి మనల రక్షించును; శోకమందది విస్మృతిఁ గొని వచ్చును; దారిద్ర్యము నాక్షమయే సహిష్ణుతావర్మచేఁ గప్పియుంచును. శైశవమందు మాత బిడ్డ శతాపరాధములను క్షమింపకున్న యెడల, ఆశిశువు పెఱిగి పెద్దకాఁ గలుఁగునా?—మాతా! కరుణాళువవై క్షమాభిక్షఁ బ్రసాదింపుము. ఇటువంటి యుత్కృష్టదానమిం కొకటి లేదు. నతజానువునై నే నాదానమును వేఁడుచుంటిని.

[నతజానువు యగును.]

ముర—చంద్రకేతూ! నీ వొకరుఁడవే ఆభిక్ష వేఁడుచుంటివా? హృదయపంజరద్వారమును భేదించి వెలుపలి కరుదెంచి, అన్న

చర్చణ ద్వంద్వమును గట్టిగఁ బట్టుకొని నా ప్రాణము క్షమాభిక్ష వేఁడుచుండుటలేదా? బంధితుఁడై అచ్చోఁబడియున్న నంనుని దురవస్థఁ గాంచినంతనే, ఆనిర్భాగ్యుని మ్లానముఖమును వీక్షించి నంతనే, 'బాష్పబిందువు లీవలి కుబికివచ్చి నాదృక్పథమును పూర్తిగ రుద్ధమొనరించి వైచుటలేదా!—(క్షణమూరకుని మరల క్రోధాన్వితయై)—నందా! శూద్రవనితదుగ్ధము క్షత్రియాంగన దుగ్ధముకంటెఁ దక్కువ మధురమైనదా? శూద్రనారి ప్రేమ క్షత్రియకాంత ప్రణయముకంటెఁ దక్కువ శుభ్రమైనదా? నిన్ను విడువనేల?—నేను క్షమింపను. నేను శూ ద్ర వ ని త ను!— 'ఉంపుడు క త్తెను'!—(కాత్యాయను నుద్దేశించి)—వధింపుము! త్వరపడుము!! త్వరపడుము!!!

చం॥ కే—జననీ!—ఇది రాజాజ్ఞ!!

ముర—ఇది రాజమాతాజ్ఞ! నేను దాసినయ్యు, చంద్రగుప్త మహా రాజు జనయిత్రిని! సంశయింపక నాయాన నిప్పుడే పాలింపుము. ఇది తీవ్రాజ్ఞయని యెఱుంగుము!—వధింపుము!

చం॥ కే—ఆహా!—ఇందుఁ—బరాజయము—ఘటిల్లె! ఈమె కడ నేను బరాజితుఁడనై తిని!! హా! విధి!! (మురపదతలమందుఁ దరవారినుంచుచు)—జననీ! స్త్రీ కేశాగ్రము స్పృశింపఁగల సాహసము నాకు లేదు.—అది యసాధ్యము!

చాణ—కాత్యాయనా! ఇఁకఁ జూడకుము!! వధింపుము! వధింపు ము!! ఖడ్గ మెత్తుము!!

[కాత్యాయనుని ఖడ్గము చివాలున పడును! నందుని దేహము నుండి మస్తకము విచ్ఛిన్నమగును!! రుధిరస్రవంతి వడివడిగఁ బాఱదొడఁగును.

చాణక్య—హా! హా!!—[పెద్దనవ్వు]—ప్రతిహింసపూర్ణమాయెను!

ప్రతిహింసపూర్ణమాయెను-!!

నందుని రక్తమందు నిజకరములను ముంచి, రుధిరసిక్తాంగుళులచే శిఖముడి వైచుకొని నిష్క్రమించును.

కాత్యా——(నందుని ఛిన్నమస్తకమును లేవనెత్తి)——ఏడ్గురు బిడ్డల హత్య కిది ప్రతీకారము!

ముర——ఏమిచేసితివి? ఏమిచేసితివి?——వధించితివా?—— అయ్యో! ఏమిపని చేసితిని? రక్షింపనరుదెంచి——ఓః!

[చేతులతో ముఖమును మూసి వైచుకొనును]

(చంద్రగుప్తుఁడు ప్రవేశించును)

చం॥గు——(నందుని యుత్తమాంగమును చూచి, సభయమున వెనుకంజవైచి)——ఇదేమి!!!

ముర——వీరు——నందుని——వధించిరి! ఈ నోటనే స్తన్యమొసఁగితిని. ఈ కాయమును నా ఱొమ్మునానాని, ఆలింగన మాచరించుకొని పరుండుదానను!——అయ్యో! ఏమిచేసితిని!! ఏమిచేసితిని!!!
వత్సా! చంద్రగుప్తా!!——(ముఖమును వెనుకకుఁ ద్రిప్పుకొనును)

చం॥గు——నాతమ్ము నెవరు వధించిరి?

కాత్యా——నేను!

చం॥గు——ఎవరి యాజ్ఞవలన?

ముర——వత్సా! నీ తల్లియాజ్ఞవలననే!!——(కాత్యాయనునుద్దేశించి) బ్రాహ్మణుఁడా! నేను నారిని,——మూర్ఖురాలను, దుర్బలను, జ్ఞానహీనను!——కాని,——అయ్యో!——నీ వేమి కావించితివి? బ్రాహ్మణుఁడా! ఎన్నిమాఱు లీవు యీ ముఖమును చుంబింపలేదు! ఇప్పుడెట్టి పైశాచికోల్లాసమున నీ ఛిన్నమస్తకమును కరమునఁబూని నిలువఁబడి యుంటివి!!

కాత్యాయనుని కరమునుండి నందుని మస్తకము చివాలున

నేలపైఁ గూలును.

చం॥గు—బ్రాహ్మణా! నీవు రాజాజ్ఞఁ ద్రోసివైచితివా?

కాత్యా—త్రోసి వైచితిని.

చం॥గు—బ్రాహ్మణుఁ డవధ్యుఁడు. నీ యట్టి కట్టిడి నా రాజ్యమందుండఁ దగఁడు. ఇప్పుడే నిన్ను నిర్వాసితుఁ గావించి వైచితిని. పొమ్ము. నీ విఁక నిందుండకుము!

కాత్యా—మహారాజా!—

చం॥గు—నే నిఁకేమియు వినఁ దలఁచుకొనలేదు. నాయాన బిచ్చకుని వేడి కోలు కాదని నే నిఁకెల్లఱకుఁ దెల్లము చేయుదును. పాఱుఁడా! నీకుఁదగు శాస్తియిదియే!! పొమ్ము!

కాత్యాయనుఁడు మఱేమియుఁ బలుకక నిష్క్రమించును.

చం॥గు—చంద్రకేతూ—(ఏదియో యనఁబోవును)

చం॥కే—మహారాజా! వసుమతీ వలయమునఁ బేరువడసిన కోటి మొక్కలీడులు శోణితముక్త తరవారులఁ గేలలఁ బూని రాజాజ్ఞఁ బాలించు తఱి తనవిపక్షమున నిలువంబడినను, అయ్యాజ్ఞాపాలనార్థము చంద్రకేతు నిజప్రాణముల నర్పించుటకు శంకింపకుండెడివాఁడు! కాని, ప్రభూ!—(ఖిన్నవదనుఁడై)—నారికడ శిశువుకంటెఁ గూడ దుర్బలుఁడ నగుడు నందుని రక్షింపఁజాలనైతిని!

చం॥గు—అమ్మా! తమ్ముని—

ముర—వత్సా! నా యపరాధమునకుఁ దగుశాస్తి నొసఁగుము!!

చం॥గు—(నతజానువుడై కరముల జోడించి)—అమ్మా! అపరాధమందువా? తనయునికడ తల్లి యపరాధమా?—ఏమి కావించినను, అశ్రాంతమీవు నా సమక్షమున మాతృదేవివై తనరారుచుందువు—"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసి" అని బుధులు వచింపరే? మాతా!—విధీ!!—తమ్ముఁడా!!!

ఒకహస్తమును నిహతుఁడైన నందునివైపుగఁ బ్రసారితమొనరించి, రెండవకరముచే నిజాక్షుల మూసివైచుకొని నిలువఁబడును!



# చంద్రగుప్త

## చతుర్థాంకము

### ప్రథమరంగము

చాణక్యుని కుటీరము—గోధూళిసమయము.

చాణక్యుఁడేకాకియై యుండును.

చాణ—ప్రతిహింసపూర్ణమాయెను! కాని, అది క్షణికోన్మాదనము. మరల బూర్వావసాదమే! వెలుపలివాద్యము విరమించెను!— మరల నెడదయందుఁ బూర్వమువలె హాహాకారము వినంబడు చున్నది. అగాధప్రణయరాశి నేరిపై నిడుటకుఁ దగుపాత్ర కానం బడుటలేదు. హృదయకంపితాగ్రహమున నేరినో యొమ్మునఁ జేర్చుకొని, బిగ్గ కౌగిలించుకొన వాంఛించుచుంటిని. కాని, ఆ వ్యగ్రాలింగనము నిజోష్ణనిశ్వాసమును వక్షమందదడంచి వైచు కొనుచుండెను!—రక్కసీ! ఏమిచేసితివి!!—ఆహా! ఇది యరణ్య రోదనము మాత్రమే! కపాలకరాఘాతంబే!!

[మెల్లగఁ బచారిచేయుఁ దొడంగును.]

(ప్రథమగూఢచారుఁడు ప్రవేశించును).

చాణ—కరటకా! వార్తలేమి?

కర—ప్రభూ! కాత్యాయనుఁడు శత్రుశిబిరమునఁ జొచ్చుట నిక్కమే!

చాణ—ఇఁకేమి?

కర—యవనులు సింధుస్రవంతిని దాటిరి.

చాణ—సైన్యమెంత?

కర—నాలుఁగులక్షలు.

చాణ—మంచిది పొమ్ము.

(గూఢచారుఁడు నిష్క్రమించును)

చాణక్య—కాత్యాయనా! నీ బ్రదుకెన్నఁడో కేవిధంబున వెల్లుచున్నది! రాజ్యమునుండి తరుమఁబడి అధ్యాపనవృత్తి నవలంబింప నిశ్చయించి, పదంపడి జడమతివై, సెల్యూకను వంచిన వైపున కట్టె వంగిపోతివి! నిర్వాసితావమానమునకుఁ దోడొక యీను నీ మనసును నొవ్వఁ జేయుచుండెను! నా మంత్రిత్వమే నీ యీర్ష్యకు హేతువు!—నీవు వట్టి మూర్ఖుఁడవు!!

[రెండవ గూఢచారుఁడు ప్రవేశించును]

చాణ—వలాహకా! వార్తలేమి?

వలా—విద్రోహులందఱు దళబద్ధులై యుండిరి. తురీధ్వనిముమ్మాఱు వినంబడగనే వారలందఱొక్క మాఱొక్కచోఁ గూడుదురు. ఆ రవమే వారి సంకేతము.

చాణ—మఱేమి?

వలా—ఇరువదియేగురు ఘాతకులు మహారాజు శయనమందిరములోని కొక నేలసొరంగముఁ ద్రవ్వి వధార్థమై అందుఁ బొంచియుండిరి.

చాణ—ఆవార్త ముందే వింటిని. హంతకనాయకుఁ డెవరుఁ?

వలా—వాచాలుఁడు!

చాణ—మంచిది పొమ్ము.

(గూఢచారుఁడు నిష్క్రమించును.)

చాణక్య—దళపతివాచాలుఁడఁట! వాచాలా! నీవతిమూర్ఖుఁడవు! చాణక్యునితో నీవు చాలుదువా? నీగోయి నీవే త్రవ్వుకొనుచుంటివి!—వీరబలా!

(సైన్యాధ్యక్షుఁడగు వీరబలుఁడు ప్రవేశించును.)

వీర—స్వామీ! ఏమియాజ్ఞ?

చాణక్య—చంద్రగుప్తుని శయ్యాగారములోనికి లోతైన సొరంగము ఖననమొనరించి, హాననక్రియా తత్పరులైన హంతకు లిరువది యైదుగురుఁడు తేని వధింపఁబొంచియుండిరఁట. దిట్టరులైన సైనికులఁ గొందఱఁ దోడుకొని ఆఘాతకుల నందఱను పరిమార్చి రమ్ము!

వీర—చిత్తముస్వామీ!

చాణ—ఇఁకఁ దడవుసేయక బిఱానఁబొమ్ము.

వీర—మహాప్రభూ! చిత్తము!

చాణక్య—వార్తలఁ జౌర్యమొనరించు వృత్తి నిక్కముగ మిగుల జమత్కారమైనది! అది చాణక్యుని సృష్టి! శ్రీరామచంద్రుఁడు కూడ గూఢచారుల నుంచుట నిక్కమే. కాని తన్నుగూర్చి ప్రజలనుకొనుచుండు నుడువుల నెఱుఁగుటకొఱకే వారల నాతఁడేర్పఱచుచుండువాఁడు. నేనో,—కుత్సితుల కంఠములను రుద్ధమొనరించివైచుటకు వేగుల నియోగింతును!

(చంద్రకేతు ప్రవేశించును)

చం॥ కే—గురువర్యా! జోహారు. నన్నిటకు రావించిన పనియేమి?

చాణ—దాక్షిణాత్య విజయానంతరమునఁ జంద్రగుప్తుఁడు మగధసీమకు మగుడివచ్చును. నేఁటి నిశీధిని బ్రోలుఁజేరుననువార్త వింటివా?

చం॥ కే—చిత్తము. నగరునందుత్సాహసన్నాహములఁ గావింపుమని యాతఁడు నాకు ముదలనంపెను.

చాణ—ఆముదలను పాలించితివా?

చం॥ కే—తేని యభిమతమును నగరునఁ జాటఁబనిచితిని. వీడంతయు నిఁక వేడుకలతో వెల్లివిరియును. ప్రోలంతయు నాలోకితమగును.

గృహముల శంఖాధ్వనుల్ఘు బోరుకలంగును. పథము లన్ని యు జయజయధ్వానములతో ముఖరితములగును. మందిర—

చాణ—చాలు నిఁకఁ గట్టిపెట్టుము. ఇదంతయు వ్యర్థయత్నము—ఏమనఁ?—అట్లు తేఱిచూచుచుంటి వేల? ఇఁకఁబో్యి యుత్సవముల నన్నిఁటి నుడిపివైచిరమ్ము! పొమ్ము!!

చం॥ కే—గురుదేవా! ఇట్లాజ్ఞాపించుచుంటి రేల?

చాణ—ఏలనో నీవు ప్రశ్నింపనేల? ఇఁకఁ బ్రసంగింపక వెడలిపొమ్ము!

[చంద్రకేతు సంకోచభావమున నిష్క్రమించును.]

చాణ—ఒక మహాపవిత్రోజ్జ్వల రాజ్యమువీడి యెందకుగుచుంటిని? చాలదూరము సాగివచ్చితిని!— కాని, యిపుడుకూడ తద్రాజ్యాలోకమండిత శిఖరము దృక్పథమున బడుచున్నది. దిగంతము లన్నియు గాఢతిమిరావృతములుకాక మున్న, నేనేల మరలు చుండుట లేదు? ఓసీ! పిశాచీ! విడిచిపెట్టుము. మరలిపోదును—కాదు! కాదు!! ఎచటికి మరలిపోదును? నాకేలుబూని నన్నెవరుకొనిపో దురు? మిథ్య, ప్రవంచన, చౌర్యము, హత్యమాత్ర మొకసీమకుఁ జెందలేదా? వానికిఁగూడ నొక ప్రకాండరాజ్యము లేదా? ఇఁకఁ జింతింపనేల? నాకు లోటేమికలదు? బాగుగనే యుంటిఁగదా!—బలే! ఏమిచమత్కారము!!—[దీర్ఘనిశ్వాసము]—రాత్రియెంత? —చూచెదఁగాక!

చాణక్యుఁడు గవాక్షద్వారమును తెఱచును. తోడనే పూర్ణసుధాంశు జ్యోత్స్నతరంగ పరంపర లాయాగార మును సొచ్చును. చాణక్యుఁడు వేనుకకు రెండంజలువైచి యిట్లనును! "మరల నిదేమి? ఇదెంతదను కెందుండెను? రాశిరాశులుగ సౌందర్యమెంతయో నిమ్నమందును, నికటమందును, దూరమందును, దిగ్దిగంతములందును నిండియున్నది! ఇట్టి సౌందర్యల

హారిని బహుదినములనుండి క్షోభించెనైతి. ఆహా! ఎట్టి సౌందర్యాలోకము! లఘుశుభ్రకాదంబినీ మాలికలు విహాయసాంభోధీ వీచికలపై నల్లనల్లనఁ దేలియాడుచుండెను.—అన్నభగవిమ్న మునఁ గౌముదీస్నాతయగు దివిజకల్లోలిని, కలస్వనమున గానము నలుపుచుఁ బ్లావితమగుచుండెను.—ఆహా! ఆర్ఘురీమతల్లి యెంతసుందరముగ నుండెను!—అమ్మా! భాగీరథీ! పతితపావనీ! సురధునీ! భగీరథుఁ డెట్టి పుణ్యబలమున నిన్ను—స్వర్గ మందాకినివగు నిన్ను—మర్త్యలోకమునకుఁ గొనివచ్చెనుతల్లీ! అమ్మా! నాయీ మరుహృదయమందుఁగూడఁ దద్భక్త్యచ్ఛావన మొకమా ఱుత్పన్న మొనరింపుము. అల్లనల్లనఁ బడుచు లేచుచు మెదకు హాయిఁ గొలుపు తవతరంగస్వాదుతాళముల ననుకరించుచు "అమ్మా! అమ్మా!!" యని చిత్తమలర, నొకపరి నృత్య మొనరింతును—ఇదేమి! చాణక్యా!! నీపధీరుండవగుచుంటివి!!!—వలదు! వలదు!!—ఇఁకఁ జూడవలదు!!!

(ఇట్లని చాణక్యుఁడు గవాక్షమును రుద్ధమొనరించును)

అత్తఱి నేపథ్యమున బాలికాస్వరమున నెవరో "జయము! జయము!! బాబయ్యా! పిడికెడు భిక్షఁ బెట్టుఁడు" అని కేకవైచును.

చాణక్యుఁడు ఆకస్మికముగ ముందునకుఱికి నిలువంబడి—"ఎవరు?—ఎవరిస్వరము? లోపలికి రమ్ము"

(భిక్షుకుఁడు, భిక్షుకబాలిక ప్రవేశింతురు)

చాణ—(దీర్ఘనిశ్వాసము విడచి) భిక్షుకులా?

భిక్షు—బాబూ! పిడికెడుబిచ్చము పెట్టుడి.

చాణక్యుఁడు బాలికను తేఱిచూచి,—"తాతా! ఇంతరాత్రి వేళ భిక్షకై బయల్వెడలితివేల?" అని భిక్షుకునడుగును.

భిక్షుకు—ఇంతకుముందే యీయూరు జేరితిమి. బాబయ్యా! దిన

మంతయు కూడులేక మాడితిమి !

బాలిక—బాబయ్యా! దినమంతయు కూడులేక మాడితిమి !

చాణ—ఇదేమి !—నాహృదయము నీరై పోవుచుండెను!! బలంబుగ దుఃఖ మాబికివచ్చుచుండెనేల? (బాలికను సంబోధించి) అమ్మా! ఈవైపునకు రమ్మా.

(వెంటనే బాలిక చాణక్యుని మ్రోల కరిగి నిలువబడును)

చాణక్యుఁడు బాలికమస్తకమును వ్రేళ్ళతో మెల్లగ దువ్వుచు— "బిచ్చకా! ఈపిల్ల నీపిల్లయేనా?" అని భిక్షుకుఁ బ్రశ్నించును.

భిక్షకు—నాపిల్లయే బాబయ్యా! నిజముగా నాపిల్లయే బాబయ్యా!!

చాణ—(దీర్ఘనిశ్వాసము విడి)—అమ్మా! నీపేరేమి?

బాలిక—మాధు—

చాణ—మీదేయూరు?

బాలిక—చాలదూరము. కాదు బాబయ్యా! మాకు ఊరేమియు లేదు. ఒకొ్కకపుడు సత్రములోను, మఱొక్కకపుడు చెట్టుక్రిందను నుందుము.

చాణ—అమ్మా! నీవు పాడఁగలవా?

భిక్షకు—పాడలేకేమండి బాబయ్యా—పాడమ్మా మాధూ!

చాణ—ముందు పట్టెడన్నము తినుడు. కొంచెము సేదదీరినపిదప—

భిక్షక—బాబయ్యా! మాకేమియు కష్టములేదు. మావృత్తే యిది. అమ్మా! పాడుము.

(ఇరువురు కలసిపాడుదురు)

గీతమాల.

ఘనతమనవసనావృత కాయయామె
నవని; జలధిగర్జించె మహారవమున
తరణి చనుచుండె సంద్రపు తరగలందు

యాత్రజనువారు తమ స్వాదు గాత్రములను
బాడుచుండిరి గాధలు, పరవశులయి
ఝుంఝుగర్జన భేదించి చయ్యన నల
గానినదము చేరెనుగగనవీధి
మాతృహీన ! దీనసుత ! నీపితృఁజూడ
లెమ్ము పర్యంకమునువీడి నెమ్మిమీఱ
తమము నిలునఁండి వయిళంబ దరిమితల్లి !
చూడుమదె! యలగిరివరచూడపైని
దోఁచుచుండె వనాన నత్యుగ్రమగుచు
అశనిపడుచుండె నదె! వేగ నవనిపైని
హా! ఇదేమి !! కుటీర మీరేయిముక్త
ద్వారమైయుండె! దివ్వెనిర్వాణమాయె
అంధకారమునిండె గేహంబునందు
శూన్యమైపోయె నిపుడు నాకన్యశయ్య
నబ్ధమైయుండె యేలొకో సదనమంత
"అమ్మ! అమ్మా" యని వెడలు ఆర్తరవము
చదలమును జేరి, ఈశ్వరచరణములను
పట్టి క్రందనమొనరించి యట్టెపడియె
వజ్రపతనముచాడ్పున వసుధమీఁద.

చాణక్య—(తనలో)—ఆదిననిశీధముకూడ నిట్లేజ్యోత్స్నామయమై యుండెను! ఆకస్మికముగయామినీనాథుఁడు మేఘములయందడంగి పోయెను. ఆర్ద్రవాతులోచ్ఛ్వాసమునఁ బ్రదీపము నిర్వాణమై పోయెను!—అమ్మా! ప్రేమమయీ! నాయనుంగుబిడ్డా!—ఆహా! ఆ తలంపే స్వర్గము!—ఇదేమి! చాణక్యా! నీ కన్ను లశ్రుబిందు పూరితము లాయెను!—భిక్షుకా! ఈ స్వర్ణ భిక్ష గైకొమ్ము—

(భిక్షుయోనఁగును)—అమ్మా!—ఎందులకు?—వలదు! వలదు!—పొమ్ము!—శీఘ్రముగఁబొమ్మా! నిలువకుము.

(భిక్షుకుఁడును, భిక్షుకబాలికయు విస్మితులై నిష్క్రమింతురు)

ద్వితీయరంగము.

పాటలీపుత్రప్రాసాదము—రాత్రికాలము.

(మురి, చంద్రకేతులు ప్రవేశింతురు.)

ముర—చంద్రకేతూ! దక్షిణసీమను జయించి, చంద్రగుప్తుఁడు నేఁడు మగధకు మగుడి వచ్చుచుండెనుకదా. నగరున నుత్సవము లేమియు లేవేల?

చం॥ కే—ఉత్సవముల జరుప చాణక్యమంత్రి నిషేధించెను.

ముర—అదేమి! గురుదేవుఁడు తనప్రియశిష్యుని విజయచిహ్నముగఁ బౌరులు కావించు నుత్సవములను—నిషేధించెనా?—ఇదేటి విచారము?

చం॥ కే—అమ్మా! మంత్రివరుఁడు నిషేధించినపుడు, నిశ్చయముగ నందులకు విశేషకారణ మేమైన నుండకమానదు.

ముర—చంద్రగుప్తుని విజయగౌరవమును బ్రాహ్మణుఁ డీసుచే చూచి సహింపఁజాలకపోవుటే దాని కారణము!

చం॥ కే—అమ్మా! అ విజయగౌరవమునకు సూచకుఁడయిన దెవఁడు? నిర్హేతుకముగ బ్రాహ్మణునిపై నెపము వేయకుము.

ముర—అదిగో! రణధ్వని! తనయుఁడు మరలి వచ్చుచుండెను. నేఁ బోయి హర్మ్యశిఖరముననిలువంబడి, ప్రవేశసమారోహము నుపలక్షించెదను.

(వేగముగ నిష్క్రమించును.)

చం॥ కే—బహుదినాంతరమున నేఁడు నేస్తకాని జయ్యుదీప్రముఖమును వీక్షింపఁగలుగుదును. నేఁ డెట్టి సుఖకరమైన యాహ్లాదజనక దివసము! చంద్రగుప్తా! పూర్వజన్మమం దీవు నాకుఁ దోడఁబుట్టినవాఁడవై యుంటివా?

(నేపథ్యమందుఁ గోలాహలము, యంత్రసంగీతము వినంబడును)

(పదపడి "జయ్! చంద్రగుప్తమహారాజునకు జయ్!" అను జయజయధ్వానములు ఘనఘనాయమానములై వినంబడ సాగును. క్రమక్రమముగ విజయనినదములు సమీపించును. పిదప పతాకధారులతోడను, సైనికులతోడను చంద్రగుప్తుఁడు ప్రవేశించును.)

చం॥ కే—సుహృద్వరా! రమ్మా!

(ఆలింగన మాచరించుకొన నుద్యమించును.)

చం॥ గు—(క్రోధస్వరమున)—చంద్రకేతూ! నాయాదేశము నీ కెఱుకకాలేదా?

చం॥ కే—ప్రియవరా! ఏమి యాదేశము?

చం॥ గు—అస్మదాగమన చిహ్నముగ నగరునాలోకిత మొనరింపుమని నీకు నే నాదేశ మంపియుండలేనా?

చం॥ కే—పంపియుండుట నిక్కమే!

చం॥ గు—అది పాలితము కాలేదేల?

చం॥ కే—దానిని పాలిత మొనరింప మంత్రిమహాశయులు నిషేధించిరి.

చం॥ గు—అట్లని ముందే యనుమానించితిని—చంద్రకేతూ! మగధ భర్త చంద్రగుప్తుఁడా లేక చాణక్యుఁడా?

చం॥ కే—నెచ్చెలీ! నెయ్యుఁడు చెప్ప—

చం॥ గు—ఉత్తర మొసఁగుము. మగధాధీశ్వరుండను నేనా, లేక నా యమాత్యుఁడా?

చం॥ కే—మగధమహారాజు చంద్రగుప్తుఁడు.

చం॥గు—అట్లైన నాముదలఁ ద్రోసివైచి, నా చేతిక్రింద రొంక పాఱుని యానన్నేల నౌదలఁ దాల్చితివి?

చం॥ కే—ప్రాణమిత్రమా—

చం॥గు—నే నేమియు వినఁ దలఁచుకొనలేదు. మంత్రిని పిలువుము.

చం॥ కే—ప్రియవరా! నాపలుకుల నాలింపుము. మిక్కిలి—

చం॥గు—ఇఁక మిక్కిలిగ నేమియుఁ బల్కకుము. పోయి చాణక్యుని పిలుచుకొని రమ్ము. ఈముహూర్తమందే నేనాతని సమాధానముఁ బడయవలయును.

చం॥ కే—ఆతఁ డనిన దేమన—

చం॥గు—ఆతఁ డేమనెనో, యిఁకేమనునో స్వయముగ వచ్చి నానమ్ముఖమునఁ బల్కును. మగధపతి చాణక్యుఁడో లేక చంద్రగుప్తుఁడో యీ ముహూర్తమందే స్థిరమై పోవలెను.

చం॥ కే—నెచ్చెలీ! అధీరుఁడవు కాకుము. వినుము—

చం॥గు—[క్రోధతామ్రాక్షుండై]—చంద్రకేతూ! నీవుకూడ నాక బాధ్యుండ వగుచుంటివా?—పొమ్ము.

[చంద్రకేతు మెల్లగ నిష్క్రమించును.]

చం॥గు—బ్రాహ్మణుని దంభము నానహన శిఖరము నతిక్రమించి పోయెను! ఒకపర్యాయము—కాదు ముందు—ఏమి గర్వము!—ఆశ్చర్యము!—ఈమాఱు నేను—కాదు—ముందుగ సమాధానము వింపును. అవిచార మాచరింపను.

[పచారి చేయును.]

(చాణక్య చంద్రకేతులు ప్రవేశింతురు)

చాణ—మహారాజునకు జయమగు గాక!

చం॥ కే—(కుమ్క ప్రణామ మాచరించి)—అమాత్యవర్యా! విజయుం

డనై నేఁడు స్వీయనగరునకు మర్షలి వచ్చు తఱి శుభచిహ్నముగఁ బ్రోలు నాలోకిత మొనరింప నే నాన నొసఁగితిని. ఆయాజ్ఞ పాలితము కాలేదేల?

చాణ — నా నిషేధము వలన.

చం॥గు — (క్రియాత్కాలము స్తబ్ధుఁడై యుండి)— భవన్నిషేధ కారణ మేమో నే నెఱుఁగవచ్చునా!

చాణక్య — ఆ కారణ మేమో నీ వెఱుంగనక్కఱలేదు.

చం॥గు — ఏమి! ఎఱుఁగనక్కఱలేదా!

చాణ — ఎఱుఁగనక్కఱలేదు. నే నేమి సలిపితినో, దాని నుచిత వివేచన మొనరించియే సల్పితిని.

చం॥గు — అట్లయ్యు, దాని హేతు వేమో నే నెఱుఁగవలయును.

చాణ — హేతుకమును వ్యక్తీకరింపఁదగు సమయమింకను ఆసన్నము కాలేదు. ఆసన్నమగునపుడు వివృత మొనరింతును.

చం॥గు — మంత్రీ! మగధమహారాజును నేను సుమా!!

[చాణక్యుఁడు సస్మితాననుఁడై జూచుచు నిలువంబడును.]

చం॥గు — మంత్రీ! ఇట్టి యౌద్ధత్యమును సహింపఁజాలను. దీనికిఁ దగు విచారము సల్పుదును.

చాణ — చంద్రగుప్తా! నీవు త్తేజితుఁడవైతివి—ఒకించుక శాంతింపుము.

[నిష్క్రమింపఁబోవును]

చం॥గు — మంత్రీ!—

(చాణక్యుఁడు మరలును.)

చాణ — వత్సా! ఇంచుక శాంతింపుము.

చం॥గు — ఈసామ్రాజ్యమునకు రాజును నేనో లేక నీవో నేనెఱుంగ వలయును.

చాణ — ఈ రాజ్యమున కేలిక చంద్రగుప్తుఁడు.

చం॥గు.—ఏది! అట్టి చిహ్నమేమియుఁ దోఁచుట లేదే!! నిజసామ్రాజ్యమందుఁ గైదిసగుటయు, నీజనిలయమందు భృత్యుఁడనగుటయును మాత్రము నేఁ జూచుచుంటిని. చాణక్యమంత్రి పాటలీపుత్రమున నిశ్చింతమనస్కుఁడై, కాలిపైఁ గాలువైచుకొని కూరుచుని రాజభోగ మనుభవించుచుండ, చంద్రగుప్త మహారాజు తద్భోగార్థ పదార్థహరణార్థము దేశదేశాంతరములఁ గ్రుమ్మరుచు, దాఁగొని వచ్చిన సంభారముల లెక్క కరణి నమాత్యశేఖరున కర్పించుచుండెను. భారతవర్షమంతయు మంత్రిపుంగవుని ప్రజ్ఞావిశేషముల నుగ్గడించు లోకుల సంస్తవగానంబులతో ముఖరితమగుచుండఁ జంద్రగుప్తుఁ డాస్తోత్రగాథలకు వలయు నుపకరణములను గూర్పవలసివచ్చుచుండెను. చంద్రగుప్త మహారాజు చాణక్యమంత్రి యాదేశము నవనతశీర్షుఁడై వహాన మొనరించును, మఱి చాణక్యుఁడు చంద్రగుప్తు నాజ్ఞను పదాఘాత మొనరించును. మనల యిర్వుర నడుమ నుండఁదగు సంబంధ మిదియ యగుచోఁ ఆబంధన మెంత శీఘ్రంబున భిన్నమైన నంత మేలు!

చాణక్య—దేవర యభిరుచి. చాణక్యుఁడు దేవరను బ్రతిమాలి మంత్రి పదమును పడయలేదు. ఆతఁ డల్లేమియుఁ గోరి తెచ్చుకొనువాఁడు కాఁడు. నృపాలా! ఈముహూర్తమందే నేను నాయమాత్యపదమునకు స్వస్తిఁ జెప్పుచున్నాను!

చం॥గు—అట్లొనరించుటకుఁ బూర్వము నీవు నీయాచరణమునకుఁ దగు సమాధాన మీయవలయును.

చాణ—చాణక్యుఁడు సమాధాన మిచ్చువాఁడు కాఁడు.

చం॥గు—బ్రాహ్మణా! నీతలబిరుసుతన మింతవఱకు హెచ్చెనా?—సైనికులారా! ఈబాపని బంధింపుఁడు.

[సైనికులు స్థిరభావమున నిలువంబడి యుందురు.]

చం॥గు—చెనటులారా! బొమ్మలవలె నిలుచుంబడి చోద్యము జూచుచుంటి రేల?

[సైనికులు ముందునకు రాగా చాణక్యుఁ డతిప్రశాంతభావమున హస్తసంకేతముచే వారి యత్నము నివారణ మొనరించును.]

చాణ—శూద్రుని కింకను యింత బింకముండఁ జెల్లదు. ఇట్టి యౌద్ధత్యము శూద్రునందు నే నీ వఱలో నెన్నఁడుఁ గాంచి యుండలేదు. మహారాజా! నే నిదె నామంత్రిత్వమును త్యజించుచుంటిని. (మంత్రి పరిహారణమును త్రేని ముందిడును)—రాజా! రాజధానియందు నిశ్చింత విలాసమున మునుంగుచుఁ దేలుచు చాణక్యుఁడు కాలహరణముఁ గావించుచుండుట లేదు. ఆతఁ డందుఁ గూరుచుని యొక ప్రకాండ మహారాజ్యమును నడపుచుండెను. చాణక్యుఁడు పాటలీ పుత్రమునఁ బద్మాసనమువై చుకొని రాజభోగముల ననుభవించుచుండెనని నీవు తలఁచుచుంటివి. కాని, చంద్రగుప్తా! చాణక్యుఁడు కుడుచునది రెండు పిడికెడుల సామాన్యోదనము; చాణక్యుఁడు శయనించున దజినశయ్య! యామినియందు మూడవ యామమున రాజకీయవిషయములఁ జాలయుం బ్రొద్దుతలపోయుచు నున్నను స్త్రిమ్మ్ఁండై యాతఁడు కుటీరప్రాంగణమునఁ బాదచారణ మొనరించును. భూపాలా! ఇఁక నేఁ బోయెద! నీ రాజ్యము నీవేలు కొమ్ము. (పోఁబోయి, మరల గిఱ్ఱున వెనుకకుఁ దిరిగి)—మంచిది, పోకమున్ను నేఁ డుత్సవనివారణ మేల నల్పితినో చెప్పియే పోదును. ఇతి పూర్వ మగధ భర్తయగు నందుని మంత్రి విద్రోహదళము నుత్తాప మొనరించి, యొక ప్రకాండ షడ్యంత్రమును ప్రజ్వలిత మొనరించెను. నేఁటి నిశీథమున నుత్సవసమయమున నావిద్రోహులు నగరును ముట్టడింప నిశ్చయించిరి. వారిలోఁ గొందఱు నీశయనాగారము

లోని శాక సారంగముఁ ద్రవ్వి నిన్నుఁ బాలియింపనందు వేచి యుండిరి. చారులవలన నాకుట్ర నెఱిఁగి ఘాతకులఁ దుదముట్టింపఁ గతిపయ సైనికుల నత్తావునకంపితిని. (నిష్క్రమింపఁబోవును. మరల దిరిగి) — మఱిచితిఁ మఱొక మాట. విజయుం డగు సెల్యూకసు సింధుస్రవంతిని దాటివచ్చెను. శతృవులు నల్వంకల నశస్త్రులై యుండిరి. దానంజేసి యిది యుత్సవమునకుఁ దగు యదనుకాదని యెఱిఁగి ప్రస్తుతము దాని నాపితిని. నీకల్యాణార్థమే అట్లు కావించితిని కాని యోర్వలేని తనమునఁ గాదు!

[నిష్క్రమింపఁబోవును.]

చం॥కే—(చాణక్యుని పదతలమందుఁ బడి)—గురుదేవా! క్షమింపుఁడు.

చాణ—సమాధాన మొసఁగిన పిదప చాణక్యుఁ డిఁక మంత్రిత్వ మాచరింపఁడు.

[నిష్క్రమించును.]

చం॥కే—మిత్రమా! మంత్రిపుంగవుని బ్రతిమాలి మరలింపుము.

చం॥గు—ఎందులకు? చాణక్యుఁడు లేనియెడ రాజ్యము నడువదా? ఇంత యహంకారమా? — ఇపుడు చెడినదేమి! నే నిత్తఱి స్వేచ్ఛఁబడసితిని. నేఁడు నేను నిక్కముగ మహారాజును.

చం॥కే—మిత్రమా! నెయ్యుని యుపదేశము వినుము. గురువర్యుల కాలుసేతులఁ బట్టుకొని మరలింపుము.

చం॥గు—చంద్రకేతూ! నీయుపదేశము నాకక్కఱలేదు. నీయనురోధముకతన నేనొక మాఱు చాణక్యుని క్షమించితిని—అపుడు చాల పొరపా టొనరించితినని యిపుడు గ్రహింపఁగలుఁగుచుంటిని. బ్రాహ్మణున కింత బింకమా? నేను మగధ భర్తను! నా కేమియు శక్తి లేదా? తమ్మునిని క్షమింపఁగలుగు క్షమత

లైన నాకు లేదా? నేనీరాజ్యమున కేమియుఁ గానని యు, అనామకుఁడననియు, యేమియుఁ జేత కానివాఁడననియు, రాజ భూమికాభినయనము మాత్ర మొనరించుచుంటిననియు మీరలు తలఁచుచుంటిరి. ఈవ్యంగాభినయము కంటె సరళ దాస్యమే మేలు!

చం॥కే—మిత్రసత్తమా! గురువర్యులు కావించునదంతయు నీమంగళార్థమే కదా!!

చం॥గు—ఓహో! అటులనా? నామంగళార్థమే కాఁబోలు పాపమా పాటుఁడు నాతమ్ముని తన పొట్టఁబెట్టుకొనెను!

చం॥కే—కాని, నీవాతని కడ నీసింహాసనముకై ఋణివి కావా?

చం॥కే—అందుల కేనాతని కడ ఋణినా? బాగుబాగు! అప్రియో క్తులను వచించుటలో నీవు మిగుల కుశలుండవే!

చం॥కే—మిత్రమా! అప్రియసత్యము వచించు నధికార మొక్క మిత్రునికే కలదు!

చం॥గు—అది నిక్కమే! కాని, ఆమైత్రి సమాను లందుమాత్రమే సాధ్యమగును.

చం॥కే—మహారాజా! నాయౌద్ధత్యమును మన్నింపుఁడు. ఇఁక ముందు నే నిఁక దేవరతోఁ జెలికారము గావించునంతటి సాహసమునకుఁ బూనను. ఇవుఁడేఁ దమకడ సెలవు గైకొని చనియెద—వీడ్కొనిపోకము నొక్కమాటఁ జెప్పి పోదును. సంపత్సమయమున దేవర యీ దీనుని మైత్రి నుపేక్షించినను, యుపేక్షింపుడు. కాని, విపదవస్థయందు మాత్రము స్వామి సఖ్యాధికారమునుండి నన్ను దూరీకృతుఁ గావింపకుఁడు. భవిష్యమందు దేవర కెన్నఁడైన నీభృత్యునిసాయముయొక్క యక్కఱ కలుఁగునేని, నేఁటి ప్రత్యాఖ్యానజనితమైన లజ్జకతన దానిం దెలుపుటకు సంకోచింప

కుందురు గాక!—తమ కొఱకు ప్రాణములు ధారవోయుట కెల్ల
వ్వుడును సంసిద్ధుఁడను.

[ప్రణామ మాచరించి నిష్క్రమించును.]

చంద్రగుప్తుఁడు కియత్కాలము స్తబ్ధుఁడై యుండును. అంత సశస్త్రులైన సైనికు లేగురు ప్రవేశింతురు. ఒకని కరమం దొక ఛిన్నముండముండును. సైనికుఁ డాముండమును చంద్రగుప్తునకుఁ జూపి,—"మహారాజా! ఇది దళపతి మస్తకము సుడీ!" అని యనును.

చం॥గు—ఏదళపతి మస్తకము?

సైనికుఁడు—ఇరువదియైదుగురు ఘాతకులు దేవర శయ్యాగారము లోని యొక సొరంగముఁ ద్రవ్వి, తమ్ము వధింప గృపాణపాణులై వారందు దాగియుండిరి. ఆహంతకుల నందఱఁ గడతేర్చ రండని మంత్రి మహాశయులు మమ్మాత్రావునకుఁ బుత్తెంచిరి. ఘాతకుల నందఱను మేము కాలునివురి కంపివచ్చితిమి. ఇది ఘాతక నాయకుని మస్తకము!

చం॥గు—(మస్తకమును తేఱి చూచి)—ఇది నందుని భావమఱఁది శిరము. వాచాలా! తగు శాస్తిఁ బడసితివిరా! కూళుఁడేల నిలచును?—(సైనికుల నుద్దేశించి)—మీ రిఁకఁ బొండు

[సైనికులు నిష్క్రమింతురు.]

చం॥గు—ఆహా! ఏమిది!!

[సైన్యాధ్యక్షుఁ డొకఁడు ప్రవేశించును.]

సైన్యా—ప్రభూ! అభివాదనము. దేవరకు జయమగు గాక!

చం॥గు—సైన్యాధ్యక్షా! వార్తలేమి?

సైన్యా—విద్రోహులు పల్వురు నగరమును ముట్టడింప నరుదెంచిరి. మే మందఱ మప్రమత్తులమై సశస్త్రులమై యుండుటఁ గాంచి వారలు

మరలి పోయిరి.

చం॥గు—మి మ్మెవరు సతర్కులరై యుండ నాజ్ఞాపించిరి?

సైన్యా—మంత్రిమహాశయులు!

[చంద్రగుప్తుఁ డనిమేషనయనుఁడై శూన్యము నిరీక్షించుచు నిలువంబడి పోవును.]

[సైన్యాధ్యక్షుఁ డభివాదన మొనరించి మెల్లగ వెలుపలికి వెడలి పోవును. చంద్రగుప్తుఁ డట్లే చూచుచు నిలువంబడియుండును.]

## తృతీయ రంగము.

### సెల్యూకసు శిబిరము—రాత్రికాలము

(సెల్యూకసు కాత్యాయనులు)

సెల్యూ—కాని వారి వాహినీసంఖ్య యారులక్షలు. అది సామాన్య సంఖ్య కాదు.

కాత్యా—అది నిక్కమే. కాని చాణక్యుఁడు మంత్రిత్వముఁ బరిత్యజించిన కారణమున మగధసైన్య మిపుడు విశృంఖలావస్థయం దున్నది. అ దట్లుండ వేగులవలన విపక్షుల గ్రొత్తగుట్టులన్నియు నెఱింగితిని. నాపలుకులఁ బూర్తిగ విశ్వసించి, తోడనే కార్యమునకు నడుము గట్టితేని తాము ప్రాప్తలాభ ముదితహృదయులగుట నిక్కము. ఇఁక మనము విలంబ మాచరించిన కార్యము లేదు. పగతుర ముట్టడించుట కిదియే తగిన సమయము.

సెల్యూ—కాని, మనసైన్య సంఖ్య మిగుల నల్పమైనది కదా.

కాత్యా—అయిననేమి. మీరు సుంతైన వెఱువవలదు. నంద మహారాజునకుఁ బక్షపాతులైన సత్వసమన్వితవ్యక్తులు నగరునం దనేకులు కలరు. మనయుద్యమ మెఱింగితిరేని, నిక్కముగ వారలంద

అత్యుత్సాహమున మనలఁ గలిగియుందురు.

సెల్యూ—అట్లు కలియుదురను నిశ్చయ మేమి ?

కాత్యా—అది నిశ్చయమని నే నెఱుంగుదును. చంద్రకేతు చముపులు స్వసీమకు మరలి పోయెను. ప్రాయశః మఱియు సైనికులు కూడ యవనయోధులఁ గలియుదురు. ఈవఱకే యేలకలియ లేదని భావించుచుంటిని.

[హెలేన్ ప్రవేశించును.]

హెలెన్—బ్రాహ్మణా ! అందఱు నీవలె విశ్వాసఘాతకులని తలంచుచుంటివా ?

సెల్యూ—అమ్మా ! ఇత్తఱి నీవిచట నెందులకు ?

హెలెన్—నే నీ పార్శ్వాగారమునఁ బఠన మొనరించుచుంటిని. అపుడవు డీపాఱుని నిమ్నస్వరము నాచెవులఁబడెను. చాల కౌతుకము జనింప, పొత్తమును మూసివైచి చెవియొగ్గి మీప్రసంగము విన దొరకొంటిని. ఇఁక నంతరాళము నిలువనేరక మీప్రమోలఁబడితిని.—బ్రాహ్మణుఁడా ! నీవిట్టి విశ్వాసఘాతకుఁడవని నేఁ గలనైనఁ దలంపనైతిని.

కాత్యా—ఏమి ! నేను విశ్వాసఘాతకుఁడనా ?

హెలెన్—ఒక్కమాఱు కాదు—నూఱుమాఱులు, నీయట్టి కృతఘ్ను నెందును గాంచియుండలేదు. ఎవఁడు తేని విరోధులఁగలసి కుమతియై, కుట్రఁబన్నునో, యెవఁడు దుర్మతియై స్వజాత్యుచ్ఛేదనాసంకల్ప మొనరించునో, యెవఁడు ఆజన్మసిద్ధానురాగ రాజభక్తులను విసర్జన మొనరించి ప్రత్యర్థుల పక్షమర్థించునో, యెవఁడు శాంతిక్షేత్రోపరిభాగమున రక్తతరంగములఁ బ్రవహింపఁజేయ నుంకించునో—అతఁడు స్వీయజాతికిమాత్రమే శత్రువు కాఁడు. సమస్తమానవజాతికి శత్రువు! నియమశృంఖలము

లకు శత్రువు !! ధర్మమునకు శ్శత్రువు !!! బ్రాహ్మణుఁడా ! నా జనకుని స్తిమితజిగీషను నీ కుమంత్రణ వాయుప్రయోగముచే మఱలఁ బ్రజ్వలిత మొనరింపఁబూనుచుంటివా? రెండు ప్రకాండ సభ్యజాతులనడుమ పరిఖను ఖనన మొనరింపఁజూచుచు నెట్టిసాహస కృత్యమునకు దొడరుచుంటివి ! నరాధమా ! నీకు నరకమందైనఁ దావుండదుజుమీ !!

కాత్యా—కాని పాణిని—

హెలెన్—ఇపుడు పాణిని యెందులకు? ఆతఁడు వ్యాకరణగ్రంథకర్త.

కాత్యా—ఆతని వ్యాకరణమం దెంత వేదాంతసారమున్నదో—

హెలెన్—చాలు చాలు! ఇఁక నోరుమూయుము. నీ వతిమూర్ఖుండవు. ఇఁక నీ ప్రసంగముఁ గట్టిపెట్టి దూరముగఁ దొలఁగిపొమ్ము.

[కాత్యాయనుఁడు నిష్క్రమించును.]

హెలెన్—తండ్రీ! నే నీపాఱునికడ సంస్కృతాధ్యయన మాచరింపఁ బ్రారంభించితిని. ఈతఁ డిట్టి దురాత్ముఁడని స్వప్నమందైనఁ దలంచియుండలేదు. ఈతఁడు కలుషాత్ముఁడని యాదినెఱింగియే యుండిన తత్క్షణమే వీనిని దూరీకృతుఁ గావించియుందును.

సెల్యూ—నందనీ !

హెలెన్—ఏమిజనకా ?

సెల్యూ—నీ జనని యవనాంగనా లేక హెలెటా కాంతయా ?

హెలెన్—నాజనని దేవి.

సెల్యూ—ఆమెకు దుహితవైన నీవు యవనుల గౌరవమును ఖర్వ మొనరింపఁదలఁచుచుంటివా?

హెలెన్—జనకా ! యవనగౌరవ మవనిలోనికి విశృంఖలాత్యాచారములఁ గొనివచ్చుటగాదు! యవనగౌరవము—సోక్రెటిస్, డెమొస్థినిస్ లందును, ప్లేటో, యరిస్టటిలు లందును, హోమరు,

యూరిపిడిస్ లందును కలదు ! యవనగౌరవము ఫిడియాస్, లైకర్గస్ లందును ; సాఫో, పెరిక్లిసు లందును ; హిరొడొటాస్, ఇంకాయిలిసులందును కలదు !! యవనగౌరవము భారతవర్ష మార్యయుగమం దాసియాఖండమున జ్ఞానాలోకముఁ బ్రసరింపఁ జేసిన తెలుఁగున నజ్ఞానధ్వాంతావృతమగు నైరోపాఖండమందు ఖద్యోతమయూఖములమాడ్కి విజ్ఞానదీప్తుల వెలుఁగఁజేయు టందును కలదు !!! గ్రీసు భారతవర్షములు సంధ్యాసూర్య పూర్ణ సుధాంశులచాడ్పున బ్రాచ్యప్రతీచ్యనభములను విభాగ మొన రించి వైచుకొనెను ! ఆరెంటికిని సంఘాతము కలుగునేని ప్రళయ మాసన్నమగును—ప్రథనము హత్యాక్రియ !

సెల్యూ—మిల్టాయిడిస్, లియనిడాసు లట్టిన యీ హత్యాక్రియనే కావించుచుండువారుకదా !

హెలెన్—ఆతతాయులచే నాక్రాంతమైన వర్షమును రక్షించుటకును, దేశమం దగ్నిదాహ, భయంకరస్పర్శావ్యాధి, లుంఠనములను నిర్వాణ మొనరించుటకును, శాంతియొక్క శుభ్రవైజయంతిని కాఁపాడుటకును వారలు సామరికవృత్తి నవలంబించితిరికాని దేశమందు విప్లవము నుద్భవింపఁ జేయుటకొఱకుకాదు.

సెల్యూ—అట్లని నేను విశ్వసింపఁజాలను.

హెలెన్—ఆత్మరక్షణార్థమాహవ మనివార్యమగుచో దాని నాచరింపుఁడు. అదిగాక వే ఱుపాయము లేదని దలంచునపుడే యాల మునకు దొడరుఁడు. శాంతి రక్షణార్థమేకాని, శాంతిని నశింపఁ జేయుటకు భండనము సలుపకుఁడు. జనకా ! తా మిపుడు శాంతి యంకతలమున సుఖంబున నిదురించుచుండు యొకజాతినిదుర్దను భంగ మొనరింపఁ బూనుచుంటిరి ! నిశ్చింతహృదయమం దాతంకము జనింపఁజేయ నుంకించుచుంటిరి !! నిష్ఠురులై యొక మహా

సభ్యత కంఠము నిరోధ మొనరింప్ప దొరకొనుచుంటిరి!!! జనకా! ఈ యత్నము లన్నియు నుచితములని తలంచుచుంటిరా?

సెల్వ్యా—నేను కుమార్తె యుపన్యాసము వినువాఁడనుకాను. శైశవమున జనయిత్రివక్తృతకు శ్రుతి యొగ్గుచుండువాఁడను. వార్ధక్యమున నిపుడు నందని యుపన్యాసము వినవలెనా యేమి? అరిస్టటిల్ చెప్పియుండలేదా—

హెలెన్—అబ్బబ్బ! ఒకవైపున నరిస్టటిల్ యకథితోక్తి, మఱొండు వలనున పాణిని యధ్యాత్మిక వ్యాఖ్యప్రాణము విసిగించి వైచుచున్నది! ఒక్కొకపుడు నేనాత్మహత్యఁ గావించుకొనవలెనని యనుకొనుచుండును.

సెల్వ్యా—ఎందువలన?

హెలెన్—జనకా! ఈ మహావిశ్వపరివారమును విద్వేషాహంకారములు వేఱుకావించినట్లు నదీ నగ నీరధులు దానిని వేఱుకావింపలేదు.

సెల్వ్యా—ఇఁకఁ బొమ్ము! నీ గంభీరోపన్యాసము నే వినఁదలఁచుకొనలేదు—సాగరికా!

[పరిచారిక ప్రవేశించును]

సెల్వ్యా—కన్యకడనుండుము. అమ్మాయీ! ఇఁక శయనింపఁ బొమ్ము!

[నిష్క్రమించును.]

హెలెన్—[క్షణకాల మూర్ధ్వదిక్కుగ దృష్టి సారించి]—సహస్రఫణముల విస్తార మొనరించి, హింసాద్విజిహ్వా ముందునకుఁ బర్వుపర్వున నరుదెంచుచున్నది. దృష్టి ముగ్ధమాడ్కి ధరిత్రి దాని ననిమేషసాక్షియై వీక్షించుచున్నది!—ఆహా! ఇఁకేమియు నుపాయములేదు—సాగరికా! నడువుము!

[ఇరువురు నిష్క్రమింతురు.]

చతుర్థాంకము

గ్రీసుసీమ్మగామమందలి యొక నిర్జనకుటీరము- ప్రభాతకాలము

ఏంటిగోనను, అతని జనని పరిసంగించుకొనుచు, వెలుపలికి వత్తురు.

ఏంటి—ఎంతబ్రతిమాలినను సరె, నేను నీ చేతినీరముఁ గ్రోలను. నా జనకుఁ డెవరో యెఱుంగుటకు మాత్రము నే నిత్తావున కరుదెంచితిని.

మాత—నేను నీ జనయిత్రిని—ప్రణయమున కెట్టి ఋణము లేదా?

ఏంటి—ప్రణయఋణమా!—[సవ్యంగహాసన మొనరించి]—బాగు! బాగు! తనయుని ఘృణితభిక్షుకుఁ గావించి, జాలిఁగొనక జగతియందుఁ ద్రిప్పి త్రిప్పి, పదపడి ముష్టిమాత్రపు కూడుకొఱకు సంతయందుఁ బశువుపగిది వానిని విక్రయ మొనరించి, యిపుడు ప్రణయమున కేదో హక్కుఁ జూపుచుంటివా? అట్లుచూపుటకు నీవు బిడియమేల పడుచుండుట లేదు?

మాత—అన్నా! నేను తప్పిద మొనరించితిని. కాని, ఆ నెరసునకు క్షమ యేమియు లేదా? బలంబగు తాడనంబున నన్నున్మాదినిగావించివైచి, అట్టి చెట్టకుఁ జేయి చేయఁజేసిన అప్పటి క్షుధాజ్వాల యెట్టిదో వత్సా నీ వేమెఱుంగుదువు? నిష్ఠురనై నిన్ను విడనాడిన యనంతర మెన్ని దీర్ఘ దివసముల నెన్ని సుప్తిహీన విభావరులను యుష్ణాశ్రుసలిలంబుచే నెట్లభిషిక్త మొనరించితినో నీ వేమెఱుంగుదువు? బిడ్డ ముద్దుమోమును స్మరించినంతనే దృక్పథమునుండి పృథ్వియంతయు లుప్తమైపోయెను. ఆనాఁటి క్రీతాన్నముష్టిని ముఖంబున నిడుకొనగనే అది నాయుష్ణనిశ్వాస తాపమున భస్మమైపోయెను. ఆఁకలి వేడిమి యెట్టిదియో నీవే మెఱుంగుదువు!—ఎట్లు గ్రహింపనేర్తువు?

ఏంటి__నా యెదయందలి వేదనమును నీవు మాత్ర మెఱుంగుదువా? తీవ్రవ్యంగ తాడనంబున నన్ను ఛిద్రుండను గావించి, యుల్కా వేగమున సమస్త భూవలయమందును గ్రుమ్మరిఁజేసి, మిక్కుట మగు యిక్కటులందుఁ బడద్రోచిన మదీయాంతర్గాథ, మానసిక వ్యథలను నీవు మాత్ర మెఱుంగుదువా? కంఠీరవగర్జన, వ్యాఘ్రవ్యాదాన, శాత్రవఖడ్గములఁ దుచ్ఛమొనరించి, యేహ్య త్పీడ తాడనంబునఁ బలుసీమలందు భ్రమణ మొనరించి, వేసారి, తుదకు నిన్నుఁ జేరితినో దాని యాతనమెట్టిదో నీవేమెఱుంగు దువు? నిజశౌర్యబాహు విక్రమంబుల కతన సైన్యాధ్యక్షుండనై సమర విద్యాకుశలుండనని పేరు వడసితిని. కాని నానిటలమం దీవు ముద్రించిన కళంకకాలిమపోలేదు! దానంజేసి పలువురలోఁ దలయెత్త జాలకుంటిని. ఇఁకఁ జెప్పుము__నాజనకుఁ డెవరు?

మాత__చెప్పెదను. ఒకించుక విశ్రాంతిఁ జెందుము.

ఏంటి__నాకు విశ్రాంతి యక్కఱ లేదు. __నాజనకుఁ డెవరో తెలుపుము.

మాత__(అర్థస్వగతమున)__చిత్తాక్షి సమక్షమునఁ దోఁచుచుండెడి ఆయానన మాహా యెన్నినాళ్ళకు నాకంటఁబడెను! ఈవదన మెన్నిమాఱులు స్వప్నమున నాచిత్తాభ్రమునఁ దోఁచెను! ఎన్ని సారు లీపసిండి బొమ్మను వక్షమునఁ జేర్చి కంపితానురాగమునఁ బరిపరిమాఱులు చుంబించితిని! ఎన్ని పర్యాయములు__

ఏంటి__నాజనకుఁ డెవరో చెప్పుము.

మాత__నీజనకుఁ డెవరో యెఱుంగుటకే నీకింత యాతురమా?__ నేను నీకేమియుఁ గానా?__

ఏంటి__ఏమియుఁ గావు. నీసంబంధ బంధనమును నీవు నిజహస్తము లచే ఛిన్న మొనరించి వైచితివి. పృథ్వియం దత్యంతఘృణితం

బగు పైశాచిక కృత్యముఁ గావించితివి! తల్లి వైతనయు నమ్మఁ గొంటివి!!

మాత—అందులకు నీకుమాభిక్ష వేఁడుచుంటిని—దాని నొసఁగవేని, ఒకమాఱు నన్ను "అమ్మా" యని పిలువుము—ఒక్కమాఱు! ఒక్కమాఱు!!

ఏం—నే నిచటికి వనితా విలాపము వినుటకై రాలేదు. వృద్ధాంగనా! వృథాప్రసంగము సలుపక, నాజనకుఁడెవరో వేగమ దెలుపుము.

మాతా—"వృద్ధాంగనా" యందువా? నేను నీ కేమియుఁగానా?

ఏంటి—ఏమియుఁగావు.

మాత—పదిమాసములు నిన్ను నేను నా గర్భమున మోచియుండ లేదా? పెద్దవగుదనుక నీకు స్తన్యమొసఁగలేదా?—రొమ్మున నిడుకొని నిదురఁగొలుపలేదా?

ఏంటి—ఆహా! ఏమి యనుగ్రహము! ఏమి యసీమకరుణ!! పాపము గొంతుకను నులిమి కలిఁగిన కొడుకు నొక్కనిఁ గాటి కంపలేదు. అట్లొనర్పకుండుటకు నీ యపారప్రేమయే తార్కాణము. ప్రేమ మయీ! ఏల చంపితివికావు? అమ్మవై అమ్మటకంటె నమ్మచే యుటే యిమ్ముగ నుండెడిదికదా!

మాత—వత్సా—(గుడ్లనీరు గుక్కుచు)—వత్సా! నన్ను మన్నింపుము.

ఏంటి—నా తండ్రియెవరో శీఘ్రముగఁ జెప్పుము. లేకున్న—నే నున్మాదుడనై యున్నాను. నా జనకుఁడెవరు? సత్వరమే చెప్పుము.

మాత—మంచిదగ్గైన వినుము. నేనింతదనుక నీకు నీ జనకుని నామము వ్యక్తీకరింప కుండుటకు కారణము దానినట్లు వ్యక్తీరింపవల దని నీ జనకుఁడు నన్ను నిరోధించుటే! మా యిరువురకుఁ బరిణయమైనపుడు—

ఏంటి—ఏమి?—పరిణయమైనపుడా!

మాత—నాకుఁ బదునేనువర్షముల ప్రాయము. ఆతఁడేమి బోధించినన్ను, మాఱుపలుకక, అడకువతో వినుచు అనురక్తనై భర్తృ వాంఛ ననుసరించి వర్తించుదానను. మా వివాహము రహస్యముగ జరిగిన కతన నొరు లెఱుఁగకుండ గాఁపుర మొనరించుచుండువారము.

ఏంటి—ఏమి! మీకు వివాహము జరిగెనా?

మాత—అట్లుండ నొకనాఁడు ఆతఁడొక యభిజాతవంశజుని కూఁతురను బెండిలి గావించుకొని నన్ను (డగ్గుత్తికతో) బరిత్యజించివైచెను. హా! పురుషా!! ఎంతకఠినుఁడవు!!!

ఏంటి—పరిణయమాయెనా? హెలెనా? అట్లైన నిన్నుఁ బడయు య్యాశయేకాంత దురాశ కాదు—సెల్యూకసూ!—అదేమట్లుచకితవైతివి?

మాత—ఎవరి పే రుచ్చరించుచుంటివి?

ఏంటి—రిచ్చపడెదేల?—నే నుచ్చరించినది సెల్యూకసుపేరు.

మాత—ఆతని పేరు నీ కెట్లు విదితమాయెను?—నే నింకను నీకుఁ జెప్పియుండలేదుకదా.

ఏంటి—నా కెట్లు విదితమైనదా!!!—ఎవ్వాని యధీనమందు సైన్యాధ్యక్షుండనై అనేక వత్సరములు గడపితినో ఆతనిపేరు నాకు విదితము కాకుండునా?

మాత—(మిగుల నాతురమున)—ఆతని యధీనమందే నీవట్లుంటివా?—అట్లయ్యు నీ వాతని గుఱుతింపఁ జాలవైతివా?

ఏంటి—(సాశ్చర్యమున)—గుఱుతించుటేమని?

మాత—ఆతఁడు కూడ గుఱుతింపఁజాలక పోయెనా? హా! కఠిన పురుషా! కడుపునఁ బుట్టినబిడ్డను గుఱుతింపఁజాలవైతివా? లక్షకు మించు బుడుతల నడుమనుండి నా వానిని, వాడెంత యెదిగినను

సరే, వానిఁగాంచి యెంతక్కాలమైననుసరె, నే జేర్కొనఁగలను.

ఏంటి—నీవేమను చుంటివి?—పిచ్చిదానివలె వాగుచుంటివేమి?

మాత—కాదుకాదు—అన్నా! నేను పిచ్చిదానఁగాను. ఇంకను పిచ్చిదాన నేలకాలేదో యెఱుంగకున్నాను. ఆతఁడు సార్వభౌముఁడు. నేనాతని ధర్మపత్నిని! రాజమహిషిని! అటిదాననగు నేను పదభ్రష్టురాలనై కడుపుమంట నోర్వఁజాలక కన్నకొడుకు నమ్ముకొంటిని! హా! ప్రారబ్ధము!! (ఏడ్చును)

ఏంటి—(అర్థస్వగతమున)—ఏమిది!—అట్లైన—

మాత—బిడ్డా! ఆసెల్యూకసేనీ జనకుఁడు!!

ఏంటి—కుడ్యమును గట్టిగఁ బట్టుకొని నిలువంబడి పోవును. పదపడి ఆకస్మికముగ నాతఁడు మాతృపదతలమునఁబడి వినీతభావమున నిట్లనును. "అమ్మా! నన్ను మన్నింపుము. నీపై నేఁ గడుగినిసితిని. నిష్ఠురోక్తులచే నీచిత్తము నొవ్వఁజేసితిని—అమ్మా! అభాగినీ!! పరిత్యక్తా!!! దుఃఖినీ!!!! [విలపించును]

మాత—అట్లు నీ పితకడనే. నే నభాగినీ పరిత్యక్తనగుట నీ జనకుని కడనే. నీ కడ నేనభాగినికాను. పరిత్యక్తనుకాను. మాతను మాత్రమే! వత్సా! మఱొక మా 'అమ్మా' యని పిలువుము. అంతయాతన — అంతవంత — అంత మొందును! అన్ని యగచాట్లను మఱతును — మఱచి ఆ నెయ్యంపు బిలుపు నొక్కండు మాత్రము విందును.

ఏంటి—పట్టమహిషివైన నీకు, యిట్టి దుర్దశ ప్రాపించెనా తల్లీ!

మాత—'తల్లీ' యని మాత్రమనుము. 'తల్లీ' మాత్రమే! ఇఁకేమియుఁ బల్కవలదు.

ఏంటి—అమ్మా! అమ్మా!!—

మాత—మఱొకమాఱు! మఱొకమాఱు!!—

ఏంటి—ఇదేమితల్లీ!—నీ కాళ్లు వడంకిపోవుచున్నవి. అమ్మా!
నిలువఁజాలకుంటివేల?—రమ్ము. అమ్మా! నిన్ను శయనింపఁజేసి
నీకు బాదసేవ సేతును—అమ్మా! రమ్ము!!

మాత—బిడ్డా! మఱొకమాఱు పిల్వుము.

ఏంటి—అమ్మా!—

మాత—ఇదియే స్వర్గము! ఇఁకేమియు వలదు—హా! నా తల తిరిగి పోవుచున్నది! నేఁ బోవుచుంటిని! హా! తండ్రీ! తండ్రీ! ఎందుంటివి!

(చేతులు చాఁపును.)

ఏంటి—ఇందే! అమ్మా యిందే!

(పడిపోవుచున్న మాతను ఏంటిగోనను పట్టుకొనును. తనయుని స్కంధముపై వ్రాలి ఆమె మెల్లగ నిర్గమించును.)

## పంచమరంగము.

చంద్రగుప్తుని ప్రాసాదము—రాత్రికాలము.

(చంద్రగుప్తు డేకాకియై యుండును.)

చంద్ర—తుదకు నా ప్రజలే, నా సైనికులే విపక్షపక్షావలంబులైరి! బాహిరమునఁ బ్రత్యర్థులు—గృహమున బ్రత్యర్థులు. ఇఁక రక్షణములేదు. ఇది ప్రకృతి ప్రతిశోధము. హితైషు లరాతులని తలఁచి రాజ్యమునుండి వారలఁ దరిమివైచితిని. అది నిర్వాసనము కాక మఱేమి! మిక్కిలి యభిమానమున మిత్రచూడామణి నన్ను వీడి వెడలిపోయెను. అభిమాన జనితాశ్రుపూర్ణాక్షుఁడై ప్రోల నిలచిన సుహృద్వరుని ఆనాఁటి విషణ్ణవదన మింకను మనఃచక్షు సమక్షమునఁ దోఁచుచున్నది. ఆహితైషిచూడ్కుల యర్థమిపుడు చిత్తగోచరమగుచున్నది—"చంద్రగుప్తా! నీ వింత కృతఘ్నుం

డవా! నీ కాశ్రయ మొసఁగితిని. సైన్య మొసఁగితిని. నీకొఱకై ప్రాణముల నొసఁగ సిద్ధముగ నుంటిని. నీ జీవనము రక్షించితిని. మగధసింహాసనమున నిన్నాసీనుం జేసితిని. ఆ కార్యము లన్నింటి కిదియా పురస్కారము?—ఆతని దృష్టియం దంతరార్థము నిగూఢమై యున్నదని అప్పుడే నేనేల యెఱుంగనైతిని?—చంద్రకేతూ! నా కిపుడు నీ దర్శన మబ్బు లాభము చేకూఱుచో భవచ్చరణ ద్వంద్వముఁ బట్టుకొని—"సామ్రాజ్యము పోయినను పోనిమ్ము! జీవన మంత మొందిన నొందనిమ్ము! నా తప్పులను మఱచి నన్ను మన్నింపుము. నీ క్షమాభిక్ష గైకొని ప్రముదిత చిత్తుండనై నేఁజనియెద"యని బల్కుదును. ఆహా! నేనెట్టి దుర్మతినైతిని! ఎట్టి విశ్వాసఘాతకుఁడనైతివి! అట్టి నాఁకిక రాజ్య విభవ మేల? ఇపుడు సామ్రాజ్య మంతయు ధ్వంశమైనను కానిమ్ము. మగధమహీరాజ్య మంతయు మంటఁ గలసిన గలువనిమ్ము. నేను కదన మాచరింపను. నాపై నేఁ గసిదీర్చుకొందును. మగధ సామ్రాజ్యము జలధరప్రాసాదము చాడ్పున శూన్యమందుఁ గలసి పోవుగాక! నేను క్షుబ్ధుండఁ గాను.

(సైనికుఁ డొకఁడు ప్రవేశించును.)

చం॥గు—సైనికా! వార్త లేమి?

సైనిక—మహారాజా! దుర్గదక్షిణప్రాకారము భగ్నమైపోయెను.

చం॥గు—మంచిది. పొమ్ము—ఏమి? చూచుచు నిలువంబడితివి! పొమ్ము.

సైనిక—శత్రుసైనికులు దుర్గముఁ జొచ్చుచుండిరి.

చం॥గు—చొరనిమ్ము! పొమ్ము!

(సైనికుఁడు నిష్క్రమించును.)

చం॥గు—నేను జన్య మొనరింపను. నాపై నేఁ బ్రతీకారముఁ గావించు

కొందును—నేను నాపైఁగసిఁ జీర్చుకొందును. ఆత్మహత్య నల్పుకొందును.

(మఱొక సైనికుఁడు ప్రవేశించును.)

సైని—మహారాజా!—

చం॥గు—ఎవఁడవు?—పో! పొమ్ము!

సైనిక—స్వామీ! శత్రువులు—

చం॥గు—శత్రు లెవరు? శత్రువు లెవరు లేరు—వారు పరమమిత్రులు. రానిమ్ము. పొమ్ము.

సైనికుఁడు నిష్క్రమించును.

చం॥గు—శత్రు లెవరో, మిత్రు లెవరో గుఱుతింపఁజాలకున్నాను. వెలుపల రిపులు, యింట రిపులు, ప్రకాండ నిర్ఝరిణిలోపల మహా కలవర ముత్పన్నమాయెను. నేనిపుడు సంక్షుభిత సాగరమధ్యమం దున్నాఁడను. ఈతరిని కర్ణధారుఁడు లేడు. కెరటములపై నిది యిటునటు లూగులాడుచుఁ దరంగహతిచే నుత్క్షిప్తవిక్షిప్తమై కొట్టుకొనిపోవుచుండెను. పొమ్ము! కొట్టుకొనిపొమ్ము! మున్గుట కిఁక విలంబములేదు. బాగుబాగు! ఎంత యాహ్లాదము! మంత్రణ మొసఁగుట కిపుడు చాణక్యుఁడులేడు! ప్రాణ మొసఁగుటకు చంద్రకేతు లేడు! పడుము! సముద్రగర్భమందుఁ బడుము!

(మూఁడవ సైనికుఁడు ప్రవేశించును.)

చం॥గు—మగల నీ వెవఁడవురా?

సైనిక—మహారాజా!—

చం॥గు—మహారాజెవరు? ఇచట మహారాజెవడును లేడు—(కఠోర స్వరమున)—పొమ్ము.

(సైనికుఁడు నిష్క్రమించును.)

(బాహిరమున శృంగనినాదము)

చం॥గు.—ఓ! అదేమిశబ్దము! ఇంత రాత్రి వేళ తూర్యధ్వనియా! అదే! అదే! ఓ! ఏమియుద్ధ కోలాహలము! ఆహా! ఏమి యాభయంకర ధ్వానము!—యుద్ధము! అవును యుద్ధమే! ఎవరితో నెవరియుద్ధము!—అదిగో మరల రణతూరీ నినదము!— చంద్రగుప్తా! నీవు సజీవుఁడవై యుంటివా లేక మృతుఁడవై యుంటివా? ఈతూర్యధ్వని వినియు, నిర్జీవుని వలె నీవు నిలయ మునఁ గూరుచుంటివా? అదిగో! అదిగో! వినుము. ఎందఱో నీకొఱకై పోరు సలుపు చున్నారు—ప్రాణములిచ్చు చున్నారు. నీవు గృహకోణమునఁగాళ్ళు చాచుకొని కూరుచుంటివిగా! వీరా! లెమ్ము. ఈ యగాధ నైరాశ్యముపై నుండి రయికమాఱు విద్యుత్తమును ఖేలన మొనరింపఁజేసి అగ్రసరుండ వగుము. చూచెద! ఈ ప్రభంజనా హుంకారము నడంచి నీ భీమ వజ్ర నాదము దిగంతములు మాఱు మ్రోయునట్లు గర్జన మొనరించు గాక!

తదనంతర మంతయుఁ బ్రళయ కల్లోలమందుఁ గలసి పోవుగాక! జయ్! మగధకు జయ్!

(మురి ప్రవేశించును).

మురి.—చంద్రగుప్తా!—ఇదేమిట్లు కూరుచుంటివి!

చం॥గు.—అమ్మా! సెలవొసంగుము. నేఁ బోవుచుంటిని.

మురి.—ఎచటికి?

చం॥గు.— ఆలమునకు. నే నాహవ మొనరింతును—పింజరాబద్ధ శార్దూలము మాడ్కి నిశిత భల్లాఘాత పరంపరలచే క్షత గాత్రుండనై మడియఁ గోరను. నక్షత్ర ఖచిత ముక్త నీలనభ ముప్పరమునఁ బ్రకాశించుచుండ యుద్ధ క్షేత్రమున నిజ వాహినీ యభ్యంతరమున నిలువంబడి సమీక్ష మొనరించుచు ననురులఁ

బాయుదును.

ముర—వత్సా! ఉసురులఁ బాయనేల? అప్రతిమాన ప్రతాపోపేతుండవైన నీవాహవావని కగ్రసరుండవై యరివీరుల యుక్కడఁగింపుమికి. శూరాగ్రేసరుండవగు నీవు మరణింపనేల?

చం॥గు—మరణము కాక యిపు డింక వే ఉపాయమేమి కలదు? బాహిరమున శత్రువులు!—అభ్యంతరమున శత్రువులు!! ఎవరు శత్రువులో, యెవరు మిత్రులో గుఱుతింపఁజాలకున్నాను. శత్రువాహినీ నివహమొక మహార్ణవము మాడ్కి—

ముర—తథాపి—

చం॥గు—ఇందు 'తథాపి' లేదు. నేను మరణము వాంఛించుచుంటిని. అదిగో! సంగ్రామకోలాహలము!—సైనికా!

[సైనికుఁడు ప్రవేశించి అభివాదన మొనరించును.]

చం॥గు—ఈక్షణమే నేను రణక్షోణి కరుదెంచుచుంటిని. పార్శ్వరక్షకులను సిద్ధముగ నుండుఁడని యాజ్ఞాపింపుము. అదిగో! తూర్యనాదము మరల మరల వినఁబడుచున్నది—పొమ్ము! శీఘ్రముగఁ బొమ్ము!!

(సైనికుఁడు నిష్క్రమించును. నేపథ్యమున "జయ్! మహారాజు చంద్రగుప్తునకు జయ్!!" అను జయధ్వానము వినంబడును.

చం॥గు—ఏమాధ్వానము! చంద్రగుప్త మహారాజునకు జయమా? నేను స్వప్నము వీక్షించుచుంటినా!—కాదు కాదు. అది శాత్రవుల—వ్యంగ జయనినాదమైయుండును. చంద్రగుప్త మహారాజు జయము చాణక్య చంద్రకేతులతోడనే నిర్వాసితమైపోయెను. అదిగో! ఆరవము మఱింత నికటమున వినంబడుచున్నది! ఇదె చెంతఁజేరుచున్నది! ఇదిగో! ఇదిగో!! కర్ణములందు!!! ఆహా! ఇది పరిచితస్వరము! వీర లెవరై యుందురు?

[వెనుకకుఁ దరలును.]

[రక్తాక్తకాయుఁడైన చంద్రకేతు, ఛాయ, చాణక్యులు ప్రవేశింతురు.]

చం॥గు—స్వప్నము! స్వప్నము!!

చం॥కే—ప్రియసఖుఁడా! అరుదెంచితిని. అంఘ్రిద్వయము బట్టి గురువర్యులఁ గొనివచ్చితిని. ఇఁకేమియు భయములేదు.

"గురుదేవా! రక్షింపుఁడు!! రక్షింపుఁడు!" అని మురా చంద్రగుప్తులు చాణక్యుని పదతలమందుఁ బడుదురు. ఛాయ మురను లేవనెత్త నుద్యమించును.

చాణక్య—మురా! లెమ్ము. చాణక్యుఁ డన్నిఁటికి సమర్థుండు. మృతమానవులను మాత్ర మాతఁడు మరల బ్రదికింపఁజాలఁడు.—చంద్రగుప్తా! ఎట్టి భయమును లేదు. లెమ్ము. ఈముహూర్త మందే యుద్ధాంగణమున కగ్రసరుఁడవు కమ్ము. చాణక్యుని సృష్టిని వ్యర్థమొనరించుట యవనులశక్యమా?

[మురా, చంద్రగుప్తులు లేతురు.]

చం॥కే—(క్షణ మూరకుని) మిత్రమా! అనిమేషాక్షుండవై చూచుచు నిలువంబడి పోతివేల?—రమ్ము! ఇవ్విపత్సమయమం దొకసారి పరస్పర భుజ మృణాళవేష్టాబద్ధులమై దృఢపదంబున నిలుతుము రమ్ము! మన వక్షములపై క్షోణీధరం బొం డాకస్మికముగ విఱిగిపడినను, అది చూర్ణ విచూర్ణము కాక మానదు!

చం॥గు—చంద్రకేతూ!—ప్రియసోదరా! నా బహిఃప్రాణమా!!

[చంద్రకేతు నాలింగన మాచరించుకొనును.]

## షష్ఠరంగము.

మగధయందుఁ జంద్రకేతు గృహము—రాత్రికాలము.

(ఛాయ, చెలిమికత్తెలు)

ఛాయ—ఆహా! నేఁ డెట్టి సంతోషదినము!! అక్కలారా! మన మందఱము నేఁ డాటపాటలతోఁ గాలముఁ బుచ్చుదము. ప్రత్యహమందువలె గాక నేఁడు మీతో నే నాహ్లాదక్రీడలఁ దేలుదును. చంద్రగుప్త మహారాజు యవనుల నాలమం దోడించి, తాను విజయరమ కృపఁబడసెను. ఆహా! నేఁ డెట్టి యాహ్లాదజనక దివసము!!

1వ. సఖి—(నవ్వుచు) సఖీ! నీవాతని జయగానము సల్పుదువు కాని, దాని నాతఁడు వినఁగలుఁగునా?

ఛాయ—వినఁగలిఁగిన నేమి! వినఁగలుఁగకున్న నేమి!! నాగానమందు నా యానందము. సఖీ! వసంతాగమనమున మారుత హిల్లోలమునఁ బ్రకృతి పత్రపుష్పములందుఁ దనంతదాను శిహరిత యగుచుండుట నీవు కనుంగొనియుండలేదా? ఆహ్లాదమునఁ దాను బులకితాంగియైయుండు టోరు లుపలక్షించుచుంటిరో లేదో యని ప్రకృతిరమణి వీక్షించునా? మహీజముపైఁ గోకిలము తనంత తాను పాడుకొనుచుండును.—ఎవ్వరైన తన గానమును వినుచుంటిరో లేదో యని యది తలంచునా? తన పాట నోరులు విని నను, విన్నకున్నను అది తన సుఖమునఁ దాఁ లీనమైయుండును.

2వ. సంగిణి—నీవాతని వలచితివికదా? ఆతఁడు మరల నిన్నుఁ బ్రేమింపవలెనను వాంఛ నీకు లేదా?

ఛాయ—నాయనురాగమేనాసంపత్తి. నా ప్రేమ తనతోఁ దానే పూర్ణమై యుండెను. ఆతనిఁగాంచుటకవకాశము లభింపలేదు.

శివ. సఖి—అతఁడు నిన్నేమియు ప్రేమింపకున్నను, నిజప్రాణములఁ దుచ్ఛమొనరించి, నీవాతని ప్రేమసుధలఁ గాఁపాడితివి? ఇది యబ్బురము కాదా?

ఛాయ—నాకే సహస్రప్రాణములుండియున్నయెడల, ప్రమోదమాన నసై వానినన్నిఁటి నేనాతని యంఘ్రిసరోజములకడ సమర్పించు దానను—కాని, దుఃఖవిషయమేమన: ఆతని కీయందగున దేమియు నాకడలేదు.

సఖి—నీకు లేనిదేమి?

ఛాయ—ముఖ్యముగ నాకు లేనిది సౌందర్యము.

శివ. సంగిణి—నీకు సౌందర్యములేదని యెవరనిరి?

ఛాయ—నాకు సౌందర్యమేయుండిన, నాతఁ డొకమాఱైనఁ గన్నెత్తి నన్నుఁ దిలకింపకుండునా? విశ్వమందెంత సౌందర్యమున్నదో, అదంతయు నన్నాశ్రయించుగాకయనియు, నేనాసౌందర్యరాశిని గోముఖధారచాడ్పున నశ్రాంతధారగ నాతని పదకమలముల కర్పింతుఁగాక యనియు వాంఛింతును. కాని, నాకు సుమంతైన సౌందర్యము లేదు.

1వ. సఖి—నెచ్చెలీ! నీ కమూల్యహృదయ మున్నదికదా?

ఛాయ—పురుషునకది యక్కఱలేదు. పురుషునకుఁ గావలయునది కాంత శరీరకాంతియే!

2వ. సఖి—పురుషుఁడు పట్టి నిర్బోధుఁడు.

ఛాయ—(దీర్ఘనిశ్వాసమువిడచి)—మీరు నన్ను విలపింపఁజేయు దురు.—వలదు! వలదు!! నేడు మహోత్సవము! ఉత్సవ క్రీడలఁదేలుఁడు. మీజాగరణ మ్లానముఖములపై ప్రభాతప్రభా కర భర్మరశ్మిపడనంతదనుక,—విహంగకలాపకలరవము మీ శ్రీణాయమానకంఠరవముతోఁ గలియకున్నంతదనుక, మీఁరలత్యం

తాహ్లాదమున నుత్సవ మొనరింపుడూ!—నంగిణులారా! పాడుడు!

గీతము

హాసనరేఖలు వికసింప నధరమందు;
దివ్యదీప్తులు కన్నులఁ దేజరిల్ల;
గానలహరిని పొంగించి గగనమందు;
నృత్యక్రీడలఁ దేలుచుఁ బ్రీతిమీఱ;
సౌఖ్యవారాశినీఁదుచుఁ జింతఁబాసి;
స్వర్గలోకముఁ బుడమికి వ్రాలఁజేసి;
తేని జయముఁ గీర్తించి నీరేయి మనము,
శాంతిలక్ష్మినిఁ గొల్తుమో కాంతలార!

[మురప్రవేశించి దూరమున నిలువంబడి]

ముర—(ఛాయను విలోకించి)—ఛాయా! సుగుణరాశీ!! ఉత్సవ మత్తవై యుంటివా?—అభాగినీ! మహాత్ముఁడగు నీ సైదోడు సమీకమందు మేనువీడి వీరస్వర్గముఁజేరెనని యెఱుంగవు! పాపము నీవాహృదయవిదారకవార్త వింటివేని—వలదు! వలదు!!—ఆదుర్వార్తను నేను మోసికొనివచ్చు టెందులకు? చెడుమాటలఁ జేరవేయువారికి జగమందెట్టికొదువయును లేదు! (ముందునకు వెచ్చి)—ఛాయా!

ఛాయ—[చకితయై] ఎవరు? [వెనుకకు జూచి] ఓహో! దేవియా!! జననీ! జోహారు!!

ముర—సుఖీభవ! అమ్మా! వార్త యొకటికలదు.

ఛాయ—అదేమి?

ముర—ఇంతకాలమునకు నాజీవన మనోరథము పూర్ణమాయెను. [ఛాయను ప్రేమపురస్సరముగ వక్షము కడకులాగుకొని] అమ్మా! నీవు నాగృహలక్ష్మివి!—భారతభవిష్యసామ్రాజ్ఞివి!!

ఛాయ—రాజమాతా! చంద్రగుప్తుని పత్నీత్వమును, భారతసామ్రాజ్ఞీత్వమును,—రెంటినికూడ సహసంబుగనే నే నేవగింతును. చంద్రగుప్తుఁడు భారతసార్వభౌముఁడే కావచ్చును—ఛాయకూడ రాజకన్యయని యెఱుంగవా ? నాతో నీ యుపహాసమేల ?

మురి—ఛాయా ! అట్లనుచుంటివేల ? నీతో నే నెన్నఁడైన పరిహాసము సల్పితినా ? అమ్మా ! నే నుడివినది నిక్కమగుమాటకాని పరిహాసోక్తి కాదు.

ఛాయ—[అర్థస్వగతమున]—నిక్కమా ! నిక్కమా!! ఇది తలంపునకతీతమైనది కాదా ?—నిష్ఠురసౌభాగ్యము కాదా ?—అదె—అంత—ఆకస్మికము !— ఇంత తీవ్రమా !— అ !—అదె !—అదె !!—ఓః !—అసహ్యము !—అమ్మా ! అమ్మా !!

[మురి వక్షముపైబడి క్రందన మొనరించును]

మురి—ఏమి తల్లీ ! విలపించుచుంటివి ?

ఛాయ—జననీ ! విలపింపను—దేవగణములారా ! పుష్పవృష్టి గురిపింపుఁడు—ఏమది ! అంతరిక్షమంత నీలమై, అంతగాఢమై, అంతయుజ్జ్వలమై కానంబడుచున్నది ! పృథ్వియంతయు మందారసౌరభముతో ఘుమఘుమ లాడుచున్నది ! మారుతమంతయు వీణాఝంకారముచే నిండియున్నది ! ఇదేమి !—నేను స్వర్గమందుంటినా, లేక మర్త్యమందుంటినా ? సుమశయ్యపై శయనించియుంటినా, లేక మలయహిల్లోలమందుఁ గొట్టుకొనిపోవుచుంటినా ?—నే నెందుంటిని ?—ప్రియతమా ! నీ వెందుంటివి ? ప్రాణాధికమా ! నీవెచట నుంటివి ? అడిగో ! అడిగో నాచంద్రగుప్తుఁడు !! (ఆకస్మికముగ నతజానువమై)—ప్రాణేశ్వరా ! జీవనసర్వస్వమా ! క్షమింపుము. రూఢోక్తులఁ బెక్కులాడితిని. నే నభాగినిని ! పితృరహితను ! మాతృవిహీనను ! నిర్బోధనిస్సహాయ బాలికను ! నాయం

దెన్నెని దోషములున్నవి. క్షమింపుము. (కరములఁ జోడించి, వాని నూర్ధ్వమున కెత్తి)__ఈశ్వరా! దీనిఁ బూర్ణమొనరింపుము!__ ఇది స్వప్నము కాకుండుగాక!

(ఊర్ధ్వమునకుఁ జూచుచుండును).

[చాణక్యుఁడు ప్రవేశించును.]

చాణక్య__మురా!__ఇదేమి?__ఇదంతయు నేమి?

ముర__విజయోత్సవము.

చాణ__ఆహా! [క్రియత్కాలమనిమేషనేత్రుండై ఛాయను విలోకించి దీర్ఘనిశ్వాసము విడచి]__పోనిమ్ము!__మురా! నేను సంధినల్పితిని. సంధిపత్రమందింకను సంతకములుమాత్రము కాలేదు.

ముర__గురుదేవా! సంధినియమములేమి?

చాణ__చంద్రగుప్తమహారాజు సెల్యూకసున కేనూఱు వారణముల నొసఁగునట్లును, వానికి మాఱుగ హిందూకుషుకుధరమునకు దక్షిణపూర్వ దిశలగల సమస్తవిజితరాజ్యమును సెల్యూకసు చంద్రగుప్తున కర్పించునట్లును, సంధి చిరస్థాయిగ నుండుటకై చంద్రగుప్తునకు సెల్యూకసు తన తనయనిచ్చి పెండిలిఁ గావించునట్లును మరతు లేర్పఱుపఁబడెను.

మురా__గురువర్యా! అట్లేర్పఱచితి రేల?__నాకు స్వామాట్టు కొమరిత యక్కఱలేదు (ఛాయను గాఁగిలించుకొని)__ఈమెయే నాకోడలు!

చాణ__ఇది చాణక్యుని మంత్రణము!

ముర__పాప మీ యబల__

చాణ__రాజ్యకళ్యాణార్థము నిశ్చయముగఁ దుచ్ఛస్వార్థమును ఛాయ బలిగానొసంగఁగలదు!

(నిష్క్రమించును.)

మురా—అమ్మా! ఇదేమి!—నీముఖమంతయు బూదివలె పాంశు వర్ణమైపోయెను!! నీచక్షులు నిష్ప్రభలై స్థిరదృష్టిఁ బ్రసరించుచుండెనేల? నీయోష్ఠములు విభక్తములై యవ్యక్తవేదనము సూచించుచుండెనేల? నిశ్చలపాషాణ ప్రతిమచాడ్పున కదలమెదలక నిలువంబడితివేల? హా! అభాగినీ!! అమ్మా!!!

(నిమీలితనేత్రయై నిష్క్రమించును.)

ఛాయ—బ్రాహ్మణా! తుచ్ఛమందువా? అవును స్వార్థము నిక్కముగఁ దుచ్ఛమైనదే! కాని—దీనిని, అయ్యో, యీనెగులును—పాఱుఁడా! నీవేమెఱుంగుదువు? పురుషునికడ స్త్రీ సుఖదుఃఖములు,—కేవల మవియే యననేల స్త్రీ జీవనమే తుచ్ఛము!—పరాత్పరా! ఏమిట్లొనరించితివి? ఇదే యొక్కపుడే ప్రేమ, మృత్యువులు; ఆశానైరాశ్యములు; స్వర్గనరకములు కాన్పించినవి!! ఆహా! పృథ్వి ఘూర్ణిల్లిపోవుచుండెను!! అంతరిక్షమం దొక్కొక నక్షత్ర మొక్కొక సూర్యునిలీల జ్వలించి, తోడనే నిర్వాణమగుచున్నది! యశోగాథ యొండు మృదంగతాళములతో మేల్కాంచి అల్లదె దీర్ఘశ్వాసమందుఁ గలసిపోవుచున్నది!!—అదె! అదే!!

[ఊర్ధ్వమునకుఁ జూచుచు నిలచియుండును.]

# చంద్రగుప్త

## పంచమాంకము

### ప్రథమరంగము

నందుని పూర్వోక్తప్రమోదోద్యానము—రాత్రికాలము.

(సెల్యూకసు హెలెనులు)

సెల్యూ—బర్బరజాత్యుద్భవుండగు చంద్రగుప్తునకు యవనసార్వభౌముఁడగు సెలూకసు తనయ యర్ధాంగి యగుటయా? ఈహేయ సంధిచే నేను ముక్తిఁగ్రియ మొనరింపను. అందుల కెన్నఁడు నా చిత్త మియ్యకొనదు.

హెలెన్—జనకా! మీకీదర్పమిఁకఁ దగదు. చేయరాని చెయ్దమొనరించి తామవమాన శిఖరాగ్రము నధిష్ఠించితిరి. మీపరిభవచూడాంత మెల్లఱకు విదితమాయెను. అట్లయ్యు మీ రింకను శిర మెత్తుచుండిరి. మీరించుకైన బిడియము పడకున్నందులకు నే మిగుల నచ్చెరువొందుచుంటిని.

సెల్యూ—శాత్రవులను తారుకొంటిని—విఫలమనోరథుండనైతిని. ఇందు బిడియపడవలసిన దేమున్నది?

హెలెన్—భారతీయులు మీకు శాత్రవు లెట్లాయిరి? వారలను శాత్రవుల గావించినది మీరలేకదా. మిమ్మెవరు వారలఁ దూర్కొనమనిరి? చంద్రగుప్తుఁడు సల్పిన యపరాధ మేమి? యవనులతో నాతఁడు కయ్యమునకుఁ గాలు ద్రువ్వలేదు. సింధు నిర్ఝరిణీ పరకూలమున నిర్విరోధంబుగ నాతఁడు రాజ్య మేలుకొనుచుంట దా మోర్వజాలఁరైతిరి. 'వలదు వల' దని మిమ్ము నే ననేక

మాఱులు నిరోధించితిని. నన్నా వేడికోలుఁ దోసిపుచ్చి ముందున కుఱికితిరి. ఇపుడు తగు ప్రతిఫలమే ప్రాపించెను.

సెల్యూ—విజాతీయుల విజయము నిన్ను బరమహర్ష సంభరిత మానసఁ గావించుచుండెను కాఁబోలు!

హెలెన్—ఏల కావింపదు? విప్లవకారులైన యవనులు పరాజితులైరి. కాని ధర్మము జయోపేత మాయెను. జనకా! ఒక ప్రతిష్ఠిత రాజ్యశాంతిని భంగ మొనరింప నెవఁడగ్రేసరుండగునో, ఆతఁడు వెలుపలి శత్రువైనను కానిమ్ము. లేక రాజ్యప్రజయైనను కానిమ్ము. మహాపాతకియని యెఱుంగుఁడు. విజయ గౌరవోద్దేశ్యంబుననో, యుద్ధామ ప్రవృత్తి తాడనంబుననో లేక చిత్తచాంచల్యము కతననో పల్వుర మాతలఁ బుత్రహీనులఁ గావించి, బాలికలఁ బితృరహితలఁ జేసి, పత్నుల పతి విహీనలఁ గావించి దేశమందు గభీరాతంక ముత్పన్న మొనరించుటకంటె మహాపాప మేమికలదు?

సెల్యూ—అట్లైన నే నట్టి మహాపాప మొనరించితి నందువా?

హెలెన్—అట్లని వేఱుగ నే ననవలెనా? తా మిప్పు డనుభవించు ఫలమే దానిని చెప్పక చెప్పుచుంటలేదా?

సెల్యూ—సవరమందు జయపరాజయము లనివార్యములు. ఇపుడు పరాజితుండ నేనైయెనను, ముక్తి ప్రాపించుచో మరల మృధమున కరిగి జయరమాలలామను చేపట్టఁ జాలకుందునా?

హెలెన్—'ముక్తి ప్రాపించుచో' యనుచుంటిరి. ముక్తికొఱకై సభ్యజాత్యుద్భవులైన తాము బర్బరజాత్యుద్భవుని కనికరముపై నిర్భరులై యుందురా? 'అయిన జయము కాకున్న మృత్యు' వను మీ ప్రతిజ్ఞ యెందరిగెను? ముప్పు దెచ్చుకొని, ముక్తి నభిలషించి, ముక్తిదాతను మరల మృధమునఁ దార్కొందురా! సభ్య

జాత్యుద్భవుల యెడఁదలం దింత కుత్సిత, మింత కృతఘ్నత యడంగియుండుఁ గాఁబోలు—ఆహా! ఏమి యధఃపతనము!

సెల్యూ—కుమారీ! ఇవి కడుపుంబుట్టిన కన్నియ నోటనుండి రావలసిన నుడువులా? ఆహా! ఇదె నా దుర్గతియొక్క చరమసీమ! ఇంతకంటె నధిక మేమి కాఁగలదు? మాతృహీన యైనప్పటినుండియు నేన మాతయుఁ బితయుఁగూడ నై, కంటిపాపకరణి నేబిడ్డను కాంచుచు వచ్చితినో, సుమంతైనవినుగుఁ జెందక యేబిడ్డను చంక నిడుకొని మంచిమాటలచే మాతను మఱపునకుఁ దెచ్చి, వలయు స్థానములఁ ద్రిప్పి వదపడి ఱొమ్మున నిదురఁ గొలిపితినో, ఆఁకలన్నపు డేబిడ్డకుఁ బ్రేమమెయి గోరుముద్దలఁ గుడువఁబెట్టి, వలయు దాని నొసఁగి పెంచి పెద్ద గావించితినో, విజయయాత్రార్థము సర్వస్వముఁ ద్యజించియు, నేబిడ్డ నొక్కతెను మాత్రము విడిచి రాఁజాలనైతినో విధివశంబునఁ గాఁబోలు నా బిడ్డయే— కడుపునఁ బుట్టిన ఆ యేకాత్మజయే యిట్టి కఠినోక్తు లాడుచుండ—ఆహా! ఏమి దుర్గతి! ఏమి దుష్కర్మ!—(కంపితస్వరమున)—ఈ పరాజయశల్యము నా హృదయము నంతగా నొవ్వఁ జేయలేదుకాని, కడుపునఁ బుట్టిన బిడ్డ పలుకుములుకుల బోలు పలుకులు—హా!

(అధోముఖుఁ డగును.)

హెలెన్—జనకా! నే ననుచితోక్తుల నాడితిని. మన్నింపుఁడు.

సెల్యూ—నీయం దొప్పమి యేమియు లేదు. తప్పంతయు నాయదియే. నీవే నన్ను మన్నింపుము.

హెలెన్—తప్పునా యదికాని మీయదికాదు; కాని మిక్కుటమగు యాధికతన, ననిర్వాచ్యంబగు హృదయజ్వాలహేతుకంబున, దుర్భర దుఃఖకారణంబున నే నట్లంటిని. కాని ఆ నుడువులు ఘృణాజనితంబులని తలంపకుఁడు. పుత్రునెడ మాత జూపు క్రోధంబు

భాతివై ఆకిన్కప్రేమజనితం బైనదని యెఱుంగుఁడు! అతిక్త హాలాహల మనంత సుధాబ్ధి మంథనసముద్భూతంబైనదని యెఱుంగుఁడు! జనకా! తాము ముక్తులు కండు. ముక్తిఁ బడసి యవనుల కాపాదించిన పరిభవావమానమునకుఁ బ్రతీకారము నల్పుఁడు. చంద్రగుప్తునకు నన్నిచ్చి పెండిలి గావించి, నా మూలమున స్వేచ్ఛఁ బడయుఁడు.

సెల్యూ—అట్లొనర్చుట నా యభిమతము కాదు. నిజముక్తి కొఱకై నే నామూల్య మొసఁగఁజాలను.

(చంద్రగుప్తుఁడు ప్రవేశించును.)

చం॥గు—వీరవతంసమా! ఆమూల్యము కాని, మ తేమూల్యము కాని యక్కఱలేదు. వినామూల్యమున మీకు ముక్తి నొసఁగుచుంటిని. ఇచ్చగలదేని, తాము నా మగధను ముట్టడింపుఁడు. ప్రత్యర్థులఁ బ్రకటించు టట్లో చంద్రగుప్తుఁ డెఱుగును. అందుల కాతఁ డజస్రము సిద్ధముగనే యుండును. ఇపుడు మీ కిచ్చవచ్చిన నెలవున కరుఁగుడు. రాపుత్రి! నీ జనకు ననుసరించి చనుము. మీ రిరువురుకూడ ముక్తుల రైతిరి—శరభకా!

సెల్యూ—ఏమిది?

చం॥గు—సార్వభౌమా! హిందువు లనాగరకులు బర్బరులు కారు. పురుషోత్తమునెడ సికిందరు చూపిన సౌజన్యమునకుఁ బ్రత్యుపకృతిగ వీరుండగు యవనాధిపతికి వార లుచితాచరణము చూడనేర్తురు. శూరవరా! ఇఁక నిజసీమకు మరలిపొండు. మీరు ముక్తులైతిరి—శరభకా!

(కతిపయకావరులతో శరభకుఁడు ప్రవేశించును.)

చం॥గు—శరభకా! వీ రిరువురు ముక్తులైరి. సార్వభౌమా! ఇఁక

సెలవు.

(నిష్క్రమింపఁబోవును.

సెల్యూ—(సాశ్చర్యముగ)—భారతాధీశ్వరా! నిక్కముగ నీవు మహాత్ముండవు. ఒకప్పు డీవు నా ప్రాణములఁ గాఁపాడితివి. ఆ యుపకారము నేను మఱువలేదు. ఇపు డెట్టిషరతు లేకయె, మా కీవు స్వేచ్ఛ బ్రసాదించితివి. ఈ నీమహాత్కార్యముఁగూడ నే మఱువను. ఇంతకుమున్ను ప్రస్తావితంబైన సంధినియమములం దించుమించుగ నన్నిఁటికిని నే సమ్మతించితిని. నే వీడివైచిన సామ్రాజ్యఖండమును సాధ్యమగుచో పదంపడి నిజ బాహుబలమున మరల నిజాధీన మొనరించుకొందును. మఱొకమాట! ఇత్తఱి నీకు నా తనూభవ నొసఁగి పాణిగ్రహణ మొనరింపఁ జాలను. హిందువుండవగుటంజేసియే నిన్ను నే నల్లుఁగాఁ బడయ నొల్లను.

హెలెన్—హిందువుఁడుకూడ మనుజుండేకదా!

"నందనీ!" యని సెల్యూకసతి విస్మయమున హెలెనను వీక్షించును. ఆమె శిర మవనత మొనరించును.

చం॥గు—రాజపుత్రీ! గ్రహించితిని. ఇది నాకు మహాత్సన్మానము. కృతజ్ఞతాపురస్సరముగ దీని నొడలఁ బూనుచుంటిని—(సెల్యూకసును ద్దేశించి)—కాని, శూరాగ్రేసరా! నేనీభిక్షఁ గైకొనుట కశక్తుండను. మీ కుమారియెడఁ బ్రేమ ముగ్ధుండనని ముక్తకంఠమున నే నొప్పుకొనుచుంటిని. అట్లామెయెడ ననురాగినైయుండుటకు నేఁడే ప్రథమదివసముకాదు—ఏనాఁడు నా కైశోరయావన సంధిస్థలమున, సింధునదతటమున, నిదాఘసముజ్జ్వలసంధ్యాలోకమున నీ కాంత శాంతముఖబింబము నాదృగ్జాలమునఁ దగుల్కొనెనో, ఆ నాఁటనుండియు యీ ఫుల్లసరోజాక్షి నహర్నిశము

లస్మద్ధ్యానమున కథానాయకియై నా కల్పనావీణను మోహంపు తంత్రిచే బిగియఁగట్టి, తనవలపు టంగుళములచే నా తంతిని మీటి ప్రేమ మధురగానలహరిచే నాహృత్సీమనంతయు సిక్తమొనరించి వైచెను. ఆ యౌవనస్వప్న మొకప్పుడు సఫలము కాఁగలదనియు నా మానసప్రతిమ మూర్తిమంతమై నా మ్రోల నిలువంబడునని యు నే నెన్నఁడుఁ బ్రత్యాశించియుండలేదు. అట్టి పేరాస నాకు సుంతైన లేదు. నేఁడా గౌరవ, మా యుత్సవ, మా స్వర్గము నాముష్టిగతమైనను, నా కఠినస్పర్శచే నది తొలఁగిపోయెను. దానిఁబడయు దురాశ నాకేల?—సార్వభౌమా! నా కాపద్బాంధవుఁడైన చంద్రకేతు మృత్యుకాలమునఁ దన సోదరీమణిని నా కరముల నర్పణమొనరించి చనెను. ఆ యణుమధ్యను, నే నర్ధాంగలక్ష్మిగఁ బడయవలయుననియే ఆతని యంతిమకాలానురోధము. నెయ్యని మనోరథముఁ దీర్చుటే నా కర్తవ్యము. దానంజేసి మలయరాజ దుహితయగు ఛాయయే భారతభావిసామ్రాజ్ఞి కాఁగలదు.

[ఆకస్మికముగ ఛాయ ప్రవేశించును].

ఛాయ—నిక్కముగ నిది భారతాధిపుల యనుకంపము. కాని, ఛాయ యేతదనుగ్రహదత్తసమ్మాన భికారిణి కాదని యెఱుంగుఁడు. భారత సార్వభౌమునకుఁదగు మహిషి యీ యవన మహీపతి దుహితయగు హెలెనే. (హెలెనును సంబోధించి) సీమంతినీ చూడామణీ! చంద్రగుప్త మహారాజు నీయెడ ననురక్తుండై యుండుటకు నీసౌభాగ్య మెంత శ్లాఘ్యమైనది! స్వచ్ఛందచిత్తంబున నేను, నాహృదయనిధిని, నాసర్వస్వమును నీకు దాన మొనరించుచుంటిని. సోదరీమణీ! దాని నీవు ప్రమోదచిత్తవై ప్రతిగ్రహింపుము. (ఇట్టులని ఛాయ అసంయతపదక్షేపమున హెలెను కడకరిగి, ఆమె కరకమలముల, నిజహస్తపల్లవములం దిడుకొని,

స్థిరమూర్తియైయున్న చంద్రగుప్తుని పాణులందు వానిఁగలిపి)—. ఈయమూల్యరత్నమును నీవనుమునఁ దాల్పుము. ఈ ముహూర్త మత్యంత గౌరవాన్వితమైనది. కాని,—కాని, యెట్టిమూల్య మొసఁగి నే నీ గౌరవమును క్రియ మొనరించితినో సోదరీ! నీవు గ్రహింపఁజాలుదువా? హా! హృదయమా!! నీకీ యావేగమేల? ఏమి యీయాధి!—

[వసనాంచలిచే నేత్రములఁ గప్పివై చుకొని
ద్రుతపదయై నిష్క్రమించును.]

చం॥గు—(స్వప్నోత్థితుని చాడ్పున నర్ధస్వగతమున)—కాదు-కా—కాదు!!— ఇది కానేరదు!— ఇది కానేరదు!!—చంద్రకేతూ!—కాదు!!—ఎన్నఁటి కదివదలదు!—సార్వభౌమా! మీరలు ముక్తులు! (చంద్రగుప్తుఁడు చింతితభావమున నిష్క్రమించును. ఆతఁడు వెడలిపోఁగనే సెల్యూకసు తనయను సంబోధించి—"అమ్మా! ఇదంతయునేమి?" మనును.

హెలెన్—నాకేమియు బోధపడుట లేదు.

సెల్యూ—నీవు చంద్రగుప్తునిఁ బాణిగ్రహణ మాచరించుకొందువా?

హెలెన్—ఆచరించుకొందును—జనకా! అందులకు మీయనుమతిఁ బ్రసాదింపుఁడు.

సెల్యూ—అనుమతి కావలెనా? ఆహా! కాలమహిమ! ఇట్లుస్వప్న మందైనఁ దలంచియుండలేదు.

(చింతితభావమున నిష్క్రమించును.)

హెలేన్—జనకా! ఈ వివాహామాడుట కేనేల యియ్యకొనుచుంటినో నీ వే మెఱుంగుదువు? తర్కముకాని, ప్రార్థనకాని, అనునయముకాని యింతకాలము సాధన మొనరింపఁజాలనిదాని నీ పరిణయముచే సాధన మొనరింతును. ప్రేమింపఁజాలకపోదునా?

నిస్తంద్రప్రతిభాసమన్వితుఁడై, నిర్విక్రమ పరాక్రమోపేతుండై, కరుణారసపూర్ణచక్షుయుగళుండై, ఉదారహృదయుండై, భారత మహీరాజ్యరమానాథుండైన సరోత్తమునిఁ బ్రేమించి వితథమనోరథ నగుదునా?—అనురాగమా లేక యాత్మోత్సర్గమా? ఏమైనఁ గానిమ్ము! హెలె నిరుజాతి హితైషి! శాంతాకాంక్షి!! ఇఁక నాతఁడో!—ఏంటిగోనసూ! క్షమింపుము!! ఈశ్వరా! నా హృదయమునకు బలముఁ బ్రసాదింపుము!! హెలెనూ! ధీర చిత్తవు కమ్ము!!

[నిష్క్రమించును.]

## ద్వితీయరంగము.

చాణక్యుని యావాసము.—ప్రభాతకాలము.

చాణక్యుఁ డేకాకియై యుండును.

చాణక్య—ఒకమహార్ణవము!—తరంగహీనము! శబ్దహీనము!! అంతము లేదు!!! కనుచూపుమేర మృత్యువుమాడ్కి నాసింధువు స్థిరమై కానవచ్చుచుండెను.—(మెల్లగఁ బచారిజేయుచుఁ దీర్ఘవిశ్వాసమువిడి)— అనురాగాభావమును శక్తిపూర్ణ మొనరింపఁజాలదు. హృదయసంచితమగు నాకాంక్ష గైరికనిస్రావము కైవడి బైకిలేచి భస్మమై పల్వలనులఁ జెదరిపోవుచుండెను. హృదయాంతస్తమస్తరమునుండి లేచి, ప్రణయోత్సము మస్తిష్క తీవ్రజ్వాలాస్పర్శచే బాష్పంబై యెగసిపోవుచుండెను.—(దూరమున నాలోకితమై తోఁచు ప్రాంతరమువైపుగ స్థిరదృష్టుల సారించుచు)—అదే! సుందరప్రభాతము! అదే!! గాఢనీలాభ్రము!!! మున్ను నేనీయద్భుతదృశ్య—ఎవరు?

(నల్వంకల భటు లనుగమింపఁ గాత్యాయనుఁడు ప్రవేశించును)

చాణ—ఇదిగో! వచ్చితివా? మిత్రకులకుంజరమా! రమ్ము.

కాత్యా—మంత్రిమహాశయా! నాతోఁ దామిపుడు వ్యంగము సలుపు టెందులకు? కైదినై నేను మీ ముందర నిలచియుంటిని. ఒప్పమి యొనర్చితిని—దండన విధింపుఁడు.

చాణక్య—కింకరులారా! వీని సంకెలల విప్పి వేయుఁడు!!

(భటులు బంధనోన్మోచన మొనరింతురు.

చాణ—ఇపుడిఁక నీవు నాకై దీవి కావు. మన యుభయులనడుమ నిఁకఁ బ్రభేద మేమియు లేదు.

కాత్యా—నిక్కమే! ప్రభేద మేమియు లేదు. విచ్చుకత్తులఁ గేలఁ బూని దండధరు భృత్యుల చాడ్పున మీకింకరులు మట్టుపెట్టుటకు మాత్రము నన్నుఁ జట్టి యుండిరి!

చాణ—కింకరులారా! మీ రావలి కరుగుఁడు!

(భటులు నిష్క్రమింతురు.)

చాణక్య—మిత్ర శమంతకమా! ఇఁక మనయందుఁ బ్రభేద మేమున్నది!

కాత్యా—ప్రభేదము లేకేమి? ఇప్పుడైన భవదింగిత మొక్కండువలన నీకైది యైనను నైదుపున కెరకాఁ గలదు! ఈ ముహూర్తమే నా జీవన శేషముహూర్తము కాఁజాలును! నేను బందీని. మీరో యొక విశాల సామ్రాజ్యమునకు సర్వమయకర్తలు.

చాణ—ఇదే ఈ ఛురికమును చేకొనుము. నావక్షమునం దామూలము దీనిని గ్రుచ్చి, నీమంత్రిత్వ పదమును పరిష్కారము గావించు కొమ్ము.

(ఛురిక నొసగును.)

కాత్యా—అమాత్యవరా! మీయభిప్రాయ మేమి?

చాణ—(అతని మాట వినిపించుకొనక)—కాత్యాయనా! నీవు

కావింప నేరని కర్జములను క్రాంతించితిని. సామ్రాజ్యమును కదంబించి యున్న సాంద్రగహనమును భేదించివైచి నేలనంతయుఁ బరిష్కార మొనరించి వైచితిని. ఊషర ప్రాంతరమునొందు యుర్వరక్షేత్రముగఁ బరిణత మొనరించితిని. ఈవిశాల సామ్రాజ్యమందిత్తఱి ప్రశస్తశాంతి విరాజిల్లు చుండెను. బాహిరమున నాతతాయులు భీతిచేఁ గంపించుచుండిరి. రాజపథ పార్శ్వమున విత్తమువీడి పథికులు నిర్భరమున నిదురింపఁ గలుఁగుచుండిరి. కాని, ఈ మహాశాంతి మహీధ్రమువోడ్కి స్థిరమై, నిష్ప్రాణమై యున్నది. ఉండనిమ్ము.—ఇఁక నేనశక్తుండను. ఏమియుఁజేయఁ జాలను. ప్రాయశః నీవు కార్య నిర్వహణ మొనరింపఁ జాలుదువు. వలయుచో మంత్రిత్వ మిప్పుడ నీకు విడచి వైచెదను.

కాత్యా—అమాత్యశేఖరా! మీరతి కూటస్వభావులు. మీయభిసంధిని హృదయంగమము కావించుకొనుట నావంటి జడున కసాధ్యము.

చాణ—కావలయునందు వేని నాయమాత్య పదవి నీమహార్త మందే పరిత్యజించు చుంటినని ఇదె నాయజ్ఞోపవీతము స్పృశించి వాగ్దాన మొనరించు చుంటిని. మూర్ఖుండ వేయయ్యు నీకు హృదయముకలదు. నీవుచాలుదువు—నేను చాలను.

కాత్యా—సర్వంకషప్రజ్ఞా! ఇట్లు వచించుచుంటిరేల? విప్రప్రభుత్వమును క్షమతాశిఖరము నధిష్ఠింపఁజేసి—

చాణ—అంతయు వట్టిభ్రమ! హృద్ధయమును దీర్ఘోపవాసమునకు లోనుగావించి, శాసన మొనరించు టెట్లుచెల్లును? నా కఠోరశాసనంబున స్వప్నప్రాసాదముచాడ్పున నభోమండలమును భేదించి యూర్ధ్వమునకుఁ జనిన శక్తి స్వప్నప్రాసాదములెనే అభ్రగర్భమందు లీనమైపోవుట నిక్కమని యిపు డేనుగ్రహింపఁగలిఁగి

తిని. ఇపుడు కానంబడునది గేహముకాదు—యిటికలయావాపము మాత్రంబే. వనస్పతికాదు—శుష్కకాష్ఠగుచ్ఛంబు మాత్రమే! బ్రాహ్మణుని నిర్జీవశక్తిని మంత్రబలంబుచే మరల నిలుపుజేయఁగలుఁగుదును, కాని బ్రాహ్మణుని బ్రాహ్మణత్వమును మరల గొని రాలేను. గ్రుడ్డిబ్రగావించి శూద్రుని శాసింపఁగలుఁగుదును కాని, వాని యెదయందు మరల భక్తిస్రోతముఁ బ్రవహింపఁజేయఁజాలను—రాక్షసీ! నన్నెచటికిఁ గొనివచ్చితివి? నేనేమి కావించితిని?—హా! ఏమి సల్పితిని?

కాత్యా—ఏమి సల్పితిరి?

చాణ—చూడుమదె! బౌద్ధమత వన్యము వడివడిగఁ బ్రవహించుచు వచ్చుచుండెను. కాత్యాయనా! దూరభవిష్యత్తునం దేమి వీక్షించుచుంటినో యెఱుంగుదువా?

కాత్యా—ఎఱుఁగను. వీక్షించునదేమో యానతిండు.

చాణ—చూడుమదె విఖండసామ్రాజ్యముపై ప్రేతభైరవనృత్యము మరల దృగ్గోచరమగుచుండెను. ఒక మహాశక్తి యరుదెంచి, పదంపడి గలితశవస్తోమముపైఁ దన మంత్రవేత్రమును ద్రిప్పి విఖండ మాంసపిండముల నేకత్ర మొనరించి, నూతనశక్తిచే నాపలలకదంబమును సంజీవిత మొనరించును. తదనంతర మది న్యాయశాసన లాంగలముచే బ్రాహ్మణ శూద్ర సంఘక్షేత్రమునుచషిత మొనరించి సాంఘికసమభూమిని సిద్ధ మొనరించును—జాగుసేయక, అగ్రసరుండవై యీ యమాత్యపదమును స్వీకరింపుము.

కా.త్యా—ఏమూల్యమున దీని నమ్మ్రుచుంటిరి?

చాణ—దీనికి వలయు మూల్యము నీ చెలిమిమాత్రమే. విశేషము నే నపేక్షింపను.

కాత్యా—పండితవర్యా! ఈ యభినయమంతయు నెందులకో నాకుఁ

డెల్ల మగుట లేదు.

చాణ—ఇది యభినయముకాదు. నెయ్యరీ! నాపల్కుల విశ్వసింపుము. చాణక్యుఁడు నేఁ డతిదీనుఁడని యెఱుంగుము. ఆతఁ డతి కూటుండును, కౌశలుండును, విచక్షణుండు నగుట, నిక్కమే! భారతవిషయ వీణాజంత్రమునఁగల జాతితంత్రుల నొక్కమాఱు నమ్మోళనాంగుళిచే మీటి, ఆతఁ డొకమహాసంగీతము నుత్పన్న మొనరించెను. అంబరమందీశ్వరుండుండుచో, చాణక్యునిమహాసృష్టి నాతఁడు ముగ్ధదృష్టిని నిరీక్షించుచుండక మానఁడు. అంతయుఁ గావించితిని. కాని, అందుఁ బ్రాణప్రతిష్ఠఁ గావింపఁ జాలనైతిని! అదెట్లు సాధ్యమగును? బాహిరమందీ యద్భుతమనీషను వీక్షించుచుంటివి, కాని నెచ్చెలీ! యీహృదయమును చీల్చి తదభ్యంతరమును విలోకించితేని, అదొండు శుష్కమరుభూమినాఁ దోఁచును.—ఒక కరుణాకణమైన, నొక విశ్వాసకణికయైన, నొక ప్రణయబిందువైన నందులేదు. కాత్యాయనా! ఈహృత్ఫలకమున లేశమైన జేసములేదు. వట్టిత్వక్కువలనఁ బ్రయోజనమేమి? చూడుమిదె చీల్చి వానిఁ దునుక తునుకలఁ జీల్చివైచెదను.

(వక్షమును జీల్ప నభినయించి, పిదప దానిపై బలంబుగ గ్రుద్దుకొనును)

కాత్యా—ఇదంతయు మిగుల నద్భుతముగఁ దోఁచుచుండెను. అమాత్యచూడామణీ! తా మిట్లధీరులగుచుంటిరేల? మీదుర్దమ తేజంబును, అటలప్రతిజ్ఞయు, తీక్ష్ణబుద్ధియు—

చాణ—"బుద్ధి! బుద్ధి!! బుద్ధి!!!" అని యహర్నిశము లవిరామముగ నెల్లెడల వినిన గొలఁది నాకు మిక్కుటమగు వినుగు జనించుచున్నది. పథములందును, ఘట్టములందును, ప్రాంతరములందును, కాంతారములందును, యిందునందుననేల విశ్వవలయమందంతట "నాహా! చాణక్యుని బుద్ధియెట్టి!" దను ప్రశంసోక్తి

యొక్కండే శ్రుతమగుచున్నది. విభీషణదృశ్యముఁగాని ధూమకేతువుఁగాని వీక్షించు తెఱంగున నిర్నిమేషవిస్మయమున లోకులందఱు నన్నవలోకించుచుండిరి. ఏబుద్ధి నింతకాలము దైవవాణికరణి ననుసరణ మొనరించుచు వచ్చితినో, అది వరము కాదు.— అభిశాపము! ఇపు డది వెనుదిరిగి నిలువంబడెను. ఇప్పటికి దాని ముఖమును వీక్షింపఁగలిగితిని! అది సజీవమూర్తి కాదు— కంకాలము. ఇంతకాలము దె నన్ను ముందునకు నడపించుకొనివచ్చెను. కాని యిపు డది తరుమ దొరఁకొనెను.— ఓః! ఏమి భయంకరము! ఏమి బీభత్సము! ఏమి భయానకము!! [శిహరితకాయుఁ డగును.]

కాత్యా— పండితోత్తమా! మీకు మతి చలించిపోవుచున్నది.

చాణ— (క్షణకాలము స్తబ్ధుఁడై యుండి)— అదె! వీక్షింపుము! ఆహా! ప్రభాతమెంత కమనీయమై కనంబడుచుండెనో! ఆహా! పెండ్లికూఁతులీల ధరిత్రీలలామ యెట్లలంకృతయై నగుచుండెనో! ఏమి యద్భుతదృశ్యము! మహీకాంతముఖముపై కమలమిత్రుని కనకరశ్మి యాశ్వాశీర్వాదము కరణి యెక్కరణి ప్రసరించుచుండెనో!— కాని,— కాని, నే నాసుందర సృష్టి కతిదూరమున ద్వారస్థభిక్షుకుని భంగి నిలువంబడి దానిని వీక్షించుచుంటిని.

కాత్యా— పండితవర్యా!

చాణ— ఆహా! వసుమతీ సీమంతిని సస్మితవదనవసజయై, నిరుపమాన సౌందర్యమున కాలవాలమై యెట్లద్భుతముగఁ దోఁచుచుండెనో! నే నాయిలాలలనాలలామ కేమియుఁ గానా? హా! గతి!! నే నొక్కఁడనే ఆయసీమసౌందర్యరాజ్యము నుండి నిర్వాసితుండనైతిని! వసుంధరా వలయమున నమృతమహార్ణవ తరంగములు నల్వలనులకుఁ బొరలుచుండెను!— తాపిత, తృషిత

హృదయుండనై పంగువునగు నే నయ్యబ్ధికూలమున నిటునటు గొట్టుకొనుచుంటిని. తపోవనప్రాంతమందలి సూకరము కరణి పల్వలపంకమున బడియుంటిని.

కాత్యా—(స్వగతముగ)—ఆశ్చర్యమాశ్చర్యము!—ఈతఁడిట్లుండు టే నెన్నండు వీక్షించియుండలేదు.

చాణ—అయిన నొకప్పుడు—

(దూరమున సంగీతము)

చాణ—అయిన నొకప్పు డీమహీమండలము నాకొక యుత్సవమందిరము నాఁ దోఁచెడిది. కుంభినీరమణివక్షముపైనుండి సౌందర్యశ్వేతము చ్ఛ్వసితమగుచుఁ జత్రుపర్వముగ నుండెడిది. విహాయసమజస్రమింద్రధనువర్ణరంజితమై యున్నట్లు కానంబడెడిది. తదుపరి—

(సంగీతము సమీపించును)

చాణ—(ఉత్కర్ణుఁడై విని)—ఆ! అదే! ఆస్వరమే!!—కాత్యాయనా! సఖా! పిల్వుము! పిల్వుము!!

కాత్యా—ఎవరిని?

చాణ—ఆబిచ్చకుని, వాని కూఁతును.

కాత్యా—అదేమి! మీకేమైన —

చాణ—(బ్రతిమాలు సర్వమున)—తమ్ముఁడా! పోయి యొకపరి వారి నిటు కొనిరమ్ము—

[కాత్యాయనుఁడు నిష్క్రమించును.]

చాణ—ఏమి! నాచిత్తమిట్లు తత్తరపడుచుండెను!! ఆబాలిక స్వరము వినినంతనే నాహృదయమేల స్ఫీతమైపోవుచుండెను? నాయెడద యేల వడిగొనుచుండెను?

[ఘర్మముఁదుడుచు కొనును.]

(పాడుచుఁ బాడుచు భిక్షుకుఁడు, భిక్షుక బాలిక ప్రవేశింతురు. వారితోఁ గాత్యాయనుఁడు కూడఁ బ్రవేశించును.)

గీతమాల.

"గీతిగంధభార మలయవాతులముతో
శ్యామసుందర పల్విధసస్యములతో
శారదాంబుదసుందర జ్యోత్స్నతోడ
అంబుజారి దీప్తమగు సుధాబ్ధితోడ
అహరహంబు వెల్వడు గానలహరితోడ
విలసితంబగు చుండు నీ విశ్వమెపుడు;
జరయు మరణము లేనట్టి జగతి యిదియె!
భూతపీడనఁ బాసి యేభీతు లేక
నీదు యావాన సుఖముల నెల్ల బడయ
వెన్కఁబడి కైదుఁ గుందక వేగరమ్మ."
అనుచు మధురవచనముల నమరవరులు
పిలుచుచుండిరి నన్నలవేల్పు పురికి.

కాత్యా—ఈదృశదార్శనిక భిక్షుకుని నే నింతకు పూర్వ మెన్నఁడు వీక్షించి యుండలేదు. వీనికతన పాణిని జ్ఞప్తికివచ్చుచుండెను. "తత్ పురుషః సమానాధి కరణపదః కర్మధారయః"—అనగా:—ఆ యొక్క పురుషుఁడు ప్రకృతితో సమగుణాన్వితుఁ డగుచో—అన గా:—జీవభావమున జన్మగ్రహణ మొనరించినచో, కర్మధారణ మొనరించుటయు, దానంజేసి కర్మఫల మనుభవించుటయుఁ దటస్థించును—ఊఁ! భిక్షుకా! నీవు నిశ్చయముగఁ బాణినిఁ బఠించి యుందువోయి!!

భిక్షు—అయ్యా! లేదండి.

కాత్యా—కాని, నీగాథయందలి ప్రతిపాదమందును పాణినీ వేదాంత

సారము పొంగి పొరలుచున్నది. ఇట్టి గాథల నీ వేరికడ నేర్చుకొంటివి?

భిక్షు—ఒకముసలి బ్రాహ్మణుఁడు నేర్పి పుణ్యము కట్టుకొనెను బాబయ్యా!

కాత్యా—అలాగున చెప్పుము. కాకున్న నీకేరికి సాధ్యము! అట్లయై యుండవలెనని మీరు పాడుచున్నపుడే గ్రహించితిని!

చాణ—(బాలికను సంబోధించి)—అమ్మా! ఇట్లు రమ్ము!!

(బాలిక చాణక్యుని మ్రోల కరుదెంచును)

చాణ—(బాలిక శిరోజములను వ్రేళ్ళచే మెల్లగఁ దువ్వుచు)—సరిగ నామునఖమే! ఆయక్షియుగళమే!! సరిగ—కాని—భిక్షుకా!— ఒక్కమాటడిగెదను—ఈనిసువు నీ శిశువేనా? నిజము చెప్పుము.

భిక్షు—నిజమే చెప్పెదను బాబయ్యా! నాపిల్లయే బాబయ్యా! నాపిల్ల కాకపోతే యిఁకెవరి పిల్ల?

చాణ—నిజము చెప్పుము. నీకు చాల డబ్బు నిచ్చెదను. నిజము చెప్పుము—యీపిల్ల నీ పిల్లయే?

భిక్షు—కాదు బాబయ్యా!—ఈపిల్ల నాపిల్ల కాదు. త్రోవలో నాకీ మాణిక్యము దొరికినది. అప్పటినుండి బాబయ్యా! యీమెను కన్న బిడ్డవలెనే పెంచి పెద్దదానిని చేసినాను.

చాణ—(మిగుల నాతురమున)—అట్లైన యీపిల్ల నీపిల్ల కాదు— ఏమి?

భిక్షు—నాపిల్ల కాదు బాబయ్యా! త్రోవలో దొరకినది.

చాణ—ఏ త్రోవలో దొరికినది?

భిక్షు—బాబయ్యా! ఈ బిడ్డను నాకు దేవుఁడిచ్చెను—ఆలా యీయ కున్న యెడల, కండ్లులేని యీగ్రుడ్డివానిని చేయిపట్టుకు యెవరు త్రిప్పుదురు? ఏ పుణ్యమున యీ అమ్మ నాకు దొరికినదో యెఱుఁ

గను. దోపిడులు చేసి పొట్టపోస్కుకొనే వాఁడను. ఆ పాపమువల్లనే (ఒకించుక క్రందనస్వరమున)—యిపుడు నా కనులు రెండును పోయినవి.

చాణ—(అత్యంత యాతురమున)—దోపిడులఁజేసి బ్రదుకుచుండు వాఁడవా?—ఆ వృత్తిని విడిచివైచితివా?

భిక్షు—విడిచి వైచితిని బాబయ్యా! చంద్రగుప్తమహారాజు రాజ్యములో దోపిడిచేసి బ్రతుకుటకు యెవడికి పదిగుండెలున్నవి బాబయ్యా!

చాణ—ఈ పిల్ల నీ కెచట దొరకెను?

భిక్షు—బాబయ్యా! అవంతీపురమున.

చాణక్య—(ఉత్తేజితభావమున)—అవంతీపురమందా? అవంతీపురమందెచట?

భిక్షుక—ఆ యూరి పొలిమేరలోనండి బాబయ్యా!

చాణ—కాదు. ఒక బ్రాహ్మణుని యింటినుండి దొంగిలించుకొని వచ్చితివికదా? నిజము చెప్పుము—ఏమియు భయములేదు. దొంగిలించితివా?

భిక్షు—లేదు బాబయ్యా! మీా పాదాలసా—

చాణ—చెప్పుము. చెప్పకున్న, చంపి వేయుదును. నిజము చెప్పుము. దొంగిలించుకొని వచ్చితివి కాదా?

భిక్షు—చిత్తము బాబయ్యగారూ!

చాణ—నదియొడ్డున నున్న యింటినుండి కదా?

భిక్షు—అవును బాబయ్యా!

చాణ—(వక్షమును గట్టిగ నడంచి)—హృదయమా! ఉద్వేలము కాకుము. (భిక్షుకు నుద్దేశించి)—అపుడీబాలిక వయసెంత యుండును?

భిక్షుక—మూఁడు లేక నాలుఁగేడ్లు బాబయ్యా!

చాణ—ఈ పిల్ల తనపే రేమని చెప్పెను?

భిక్షు—ఆత్రిరి బాబయ్యా!

చాణ—ఆత్రేయి. కాత్యాయనా! వింటివా? ఆత్రేయి యనుచున్నాఁడు—(భిక్షుకు నుద్దేశించి)—ఈమె తండ్రి పే రేవరు?

భిక్షు—చాణక్యుఁ డంటారు బాబయ్యా!

చాణ—(చివాలున ముందున కుఱికి యుచ్చైఃస్వనమున)—దస్యుఁడా!—(ఆత్మసంవరణ మొనరించుకొని)—ఎందులకు—నిన్ను వధింపను. నీ కేశాగ్రమైన స్పృశింపను. ఏమియు భయము లేదు. కాత్యాయనా!—కాదు—కరభకా!

(కతిపయ కాపరులతోఁ గరభకుఁడు ప్రవేశించును.)

చాణ—వలదు! పొండు—భిక్షుకా! నేనే ఆ బ్రాహ్మణుఁడను! ఈ పిల్ల నా తనయ.

(భటులు నిష్క్రమింతురు.)

భిక్షు—బాబయ్యా! నాపిల్ల నూడలాగుకొనకండి! ఈ కండ్లులేని కబోది కీబిడ్డయే చేయూత—ఇది లేకపోతే, నేను కడుపుమంటచే చావవలెను.

చాణ—నీకు పెద్ద జమీ యిచ్చెదను. ముదుసలీ! నీవు నన్ను పథ భికారిఁ గావించివైచితివి. పదపడి సామ్రాట్టు జేసితివి. నిరయమందు నిక్షేపించి పిదప నాకమున కెత్తితివి. దానంజేసి నిన్ను వధించి, పిమ్మట నీమూర్తి నిర్మించి పూజఁ గావింతును. కాదు కాదు—ఇదేమి!—ఇది యానందమా లేక యార్తియా? అదె! అదె!—కాదు!—మంచిది! బ్రతికియుంటినని గ్రహించుట కేమైన నొకించుక కావింపవలెను.

(నవ్వును.)

కాత్యా—నా కిదంతయు మిగుల నద్భుతముగ నున్నది.

చాణ—కాత్యాయనా! నాడి పరీక్షించు టెఱుంగుదువా? నేను బ్రదికియుంటినో లేదో (చేయిజాపి) చూడుము. ఇహలోకమం దుంటినో, పరలోకమం దుంటినో, యిది స్వప్నమో లేక సత్యమో, ఆలోకోచ్ఛ్వాసమో, లేక అంధకారవన్యమో, సృష్టిసంగీతమో లేక ప్రళయకల్లోలమో తెలుపుము—ఏమో తెలుపుము. కాకున్న—యింతకాల మైనపిదప నా పట్టుగొమ్మ భారతశాసనకర్త ముద్దుపట్టి—జనకుని గుమ్మముసే జేరి బిచ్చ మెత్తుట తటస్థించునా?—కాత్యాయనా! కాత్యాయనా!

(క్రందన మొనరించును.)

కాత్యా—పండితవరా! ఏల మీ రిటు మురపిల్లుచుంటిరి? ఊరడిల్లుఁ డూరడిల్లుఁడు?

చాణ—కాదు. ఇది సంభవముకాదు. ఇదిమోసము! ప్రతారణము! కుటిలి! కాత్యాయనా! ఇది నీ కుటిలి కాదు. చూడుమిదే ఆ ముఖము! ఆ జ్యోతిః పూర్ణచక్షులే యీ యన్నులమిన్న కన్నులు! ఆ తేజియీ! కన్నతల్లీ! ఇంతకాలము నీబిడ్డను మరచియుంటివా? నీబిడ్డ ఇప్పటికి జ్ఞప్తికి వచ్చెనా? అమ్మా! ఆత్రేయీ! పాషాణహృదయీ! ఇంతదనుక నెందుంటివి? (తనూభవను బిగ్గ కౌఁగిలించుకొని)—కాత్యాయనా! అదె! వినుము, వినుము! కుంజ వనమునుండి యొక సామస్తోత్రముత్పన్న మగుచుంట లేదా? చూడు మానిర్ఝరిణి యెట్లానందమున రోమాంచితమగు చుండెనో! నభోమండలము నుండి స్నిగ్ధసార భహిల్లోల మెట్లవని—పై ప్రవ—హించుచుండెనో వీక్షింపుము! వీక్షింపుము?—ఓః! నాశరీర మవసన్నమై పోవుచుండెను! కాత్యాయనా! నన్నుఁ గుటీరము లోనికిఁ గొనిపొమ్ము! అమ్మా!

అమ్మా! అమ్మా! బిడ్డనాలింగన మాచరించుకొని కాత్యాయనునితో నిష్క్రమించును.

## తృతీయరంగము

మలయ రాజ ప్రసాదము—ఉజ్జ్వల ప్రభాతము.

(మలయ రాజ్ఞి మంత్రి,—మగధ రాజదూత).

అమా—భారత సామ్రాజ్యమున కంతర్భూతమై యుండియు మా మలయ రాజ్యము నిజస్వాతంత్ర్యమును గోల్పోవలేదు. మావిషయ పాలనమునఁ జక్రవర్తి కెట్టి జోక్యము లేదు.

దూత—ఇప్పుడు మీ రాజ్యశాసన కర్త్రి రాజ కన్యయేకదా?

అమా.—అవును. భ్రాతృమరణా నంతరమున నామెయే పాలనా భారమును నిజమూళి దాల్చెను.

దూత—ఆమె ఇంకను అవివాహితయే కదా?

అమా—అవును.

దూత—ఆమె పరిణయముఁ గావించుకొనదా?

అమా—కావించుకొనునో కావించుకొనదో యెఱుఁగను. తెలిచుగ నామె యేకాకినియై యుండును. పాలనా విషయము లందుఁదక్క నన్య విషయములం దన్యులతో నామె ప్రసంగింపదు.

దూత—మా తేఁడుకూడ నట్లే వర్తించుచుండును. ఆతేఁడుకూడ నవివాహితుఁడయ్యే యుండెను. ఇటీవల మాంత్రి మాతని పరిణయము నిశ్చయింపఁబడెను.

అమా—ఈయిరువురి చరితము యేరికైన నబ్బురము జనింపక మానదు—అదె! మా ప్రభ్వీణి యిట్లరుదెంచుచుండెను.

ససంభ్రమమున నిర్వురు ప్రక్కకుఁ దొలఁగి నిలుతురు.

ఛాయ ప్రవేశించును.

ఇరువురామె కభివాదన మొనరింతురు.

ఆగంతువు—రాజ్ఞీమతల్లికి జయమగుగాక!

ఛాయ—నా దర్శనార్థమై వేచియుండునది మీరేనా?

దూత—(మస్తక మొకించుక యవనత మొనరించి)—చిత్తము రాజ్ఞీ!

ఛాయ—ఎందులకు?

దూత—మగధనుండి నిమంత్రణపత్రముఁ గొనివచ్చితిని. కైకొండు.

(పత్ర మొసగును.)

ఛాయ—(కంపితకరమున కమ్మవిప్పుచు)—శుభవార్తయేకదా?

దూత—చిత్తము.

ఛాయ లేఖను చదువుచు విచలితయగును. ఉత్తరమును దూర దూరమునసుంచి "ఓహో! భారతసామ్రాజ్ఞియనురోధమా? ఆ సామ్రాజ్ఞియెవతె?" అని పిదప నామె యాత్మసంవరణ మొనరించుకొని గాఢస్వరమున నిట్లుపల్కును—"ఆతలఁపేల?—మంచిది! దూతా! నేనరుదెంచెదను. (నిజామాత్యుని సంబోధించి)—మంత్రిశేఖరా! రాజభాండారమునఁ గల యమూల్యరత్నములచే నొకసుందరకంఠహారముఁ జేయింపవలెను. స్వర్ణకారుని పిలిపింపుము.

మంత్రి—చిత్తము. పనివినియెద.

ఛాయ—ఈదూత నేఁక విశ్రామాగారములోనికిఁ గొనిపొమ్ము.

(ఆగంతువును వెంట నిడుకొని మంత్రి నిష్క్రమించును.)

ఛాయ—(ప్రక్కనుండి పత్రమును చివాలునఁ దీసికొని, పరిపరి పర్యాయములు దానిని చుంబించి చుంబించి)—ప్రాణసఖా! అస్మజ్జీవనానందమా! నాసర్వస్వమా! నీవిఁక నావాఁడవుకావు. నేఁడీ వామెవాఁడవు! ఇట్లు ఘటించెనేల?—కాని, నేనిత్తెఱంగునఁ జింతించుచుంటి నేల? నేనేకదా స్వీయకరములతో నాతని యవన

భూపతి దుహితకరములఁ గ్రహణమొనరించితిని! అట్లయ్యు,— అట్లయ్యు నేనీయాధినిసహింపఁజాలకుంటినేల? నాహృదయము శతధా ప్రయ్యలగుచుండెనేల? పృథ్వియంతయు శూన్యమైయున్న టులఁ దోఁచుచుండెనేల?—చంద్రగుప్తా! యశస్విలకా!!—ఇదేమి ఛాయా! నీవిట్లు వందురుచుంటివి?—నీవు రాజ్ఞివికావా? దృఢచిత్తవు కమ్ము! నిర్మలమనస్కవై యీప్రవృత్తికంఠమును రుద్ధమొనరించి వైచుము! లోహమయావరణమున దీత ప్తబాష్పమును రుద్ధమొన రించివైచుము!! దూపిల్లనేల? ఈమాత్రమే కావింపఁజాలవా— [క్షణమూరకుని]—మంచిది! నే నీ ప్రేమను దమనమొనరించి వైతును. ఆతనిసుఖంబే నాసుఖము! ఆతని యాహ్లాదమే నాయాహ్లా దము! ఇఁక నుమ్మలించుటెందులకు? ప్రియతమా! సుఖివికమ్ము. అదె నాజీవనసాధనమగుఁగాక!

[పాడుచుఁ బాడుచు నిష్క్రమించును.]

గీతమాల.

అన్ని వ్యథలను యొంటినై యనుభవించి,
నీదు సుఖమునె కాంక్షించి నిర్మలాంగ!
దూరమునకు వేళంబనేఁ దొలఁగిచనియు
నాత్మబలిదాన మొసఁగుదు నాతురమున;
ఎడదఁగలవాంఛలన్నియుఁ బడసి వేగ
ధరణి స్వర్గము నీదని నరులుతల్ప
సంతసాంబుధి నిర్మగ్నస్వాంతువగుచు,
రాజ్యమేలుము మగధసామ్రాజ్ఞిఁగూడి.

## చతుర్థరంగము

సెల్యూకసు శిబిరము — ప్రభాతకాలము

సెల్యూకస్ ఏకాకియై యుండును — దూరమున సైనికులుందురు

సెల్యూ— హిందూజాత్యుద్భవుండగు చంద్రగుప్తునకును యవనసార్వభౌముని పుత్రికయగు హెలెనుకును పరిణయమా? తుదకు సెల్యూకసున కీ యవమానముకూడ ఘటిల్లెనా? ఇత్తఱి నగరమందంతట బోరుకలంగు నత్యుచ్చయుత్సవకోలాహలము యవనుల బన్నమును, సెల్యూకసు బిడియమును విఘోషిత మొనరించుచుండెను. నా తనయ యింకను మగుడి రాలేదు. ఉత్సవమత్తయై యామె చెలరేగుచుండవచ్చును. ముదుసలియైన యయ్య యిప్పు డామె కేల జ్ఞప్తికి వచ్చును? కన్నబిడ్డలు పూర్వ దిక్కుగ మాత్రము దృష్టుల సారించెదరు—వెనుక కొకమాత్రైనఁ గన్నెత్తి చూడరు. భవిష్యచ్చింతచే మాత్రము వారి చిత్తమజస్రమాక్రాంతమై యుండును. అతీతము వారి తలంపుఁ జొరనేరదు. దానం జేసి కని, పెంచిన పితగభీరవిస్మృతిగర్భమునఁ బడి క్రుంకవలసినదే! పుత్రులకు విద్యాబుద్ధుల గఱపి, కన్నియలకుఁ బరిణయము లొనరించి, జనకుం డెవండైన సుఖియై జీవయాత్ర సలిపియుంటనే నెఱుంగను. అడ్డాలదాటిన బిడ్డలకిఁక నమ్మయయ్యల యక్కఱ యేమి యుండును?—ఆహా! జనకుల భాగ్య మెంత నిష్ఠురమైనది! వారల యగాధానురాగమున కావంతైన బ్రతిఫలము లేదు. అదిగో! నాబిడ్డ వచ్చుచున్నది! జ్ఞప్తికిఁ దెచ్చుదనుక జనకుఁడు తలంపునకు రాలేదు కాఁబోలు!

[హెలెన్ ప్రవేశించును]

హెలెన్— జనకా! జోహారు!!

సెల్యూ—చిరంజీవివి కమ్మా. అమ్మా! ఇంతదనుక నేనిందు నీకొఱకై ప్రతీక్షించియుంటిని.

హెలెన్—ఓలగంబునకు మిమ్ముఁ దోడ్కొనిపోవుటకే స్వయముగ మీకడ కరుదెంచితిని. జనకా! ఇఁకఁ బోదము రండు.

సెల్యూ—నేను రాఁజాలను. దానం జేసియే నీకు రమ్మని కబురంపితిని!

హెలెన్—మిమ్ము గొనిపోవుటకు నే నేతెంచితిని.

సెల్యూ—అచటి కరుదెంచుటకు నాకేమియు నిష్టము లేదు.

హెలెన్—ఏల? మీదుహితవివాహమహోత్సవము వీక్షింప మీరు రారా?

సెల్యూ—రాను. ఇందుండియే నేను వీడ్కొనుచుంటిని.

హెలెన్—తెల్లమాయెను. మంచిది వచ్చుటయు రాకపోవుటయు మీయిచ్ఛ. బలంబు మెయి మిమ్ముఁ గొనిపోఁజాలను. తాము తమ తనయకై దికారు.

సెల్యూ—తల్లీ! నాపై గిన్కఁ జెందకుము.

హెలెన్—కిన్కఁ జెందనేల? మీపై గిన్కఁజెందుటకు నాకిఁకేమి స్వాతంత్ర్యమున్నది? ఎవ్వతెపై గిన్కఁజూపఁ జెల్లునో ఆమె పోనిం డివు డాతలంపేల? జనకా! అట్లైన నాకిఁక సెలవొసంగుఁడు.

సెల్యూ—సెలవుకై యింత తమకమేల? ముహూర్తకాలవిలంబము కూడ సహనాతీతమై యుండెనా? హా! మూఢజనకా! అంత యనురాగమున, సంత యాదరమున, నంత యాతురమున, నింత దనుకఁ బెనుపంబడిన కూఁతురొక్క దినములో నొక్కమాటుగ పరులపాలై పోవుచుండ గ్రుడ్లనీరు గ్రుక్కుకొని పిలపింపవలసి వచ్చెగా! ఇంత కాలముఁ బెనుపంబడిన కన్యకు నీకు నిఁక నెట్టి సంబంధము లేదా? అమ్మా! నీవిఁక నాకేమియుఁగావా? నేను నీకేమియుఁగానా? కనినదాదిగ నీకుఁ దల్లియుఁ దండ్రియుఁ దానవై

కనుపాపవలె నిను బెంచిన ముద్దుసలిని పీడిచనుట కీవుత్సరపడు చుంటివా? కడలి కరళ్ళకర్ణణి కన్నకూఁతుకై కన్నీళ్ళురాల్చు పితను కరుణలేక వీడి చనుచుంటివా? హా! ఎట్టిదశ ప్రాపించు చుండెను? హా! కాలమహిమ యెట్టిది!!

(మొగమును చేతులచేఁ గప్పుకొనును)

హెలెన్—జనకా! మీమనమును నొవ్వఁజేసిన యీ కఠినాత్మురా లిని మన్నింపుఁడు. అదేమి జనకా!— మీనేత్రములనుండి యశ్రు నీర మవిరళధారగ స్రవించుచుండెను!! మీ రిట్లుమ్మలించుట నేఁజూడఁజాలను. దూపిల్లకుఁడు. అజ్ఞానయైన యీ కన్నియను క్షమింపుఁడు—ఇదే కడసారి వేడికోలు. మిమ్మిఁకేమియు వేఁడు కొనను.

(నతజానువ యగును)

సెల్యూ—అమ్మా! లెమ్ము!! (కూఁతును లేవనెత్తి, విదప నూర్ధ్వ దిక్కుగ వీక్షించుచు)—నీ దోష మేమియు లేదు. అపరాధము నాయదియ. జనకుని గభీరవేదన నీవేమి గ్రహింపఁగలుఁగుదువు? "అమ్మ, అయ్య" లను ముద్దుమాటల నుచ్చరింపఁ జాలనప్పటి నుండియుఁ గరములందే పెంచి పెదదానిఁ గావించిన ముద్దుపట్టిని బారుగ వీడు చింతయార్తియో నీ వేమెఱుంగుదువు తల్లీ! వయస్కులైనపిదప కూఁతుకొడుకు లొకమారైనఁ గన్నతండ్రిఁ గన్నెత్తి జూడకుండుట వారి స్వాభావికము. వారి యపరాధ మేమి? పృథ్వీనియమమేయది! అట్లని యెఱింగియుండియూ జన కులము బిడ్డలకుఁ జూపు యగాధానురాగమునకు బదులుపడయు నువ్విళులూరి, మాయెడదల వీడనియాధిఁ గల్పించుకొనుట మా యపరాధము. అన్నియపరాధము లీ జనకులవే!

హెలెన్—జనకా! ఈ యెడబాటువలన నలమట కలుఁగు టొక

జనకులకేనా? తలిదండ్రులవీడి యొక క్రొత్తయొండఁ జేరుతఱి గన్యల హృదయములు శతధావ్రయ్యలు కావా? జనకులు మాత్రమే ప్రేమించు నెఱుంగుదురా? దుహిత లనురాగమున కనవగతలా?

సెల్యూ—(కండ్లు దుడుచుకొని)—అమ్మా! కారు మీరలుకూడఁ బ్రేమించు నెఱుంగుదురు.

హెలెన్—జనకా! మేము నిష్ఠురులము. ప్రేమించు నెఱుంగము.

సెల్యూ—అమ్మా! అట్లనకుము. మీరుకూడఁ బ్రేమింతురు. నే ననృతమాడితిని.

హెలెన్—పితా! కాంతాజీవితమే యొక ప్రణయేతిహాసము. ప్రథమమున జననీ జనకులతోడను, పిదప పతితోడను, పదంపడి పుత్రి కన్యలతోడను, ఆమె క్షుద్రసంసార మేర్పడియుండును. ఆ చిన్ని ప్రపంచమందే యామె యాశాభరసములును, ఆనందసంపదలును, నిండియుండును. పురుషశకుంతము కులాయమువీడి యూర్ధ్వావని కెగసి గగనసూర్యోజ్జ్వల నీలిమయందు హర్షసంభరితచిత్తమున విచరణ మొనరించుతఱి నారీవికిరము నిభృతమం దేకాకినియై యుపవసించి తనయిలాజయాలయమును నిజపక్షంబులచేఁ జుట్టి కాఁపాడును. లలనాసులభంబగు తాదృశప్రేమయే పూరుషునకు విశ్రామమందుఁ బ్రమోదంబును, అలసతనమున సచ్చింతయు, అవసరమునఁ జిత్తవినోదంబును కల్గించును. కాని నారి సమస్తముహూర్తోత్కరంబును, సమస్తచింతయు, సమస్త కార్యకలాపంబును, సమస్త జీవనంబును ఆప్రేమయందే నిహితమై యుండును. ఆమె జన్మ, నివాస మృత్యువులందే యుండును. స్వర్గమనున దేమైన నున్నచో, దాని నామె ఆ ప్రేమయందే గాంచును. విహార, శయన, నిద్ర, స్వప్నాశన, నిశ్వాసము లామె ప్రేమ

పృథ్వీజశాఖలు. అట్టి యనురాగసాల మూలంబులు మాచిత్త మృత్తమందు నాటుకొనియుండ ప్రేమయనుదేమో మీమెఱుంగ మనుట న్యాయమా?

సెల్యూ—కాదు. జననీ! నిక్కముగనే ననుచితముగ వచించితిని.

హెలెన్—పితా! మీయెడఁగల ప్రేమకతన నేనే ఏంటిగోనసును పాణిగ్రహణ మొనరించుకొన లేదని యెఱుంగరా? నేడీప్రోలునం దంతట ముఖరితములగు నుత్సవదుందుభినిస్వనములు మరణార్త నాదముల క్రియ నాకర్ణపుటములందు నినాదితములగు చుండెనని యెఱుంగరా? లోకులు పల్వురు ప్రమోద విద్యోతముఖమండలులై, యుదీర్ణపూర్ణహర్షులై, కౌతుకంబునఁ గాలముఁబుచ్చుచు నూతనోత్సవ సన్నాహములఁ గావించుచుఁ బ్రాయశః నాభాగ్యంబున కీసుఁజెందుచుండిరి; కాని మర్మభేదంబగు క్రందనమొందు నాయంతరంగమునుండి యీవలఁబడ యత్న మొనరించుచుండెను. నేనా యాక్రందన కంఠమును గట్టిగ నొడిసిపట్టి వెల్వడకుండఁ జేయుచుంటిని. జనకా! మిమ్ము విడువవలసి వచ్చుచున్నందులకు (వక్షము నొడిసిపట్టి) నా యీహృదయ కుహరమందెట్టి విలయ ఝుంఝ్రువీయుచున్నదో యెఱుంగుదురా?

సెల్యూ—అమ్మా! నీకంత వంతయేల? నీవు చంద్రగుప్తునిఁ బ్రేమించుటలేదా?

హెలెన్—దీనిఁగూడ మీకు విప్పి జెప్పవలెనా?

సెల్యూ—అట్లైన నీ వీవివాహమున కియ్యకుంటి వేల?

హెలెన్—వివాహమా?—జనకా! ఇది వివాహముకాదు—మృత్యువు! మీతనయ మృత్యువు!! నేఁబరిణయ మాచరించుకొనుట లేదు. ఆత్మ బలిఁగావించుకొనుచుంటిని.

సెల్యూ—ఏల?

హెలెన్—మానవ మహాహితార్థ మాత్మోత్సర్గ మొనరించు కొనుచుంటిని. సెల్యూకసు చంద్రగుప్తుల విద్వేషవహ్ని నిజశోణిత ధారచే నిర్వాణ మొనరించుచుంటిని. యుద్ధ్యమానజాతి ద్వందాభ్యంతరమున నిలచి, అహితకర వినిర్గతోద్యత ఖడ్గాఘాతములను నిజవక్షమునఁబూన సాహసించుచుంటిని.

సెల్యూ—అమ్మా! నీ విట్టి చెట్టకేల జే యొడ్డితివి? ఈ వివాహము నా వక్షమున మర్మశేలము చాడ్పున నొవ్వఁజేయుచుండెను. నీ యభీష్టమున కొకమా అంతరాయముఁ గల్పించి, యిఁక నట్లు కల్పింప నిచ్ఛగింపక నిక్కముగ నీవు సుఖింతువంచు మదిఁదలఁచి యీ పరిణయమునకు సమ్మతించితిని. తనూభవయానందమున నిజదుఃఖమును నిమజ్జిత మొనరించి నిజారిష్టముల మఱువఁగల నంచు దలంచితిని. కాని, నీ వీకల్యాణముకతన సుఖంబు పడయుటకు మాఱుగ దురంతసంతాపముఁ దెచ్చిపెట్టుకొనుచుంటివని నే గ్రహింపఁగలిగియుండినచో—

హెలెన్—జనకా, ఇది దురంతసంతాపమైనచో, స్వచ్ఛందమసంబున నేనీ దుఃఖభారమును నిజోత్తమాంగమునఁ బూన నేల దొరఁకొందును? పరహితంబుకై, కర్తవ్యార్థ మాత్మ బలిదాన మొనఁగుట పరమసుఖంబును, అనిర్వాచ్యానందమును, యుత్కృష్ట గౌరవంబునుకాదా?

సెల్యూ—నీ కిది గౌరవదాయకంబే యై యుండవచ్చును; కాని, యిది యువనుల కతి లజ్జాకరము.

హెలెన్—లజ్జాకరమా? ఇటువంటి యుత్కృష్ట వివాహము జగమందెన్నఁడైన జరగియుండెనా? జనకా! ఈ వివాహముకతన నొక చిరంతనవార్త యుడుగుచుండెను! ఈ వివాహముకతనఁ బృథకములై యున్న రెండార్యజాతులు పూర్వవైరముల మఱచి, పరస్పర

ప్రణయాలింగనబద్ధము లగుచుండెను! ఈ వివాహము చంద్రగుప్త హెలెనులకు జరుగుచుంట లేదు. ఈ వివాహము కర్మకును, మోక్షంబునకును, చింతకును కల్పనకును, విజ్ఞానమునకును కవిత్వమునకును కలుగుచుండెను! ఈ వివాహంబుకతనఁ బాశ్చాత్య ప్రాగ్భూమండల సభ్యజాతి ద్వయాభ్యంతరస్థ మహావ్యవధానము భిన్నమైపోయెను! ఈ వివాహముకతనఁ బశ్చిమ పూర్వసీమ లొండొంటితో నొండు దాంపత్యబంధమునఁ గలసికొనెను! ఈ వివాహముకతన విద్వేషవారిప్రపాతమునుపై సేతుబంధమాయెను! యవన భారతమహాభూము లేకక్షత్రములాయెను! ఇట్టి మహద్వివాహము మహీమండలమం దీవఱలో నెన్నఁడైన జరగియుండెనా!

సెల్యూ——లేదు; కాని——

హెలెన్——ఆహా! అదెట్టి యద్భుతదృశ్యమో విలోకింపుఁడు! ప్లేటో, కపిలు లిరువు రేకగ్రీవమున గానము సల్పుచుండిరి! సోలన్‌మనులు పరస్పరగళాబద్ధులై నిలువంబడి యుండిరి! హోమరు మృదంగ వాద్యముతో వాల్మీకి విన్నాణివీణ వాయించుచుండెను! హిరోడోటస్, వ్యాసులును, సోక్రెటిస్ బుద్ధులును, ఎకిలిస్ భీష్ములును, పేంథియన్, పురాణంబులును నేకంబు లగుచుండెను! ఆహా! ఎట్టి మహద్దృశ్యము! ఈ వివాహంబుకతనఁ బూర్వపశ్చిమములును, అంబోధియభ్రంబులును, స్వర్గ మర్త్యంబులును, ఇహపరజగంబులును, రొకదానియం దొకటి లీనమైపోవుచుండెను! జనకా! అట్లని యవలీలగ లీలము కాఁగలవా?——ఓ! చూడుఁడు! చూడుఁడు! మనకుముం దదే వియత్తలమున సురగణము లెట్లు మహోత్సవము సల్పుచుండిరో! ఆహా! ఆ యమరదుందుభుల వినుఁడు! ఈదృశ వివాహ మవనియం దీ యొక్కమాఱే జరగెను! ఈ యొక్కపర్యాయమే జరగుచుండెను! దీనింబోలు పరిణయము

మఱొండు భవిష్యమందు జరుగునో జరుగదో తెలుపఁజాలము!

సెల్యూ—జననీ! తదేకదృష్టివై యేమి వీక్షించుచుంటివి?

హెలెన్—(ప్రకృతిస్థయై, ఆకస్మికాస్ఫుటసర్వమున)—పితా! ఇఁకఁ గుమారికి సెలవు దయసేయుఁడు. మానవశ్రేయోభిలాషులై నన్నాశీర్వదించి పంపుఁడు.

సెల్యూ—అమ్మా! సుఖివి కమ్మా. నీ కళ్యాణముకతన జగమశ్రాంతము శాంతినికేతనమై తనరుగాక!

హెలెన్—పితా! ఇఁక వీడ్కొనుచుంటిని.

(పితృక్రోడసీమను ముఖంబిడును.)

సెల్యూ—అమ్మా! (విలపించును)—ముద్దుపట్టీ! విలపింపకుము.

హెలెన్—జనకా! హా!—(ఆత్మసంవరణ మొనరించుకొని)—జనకా! కర్తవ్యము నన్నాహ్వానించుచుండెను. ఇఁకేరి యాహ్వానముఁ బాటించుటకు నా కవకాశము లేదు. పోయివచ్చెద. (నతజానువయై, పితృపదముల స్పృశించి వానిఁ గండ్ల నద్దుకొని)—పితా! ఈ సుఖస్పర్శస్మృతియే అవనీతలమున నన్ను సంజీవిత మొనరించియుంచుగాక! ఇదియే నన్ను సుఖింపజేయుగాక! జగదీశా! ఇఁక నీబలిఁ గైకొనుము. కైకొని, పృథ్వీతలమున శాంతిరససేచన మొనరింపుము. అట్లొనరించితేని నా జీవనము సార్థకమాయెనని తలంచెద.

(వేగముగ నిష్క్రమించును.)

సెల్యూ—జననీ! జననీ! (అగ్రసరుండై మరల వెనుకకుఁ దరలి) వలదు! వలదు!—అయ్యో!—కాని నేనేల వందురవలయును? నా జనని జగద్ధాత్రి! మానవికాదు! ఆహా! ఏమి యపూర్వదృశ్యము! ఏమి యపూర్వఘటనము! నిక్కముగ నది స్వర్గీయము! ఇట్టి యుత్కృష్ట బలిఁ బూర్వమున జగతియందికే రొసఁగి యుండ

లేదు—పోదును!—ఇఁక స్వీయసీమకు మరలిపోదును. కాని,—కాని,—యిదేమి!—అయ్యో! దారి కానరాదేల? ఏమి యీ గభీరాంధకారము! ఇది తామసీనిశీథినా? సమ్ముఖమునఁ గల పథ మెం దరిగెను? బిడ్డా! బిడ్డా! న న్నొక్కండఁ జేసి వైచితివా? నీవు లేకున్న నాకు సామ్రాజ్య మేల! ప్రతిభ యేల? బ్రదు కేల? అయ్యో! న న్నంధునిఁగావించి, యెందరిగితివి తల్లీ! హృదయమా! ఇఁక వ్రయ్యలై పొమ్ము! ఈనుదునలి కిఁక దిక్కెవరు? అభ్రమా! మీఁద విఱిగిపడుము! హా! తనయా! తనయా!

(నిమీలితనేత్రుండై యుండును.)

(ఏంటిగోనను ప్రవేశించును.)

ఏంటి—యవనసార్వభౌమా! జోహారు!

సెల్యూ—(కండ్లు తెఱచి)—ఎవరు?

ఏంటి—నే నేంటిగోనసును.

సెల్యూ—(మిగుల విస్మయమున)—ఏంటిగోనసా?—ఇత్తఱి నీ విచటికి రానేల?

ఏంటి—సార్వభౌమా! మీరంత విస్మయ పడు టెందులకు?

సెల్యూ—ఓ! నేఁ బరాజితుండ నైతినని పరిహాసింపవచ్చితివా?

ఏంటి—నే నందులకై రాలేదు.

సెల్యూ—అట్లైన నిఁ కెందులకు?

ఏంటి—నా పితృవార్తఁ గొనివచ్చితిని.

సెల్యూ—దాని ప్రయోజన మేమి?

ఏంటి—ఏమేమి? ఆ వార్త ప్రయోజన మేమియు లేకున్న యెడల, దాని నెఱుంగుటకై యున్మత్తునిచాఁ బ్పస యవనసీమకుఁ బర్విడువాఁడను కాను, మరల దానిఁ గొని భారతావనికిఁ బిచ్చివాని పగిది నే పర్వెడివచ్చువాఁడను కాను. ప్రయోజనమున్నది.

సెల్యూ—గ్రహించితిని. ఇంకన్ను నీ కావేరాన యేల? నా తనూభవ యిపు డవివాహితయై యుండలేదు. ఆమె యిపుడు భారతాధీశ్వరునకుఁ బట్టమహిషి యాయెను.

ఏంటి—ఆనంద మానందము. భారతభర్తకంటె యోగ్యతరుండగు భర్త ఆ భవ్యచరితకు లభింపనేరఁడు. రాజదంపతుల నాశీర్వదింప నిప్పుడ యోలగంబున కరుగుచుంటిని.

సెల్యూ—సైనికా! నా ముద్దుబిడ్డ పెండిలి నీ కంత పరియాచకముగ నుండెనా?

ఏంటి—చక్రవర్తీ! ఇది పరియాచకము కాదు—సంపూర్ణ సత్యము! నాపైనుండి యొక ప్రకాండజలోచ్ఛ్వాసము ప్రవించిపోయెను! నన్నంటిన మంటి యంతయు నల్లహారీతరంగములందు ధౌతమై పోయెను! ఇఁక మిగిలిన దొక భగ్నశిలాస్తూపము మాత్రమే; కాని దాని ప్రత్యేక శిలాఖండ మభ్రముకంటె నిర్మలమైనది; వజ్రాదపి కఠోరమైనది! దీర్ఘతపంబుచేఁ బిశితంబు జారి ధరిణిపై బడెను. ఇపుడున్నది కంకాలముమాత్రమే! కాని దాని ప్రతియస్థిశకల మత్యంత పవిత్రమైనది. నా కళంక మంతయు నింగలంబునఁ బడి బుగ్గి యాయెను! ఇపుడు శేషించినది శుభ్రభర్మంబు!

సెల్యూ—నీపల్కుల యర్థము నాకేమియు బోధపడుటలేదు. వచించునది విస్పష్టముగఁ దెలుపుము.

ఏంటి—సకామప్రణయమును నిష్కామానురాగముచే విశుద్ధమొనరించుట, మానవుని నిలింపు గావించుట, వసుధను నాక మొనరించుట మున్నగు కారియములు మానవసాధ్యాతీతములంచుఁ దలంచితిని. కాని సాధనయున్న యెడ సిద్ధికలదనియు, దపంబున్న తావలంబునఁ బరిపూర్ణత్వమున్నదనియు స్వానుభవనమునేఁ

బూర్ణముగ నెఱుంగఁగలఁగితిని. కావుననే హెలెనును నేడు తోడబుట్టువు వలె బ్రేమించుచు భ్రాతృప్రణయామృతమున నామె నభిషిక్తఁ జేయు నువ్విళులూరుచుంటిని.

సెల్యూ—నీవు వచించునది నాకిసుమంతయు హృదయంగమమగుట లేదు.

వంటి—పాప మెట్లు హృదయంగమమగును? ఎవ్వాఁడు ముగ్ధకృషక కన్యను తనలుబ్ధాజాలంబునఁ బడవైచుకొని ధర్మతః ఆమెను పాణిగ్రహణ మాచరించుకొని, తదనంతరమున నామెను, ఆమె కడుపునఁబుట్టిన పసినిసువును, దిక్కుమాలినవారిఁ జేసి, త్రిర్పి మెత్తుకొని జీవింపుఁడని జగంబందు వీడివైచి, తాను మహీపాలుండై, అశేషరాజ్య విభవముల ననుభవించుచు, తన చెడు చెయిదమును మఱచియుండెనో ఆతని కీపల్కు లేలతెల్లమగును? సార్వభౌమా! ఆయభాగిని, ననుఁగనిన ఆయమ్మ (నిట్టూర్పు విడిచి) మృత్యువాతఁబడెను. మీనిర్మమపరిత్యాగము కాని, మీఘాతుకఖడ్గము కాని, కావింపఁజాలని దానిని నాస్నేహా చ్ఛాభ్యాసము సాధన మొనరించెను. ఆమానినీవతంసము పుత్త్ర ప్రేమవన్యయందుఁ గొట్టుకొని పోయెను! దీర్ఘదుఃఖానంతరమున మాతృదేవి యత్యంతసుఖముఁను సహింపఁజాలకపోయెను. (స్వరము కంపింపఁ దొడంగును) — సార్వభౌమా! —

సెల్యూ—ఇదేమి! ఇదేమి!! నాకన్నులందుఁ జీకటులు క్రమ్ము చుండెను!!! నాకేమియుఁ గోచరించుటలేదు. నీవెవఁడవు?

వంటి—క్రీతదాసుండననుఁడు — భిక్షుకుఁడననుఁడు! మీకెట్లిష్టమట్ల నుఁడు. కాని, నేను జారజుఁడను కాను. నాజనయిత నాజన యిత్రిని ధర్మసాక్షిగ, — విధ్యుక్తముగ వివాహ మాచరించు కొనెను!

సెల్యూ—(జడితస్వరమున)—నీ జనకుఁ డెవరు ?
వంటి—సార్వభౌమా! నాజనకు నైతెంగించుటకు సిగ్గుచే నాయుచ్ఛ
శీర్ష మవనీతలమంటుచుండెను ! — (కంపితస్వరమున)—మహాశయా!
పత్నీ త్యాగియైన పరమపురుషుండగు సెల్యూకసే నాజనకుఁడు !!
[వేగముగ నిష్క్రమించును.]

(సెల్యూకసు కవాటమును గట్టిగఁబట్టుకొని నతమస్తకుఁడై శిలాభావమున నిలువంబడి యుండును. పిదప నాతఁడు మెల్లగ నిష్క్రమింతుఁడగును.)

పంచమరంగము.

మగధప్రాసాదము—రాత్రికాలము

వివిధరంజిత నిశానములు వాతూలహిల్లోలమునఁ గొట్టుకొను చుండును. — దూరమునుండి యస్ఫుటయంత్ర సంగీతము వినంబడును. చంద్రగుప్త హెలెనులు సమంచిత కాంచన సింహాసనారూఢులై యుందురు. పార్శ్వమున నమాత్యులును, అంగరక్షకులును యుందురు. సమ్ముఖమునఁ, జాణక్య, కాత్యాయన, యాత్రేయులుందురు.

చాణక్య—చంద్రగుప్త మహారాజా! భండన భీమపరాక్రమోత్కటుండవగు నీవు స్వీయబాహుబలమున హిందూకుష్ యహార్యమునుండి కన్యాకుమారి పర్యంతమొక విశాలసామ్రాజ్యము స్థాపన మొనరించి, యితః పూర్వమెన్నండుఁ బ్రాయశః భారతభూనాథులలో నేరి కల్పనందైనఁ జొరని మహత్కృత్య మొనరించితివి. నీనిరుపమానశక్తిచే యవనసామ్రాజ్యము యశేషవరూధినీ స్తోమంబుఁ బరాజిత మొనరించి వైచితివి! భారతేతిహాసమున

నీనామమనిశము ధన్యమై తనరారును. ఇఁక దిగంత విశ్రాంత ప్రతిభాసమన్వితుఁడవై యిలాపాలన మొనరింపుము. సర్వేశుఁడు నిన్నశ్రాంతము కృపఁజూచు గాక !

చం॥గు—గురువర్యా! మగధ ప్రతిభాసుధాకరునకుఁ జాణక్యాంశుమంతుఁడే కదా యాలోక మొసఁగవలయును. ఇంత దనుక 'చంద్రగుప్త మహారాజ నాటకమునకు' ప్రధానపాత్రలగు తామే యిఁకముందుఁ బాలనాకార్యమందు నాకు మార్గదర్శకులు కండు.

చాణ—వత్సా! నీపథమంతయుఁ బరిష్కారము గావించి వైచితిని. నాకార్య మంతయు నింతతో సాంతమాయెను. సర్వం కష ప్రజ్ఞుఁడవై నీవిఁక మహీరాజ్యము నేలుకొమ్ము. నేను సెలవు గైకొనెద.

చం॥గు—గురుదేవా! నే నేమి నేర మొనరించితినని నన్ను వీడి తా మరుగుచుంటిరి?

చాణ—వత్సా! నిన్ను వీడి వెడలుదుననుట నీయందేమో నేర మున్నదని కాదు. ఇంతదనుక నేఁ గావించిన దంతయు మిగుల నద్భుతమైన కర్జమేయయ్యు, అది విప్రోచితమైనది కాదు. దండ తాడితదర్వీకరంబు క్రియ నహితులఁ బొలియింపఁ బర్విడుట బ్రాహ్మణకార్యము కాదు. దర్పోచ్చాశ ప్రతిహింసలు ధరామరోచిత ప్రవృత్తులుకావు. క్షమ, తితిక్ష, త్యాగములే భూసుర ధర్మములు! భీరహితచిత్తాంభోజుఁడవై పడసిన సామ్రాజ్యమును యీయమాత్యవరు సహాయమునఁ బాలింపుము.

కాత్యా—మఱి మీరో?

చాణ—కాత్యాయనా! ఇఁక బ్రజాపాలన మొనరింప వాంఛింపను. అతులశౌంతిగభీరుండైన చంద్రగుప్తుఁడే అందులకు సమర్థుండు.—

అమ్మా! ఇఁక రమ్మా: (ఆత్రేయి నుద్దేశించి) నీవు నన్నుఁ బాలింపుము! వసుదేవపత్ని నవనీతచోరుని కరముల రెంటిని బంధించిన తెఱంగున నీ వీ భ్రాంతపుత్రుని హస్తద్వంద్వమును నీప్రణయలతికచే బంధించి వేయుము. — కాత్యాయనా! ఈమె యం దెట్టి యింద్రజాలమున్నదో యెఱుంగుదువా? ఈముద్దు పట్టి మోహమంత్రబలమున నేఁడు పాషాణఖండమును భిన్న మొనరించి పయోధారలు వెల్వడియెను! శుష్కతరువు ముంజ రితమాయెను!! తప్తవక్షమైన మరుభూమిపై సుధాజలధి వీచిక లానందక్రీడలఁ దేలియాడుచుండెను!!! — అమ్మా! రమ్మా!! అస్మజ్జీవనగోధూళి లగ్నమునఁ బూర్ణజ్యోత్స్నాలోకంబవై యవతరించి, మదీయైహిక జీవిత గాథ గగనమున వ్యాపృతవు కమ్మా! జగద్ధాత్రీమాతమాడ్కి నా యీ జీర్ణమందిరమం దవ తరణ మొనరించి నా ముం జేతులఁబట్టుకొని ఆలోకితపరజగతికిఁ గొనిపొమ్మా. చంద్రగుప్తా! — నే సెలవుఁగైకొనెద. ఆచంద్ర తారార్కమవనీ వలయమున నీయశశ్చంద్రికలు ప్రసరించు గాక! సభ్యులారా! మీరలందఱు మగధమహీరాజ్య హర్మ్యం బునకు భిత్తికలరై అరాతిభిత్తికల నంతమొందింపుఁడు. కాత్యా యనా! చంద్రగుప్త సార్వభౌముని కీవ దక్షిణ హస్తంబవు కమ్మా!! మీ యందఱి కతనధరామండలము శాంతము శాంతి ధామమై తనరారు గాక! ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః!

[ఆత్రేయి కరముఁ బట్టుకొని నిష్క్రమించును.]

చం॥గు— ఇట్టి శుష్క యావరణాభ్యంతరమున నింత హృదయ మున్నదా?

కాత్యా— ప్రకృతి నేఁడు ప్రకృతిస్థయాయెను! ఇంత కుశాగ్రబుద్ధి గల నరోత్తముఁడు హృదయరహితుని చాడ్పున నటియించెను.

ఇట్టి యనియ మవనీతలమున ననిశము స్థాయినై యుండఁ జాలునా ?

(మురఁ ప్రవేశించును.)

ముర—(ప్రమోదోత్ఫుల్ల వదనయై) — నాముద్దుపట్టికి జయమగు గాక !

[చంద్రగుప్త హెలెనులు సింహాసనము నుండి డిగ్గి మురకుఁ బ్రణమిల్లెదరు.]

ముర—దీర్ఘాయుష్మంతులరై సుఖంబుండుఁడు! "శూద్రవనితా !" యని ఆనాఁడు శ్రుతమైన సంబోధనమునకు నేఁ డిది,—యీ రాజవధూవరుల ప్రణామము సముచితోత్తరము ! ఆ 'శూద్రవనిత' నందనుఁడే నేఁడు భువనవిజయుండై భారతాధీశ్వరుం డాయెను !

చం॥గు—మాతృదేవి పవిత్రనామ మన్శాంతము ధరిత్రీవలయమున నిలచుటకై మగధరాజవంశ మిఁక "మౌర్యవంశ" మనఁ బరగు గాక !

ముర—వత్సా ! చిరంజీవివి కమ్మా. (హెలెను నుద్దేశించి) బిడ్డా ! చిరంజీవివి కమ్మా. నాగృహలక్ష్మివై విచ్చేసి నానిలయము నాలోకిత మొనరింపుము.

[నిష్క్రమించును.]

చం॥గు—హృదీశ్వరీ ! నేఁ డొక ప్రియవరుని మధురస్వనము వీనులఁ బడకుండుటచే నీజయధ్వాన మొక ప్రకాండరోదనధ్వని చాడ్పు న వినంబడుచున్నది.

హెలెన్—ప్రభూ ! ఆప్రియవరుం డెవరు ?

చం॥గు—ప్రాణసముం డగు చంద్రకేతు. ఈవిజయోత్సవమున వాని ముఖమందటి ముఖములకంటె నుజ్జ్వలతమమైయుండెడిది ?

వాని వదనజ్యోతిచే నీయోలగమంతయు నాలోకితమైయుండెడిది? ఆమిత్రచంద్రుఁడు లేని కతన యీసభయంతయుఁ దామసీనిశీథిని చాడ్పునన్నుండెను!

హెలెన్—ఆతఁడు నేస్తకాఁడు మాత్రమే కదా!—అతఁడు లేని కొఱంత మీయర్ధాంగి తీర్పఁజాలదా?

చం॥గు—కుసుమాంగీ! మహిమాన్వితచరిత్రవయ్యు నీవా కొఱంతఁ దీర్పనేరవు. ఏజగంబున నుపకారమునకుఁ బ్రత్యుపకారముఁ బడయుటరిదియో; కావించిన సత్కార్య స్వీకారమైన నేరికడనైనఁ బడయు టీవసుధయం దసాధ్యమో, ఆపృథ్వియం దుద్భవించి, తన సర్వస్వమును యుదాసీనుండును, నిష్ఠురుండును నగు నొక నెయ్యరి చరణోపాంతమున ధారవోసిన త్యాగి యెట్టివాఁడో, ఆపురుషోత్తము, గోల్పోవుటెంతవంతయో, వానిఁ గోల్పోయిన నిర్భాగ్యుఁడే యెఱుంగును. అట్టి స్వార్థరహిత సుహృద్వరు నెడనేఁ గఠినుండనైతిని. ఆతఁడు నాయుదాసీనత్వమును నిజపద దళితమొనరించి వెడలిపోయెను. ఇపు డమ్మిత్ర రత్నము కడ కరిగి క్షమాభిక్ష వేఁడు భాగ్య మీయసుసమన్వితున కసాధ్యము. కాన, నేఁ జిరాపరాధినై వందరవలయును. ఈవేదన యజస్రము నాకుఁ దుస్సహామైయుండును! మిత్రస్మృతి—

[ఏంటిగోనసు ప్రవేశించును.]

ఏంటి—మానినీవతంసమా! శుభము!! శుభము!!!

హెలెన్—(చకితయై)—ఎవరు! ఏంటిగ్గోనసా!!

[రెండు చేతులతో ముఖముఁ గప్పుకొనును.]

ఏంటి—సోదరీమణీ! యవనవిషయము నుండి భ్రాతృస్నేహాశీర్వాదమను వివాహయౌతుకము భవదర్థమై కొనివచ్చితిని. భారత సామ్రాజ్య రమాలలామవై, గుణరత్నాకల్పవై చిరంబు వర్ధి

ల్లుము. — (చంద్రగుప్తు నుద్దేశించి)—భారతసార్వభౌ
శ్యాలకశుల్కముగ నీకొఱకై యీలోహద్భుత ముష్టిబద్ధ
ణముఁ గొనివచ్చితిని. ఈకరవాలమును నీసామ్రాజ్య
ణార్థము నియుక్త మొనరింపుము. (ఇట్లని యేంటిగోనసు
చంద్రహాసమును చంద్రగుప్తుని చరణోపాంతమం దుంచు
చం॥గు—మాశుభ్లాభిలాషివై యిచ్చేసిన పవిత్రాత్ముండ వీ
డవో తెలుపఁగోరెద.
ఏంటి—నన్ను గుఱుతింప నేరకుంటిరా? రాజశేఖరా! న
మఱచినను నిన్నేను మఱువలేదు. ఏ వీరవతంసుని కృ
ఘాతమున నేంటిగోనసు కరవాలము సింధునది తీరమునఁ
చ్యుతమాయెనో నేఁడు మ్రోల నిలచి నయ్యేంటిగోనసావె
లీని మఱువలేను. ఆనాఁటి సుఘటనము నిక్కముగ దైవి
కావుననే యీయువకుని నేఁటి భారతసార్వభౌముండైన ఆప
మశాలి పితృహత్యా మహాకలుషంబు నుండి కాఁపాడెను.
చం॥గు—యువకా! నీపిత యెవరు?
ఏంటి—యవనసార్వభౌముండగు సెల్యూకసు.
హెలెన్—(నివ్వెరపడి)—ఏమి! సెల్యూకసు నీ జనకుఁడా?
ఏంటి—సోదరీ! అవును. నీవు నాయువరాగాను నయముల
మాటలు పెడచెవిం బెట్టుట గడు నుత్తమం బాయెను.
కూడ భగవదేచ్ఛయే! నారీశమంతకమా! నీవిఁక నన
యన్నగఁ బ్రేమింపఁజాలుదువా?
హెలెన్—(అబ్బురమున)—ఏంటిగోనసూ! నీవు నా యనుజుఁ
ఆహా! ఏమి యీ మహావిప్లవము! ఏమి యీ యాశ్చర్య
ఘటనము! ఒక్కమాతే ధ్వంశము సృష్టియు, మృత్యువు
న్నంబునా? యువకా! నీవు నా యన్నవా?

ఏంటి—చెల్లెలా! అవును!

హెలెన్—అనుజా! ఒక బృహద్దుఃఖభృద్భారమును నా వక్షమునుండి నీవు తొలఁగించివైచితివి. ఇపు డేనతి సులభంబుగ నిశ్శ్వాసము వీడుచుంటిని. అగ్రజా! తెలియనితనమునఁ బల్మఱు నిన్ను నేఁ దూలనాడితిని. (సోచ్ఛ్వాసమున) అన్నా! నన్ను మన్నింపుము!

(ఇట్లని యామె ఏంటిగోనసు పదతలమందు బతితయగును.)

ఏంటి—సోదరీ! లెమ్ము. గతమును మఱువుము. (ఆమెను లేవఁదీసి, చంద్రగుప్తు నుద్దేశించి) సార్వభౌమా! నీకు నేఁడు లభించిన రత్నమును సయత్నమున వక్షఃపీఠమున ధరింపుము. ఇటువంటి రత్నము జగతియందు మఱొండు లేదు. నిదాఘనిర్మేఘప్రభాత మీ కాంతాశమంతకము సౌందర్యము మ్రోల మిగుల మ్లానమై తోఁచును! ప్రావృడ్విభావరీవిద్యూత మీ సతీమతల్లిక మేని కాంతికడ లజ్జిత యగును. కాని, యీ యద్భుతరూప మామె మహాదంతఃకరణము మ్రోల నేమియుఁ గాదు. బాహిరమం దీమె యచ్చర, అంతరమున దేవి.

(ఛాయ ప్రవేశించును.)

ఛాయ—భారతప్రభు ప్రభ్వీణులకు జయమగుఁగాక!

చం॥గు—ఓహో! మలయసామ్రాజ్ఞియా? యువతీశిరోమణీ! రమ్ము! ఈ ప్రియమణోత్సవమును నీ ప్రేమహాసనముచే సంజీవిత మొనరింపుము.

ఛాయ—సార్వభౌమా! భారతసామ్రాజ్ఞికి నా చిన్ని యుడుగర నొసఁగ నరుదెంచితిని. దేవర యనుమతిఁ బ్రసాదించుచో నీ రత్నహారోపహారమును స్వీయకరములచే రాజ్ఞీమతల్లిక గళమునవైచి చనియెదను.

చం॥గు—(ఆశ్చర్యమున)—ఎందటికిగెదవు?

ఛాయ—(మ్లానహాసనము సల్పి)—సన్యాసినినైన ఛాయ కీవిపుల బ్రహ్మాండమున సుమంతైన తావలము ప్రాపింపదా?

చం॥గు—ఛాయా దేవీ! మహాత్ముండగు చంద్రకేతు నన్నుఁ బరిత్యజించి చనియెను. నీవుకూడ నన్నుఁ బరిత్యజించి చనకుము. నా కీవు భగినీస్వరూపిణివి కమ్మా. నా హృదయశూన్యస్థానము నీవు పూర్ణ మొనరింపుము.

"మహారాజా!—" అని ఛాయ నతమస్తకయగును. పిదప శిరమెత్తి ఆమె యిట్లనును. "అట్లే కానిండు. నేనీ యభిమానమును చూర్ణ మొనరింతును. ఈ మహాగ్నిపరీక్షనుండి నేఁ బలాయన మొనరింపను. సోదరి కరణి మీ పార్శ్వమున నిలచి రాజదంపతులగు మీ సుఖముగాంచి సుఖినగుదును. అదె నా వ్రతముగుగాక! అదె నా సాధనముగుగాక! అదె నా జీవనతపంబగుగాక! రాజాధిరాజా! ఆతపంబు సిద్ధించుగాకనుచు నన్నాశీర్వదింపుఁడు."

(వసనాంచలిచే ముఖముఁ గప్పుకొనును.)

హెలెక—(సింహాసనమునుండి డిగ్గి, అగ్రసరయై, అనురాగపురస్సరముగ ఛాయకరముఁ బట్టుకొని)—లేమా! నీయానన మెత్తుము. నీకింత వంతయేల? ముఖమెత్తి ప్రేమమెయి నన్నుపలక్షింపుము. సోదరీ! రమ్మా! ఇర్వురు నిర్ఝరిణుల మొకే నీరధియందు లీనమగుదము! వృష్టి రవ్యాలోకములము కలసి కాదంబినీకాయమున నిర్ధనుపును రచన మొనరింతము రమ్మా. చెల్లెలా! ఆర్తియేల?—ఒకే వియత్తలమునఁ గురంగలాంఛన నీరజాప్తు లిర్వురుదయింపరా? మిన్నా! రమ్మా!

ఛాయ—"రాజ్ఞీతిలకమా! ఈ యాధి సహింతును. ఊరక శోకాతురా

న్నితఁ గా,నేల? సహింపఁజాలకున్న నారీ జన్మ మేల యెత్తితిని? హరిణాంకముఖీ! అట్లే నిలువుము. ఈ రతనములపేరును నీ కంఠసీమయం దలంకరింపనిమ్మ. (కరముఁ బట్టుకొని)—పూర్ణయామినీకాంతుఁబోలు యీ ముఖబింబమును, అతి సౌందర్య నిశాంతమగు నీ తనుల్లతయు, నుదారరస ప్రపూర్ణంబైన యీ హృదయకరండమును నిక్కముగ మదీయచంద్రగుప్తునకుఁ దగినవి. మహాత్మురాలవగు నీవే యీ పురుషోత్తమునకుఁ దగు సహధర్మిణివై సుఖం బొసఁగఁజాలుదువు. ఇఁకెట్టియార్తి లేదు.—దరికి రమ్మ"

ఇట్లని ఛాయ మణిహారమును హెలెన్ కంఠదేశమున వేయబోవ హెలెనామె కరద్వయముఁ బట్టుకొని "సోదరీ! నీవు పొరపడుచుంటివి. ఈహారము నేరి కంఠమున వేయవలెనో జూపెదఁ రమ్మ" అని యామె ఛాయచేతులచే మాలను చంద్రగుప్తుని కంఠమందు ధరింపఁజేయును.

కాత్యా—సుముహూర్తమస్తు! సుప్రతిష్ఠితమస్తు! శాంతిఃపుష్టిస్తుష్టిశ్చాస్తు! శుభగం శుభమస్తు! సర్వసంపదస్తు! దీర్ఘమాయురస్తు! వృద్ధిరస్తు! అవిఘ్నమస్తు! ఆయుష్యమస్తు! ఆరోగ్యమస్తు! స్వస్త్యస్తు! పుత్రసమృద్ధిరస్తు! ఇష్టసంపదస్తు! యచ్ఛ్రేయస్తదస్తు! శుభకర్మణ్యావిఘ్నమస్తు! శాంతిరస్తు! పుష్టిరస్తు! తుష్టిరస్తు! శుభగం శుభం!!!

సభికులు—తథాస్తు! తథాస్తు!! తథాస్తు!!!

తదుపరి హెలెన్ ప్రమోదభాస్వరముఖాంభోజయై ఛాయాదేవి బాహుద్వంద్వమును ముందునకు లాగి, అక్కరయుగ్మమును నిజకంఠమున వైచుకొనును.

హెలెన్—అన్నులమిన్నా! ఆహారముకంటె ననేక మడుంగు లధిక మూల్యంబు గలదగు నీ బాహునాళీకహారమును నాగళమున

వేయుము. (ఆలింగన మొనరించుకొని)—లతాంగీ! నీవు చంద్ర
గుప్త మహారాజు సోదరివి కావు, నాసోదరివి" అని వచించును.

ఏంటి—చంద్రగుప్త మహారాజా! నీవు ఛాయాదేవి సోదరుండవు
కావు,—నీవు నాసోదరుండవు.

[కౌగిలించుకొనును.]

ముర—ధన్యము! ధన్యము!! ధన్యము!!! సురలారా! సుమ
వర్షముఁ గురిపింపుఁడు!!

కాత్యా—నిలింపులారా! శుభదుందుభుల మ్రోయించుఁడు!!

[పత్నీద్వయ సహితుఁడై చంద్రగుప్తుఁడు తల్లికిఁ బ్రణమిల్లును.]

ముర—ఐశ్వర్యమస్తు! ఆయుష్యమస్తు!! శాంతిరస్తు!!!

[కొడుకును కోడండ్రను కౌగిలించుకొనును.]

[ఏంటిగోనను మురకుఁ బ్రణమిల్లును.]

ముర—తనయా! యశస్తిలకుండవై చిరంజీవివి కమ్ము!!

అమాత్యులు—జయ్! చంద్రగుప్త మహారాజునకు జయ్!!

సభ్యులు—జయ్! భారతమాతకు జయ్!! జయ్! భారతమాతకు
జయ్!! జయ్! భారతమాతకు జయ్!!!

[పిదప గరతాళధ్వానములు మిన్ను ముట్టును.]

[తెరపడును.]

సంపూర్ణము.